౧

# కమ్యూనిస్టుపార్టీ చరిత్ర

౧

[ 1921 నుండి 1951 వరకు గల ముప్పై సంవత్సరాల చరిత్ర ]




ర చ న :

హూ ఛి యా వో - మూ

( చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్రచారశాఖకు, వైస్-డైరెక్టరు )

అనువాదం :

సి. మ హే శ్





త్రిలింగ పబ్లిషింగ్ కంపెనీ

వి జ య వా డ - 2

## ఒకటో అధ్యాయం

చైనా కమ్యూనిస్టుపార్టీ, 1921, జులై 1వ తారీఖున స్థాపించబడింది. దానికి యీనాటికి ముప్పయ్యేళ్లు నిండినాయి. చైనా చాలా పెద్దదేశం; దాని ప్రజలసంఖ్య ప్రపంచప్రజల సంఖ్యలో నాలుగోవంతు; చైనాదేశం, అర్ధ-భూస్వామిక అర్ధ-వలస స్వభావాన్ని కలిగివుంది. ఇలాంటి లక్షణాలను చైనాదేశం కలిగియున్నదన్నమాట. చైనా కమ్యూనిస్టుపార్టీ యొక్క ముప్పయిసంవత్సరాల చరిత్రయంటే, పైలక్షణాలనుకలిగియున్న చైనాదేశంలో మార్క్సిజం - లెనినిజం, యే విధంగా అఖండవిజయాన్ని సాగించగలిగింది? అన్నదాని చరిత్రయన్నమాట; చైనా కార్మికవర్గం, సామ్రాజ్యవాదులు వారితొత్తులకు వ్యతిరేకంగా వీరోచితపోరాటాలు చేయుటకై అసంఖ్యాకులైన రైతాంగప్రజలను, తదితరప్రజాతంత్రశక్తులను ఎలా నడిపింది? అన్నవిషయంయొక్క చరిత్రయన్నమాట; అంతేగాక, అనేకసంవత్సరాలకాలంపాటున అంతులేని కష్టాలకు గురియవుతూ, అనేక తిరుగుళ్ళకు లోనవుతూ, అంతిమంగా, అభివృద్ధి నిరోధకులపాలనను కూలద్రోయుట లోనూ, చైనాదేశపు కార్మికులు, కర్షకుల మిత్రత్వం ఆధారపడియున్న, చైనాశ్రామికవర్గంచే నడుపబడుచున్న ప్రజల ప్రజాతంత్ర రిపబ్లికును స్థాపించుటలోనూ, ఆ విధంగా, భవిష్యత్తులో సోషలిజంవైపునకు పురోగమింపజేయుటకు, విశాలమార్గ మేర్పరచిన చైనాకార్మికవర్గ చరిత్రయన్నమాట.

చైనా కమ్యూనిస్టుపార్టీయొక్క గత ముప్ఫయిసంవత్స రాల పోరాటచరిత్రను నాలుగుకాలాలుగా విభజించవచ్చును.

(1) పార్టీస్థాపన; 1921–27 సంవత్సరాల ప్రథమ విప్లవాత్మక అంతర్యుద్ధం.

(2) 1927 నుండి 1936 వరకు ద్వితీయ విప్లవాత్మక అంతర్యుద్ధం.

(3) 1937–1945 వరకూ జపాను దురాక్రమణ, ప్రతిఘటన యుద్ధం.

(4) మూడవ విప్లవాత్మక అంతర్యుద్ధం; చైనా ప్రజా రిపబ్లికుస్థాపన. ఆర్థిక పునర్నిర్మాణకాలం, 1945.

ఈ క్రిందిపేజీలలో యివ్వబడేది గత ముప్ఫయి సంవత్స రాల చరిత్రకు సంక్షిప్తరూపం మాత్రమే.

## 1. చైనా కమ్యూనిస్టుపార్టీ స్థాపన; ప్రథమ విప్లవాత్మక అంతర్యుద్ధం

చైనా కార్మికోద్యమాన్ని మార్క్సిజం, లెనినిజంతో సమ్మేళన మొనరించుటద్వారా యేర్పడిన ఫలితం చైనా కమ్యూనిస్టుపార్టీ. 1921 సంవత్సరంలో చైనా కమ్యూనిస్టు పార్టీ స్థాపించబడిందంటే అది హఠాత్సంఘటనకాదు. ప్రథమ ప్రపంచ సంగ్రామకాలంలో రష్యాలో అక్టోబరు సోషలిస్టు మహావిప్లవం యేర్పడటం, తరువాత 1919 మే నెల 4 వ తారీఖున వర్సియిల్సులో జరిగిన సామ్రాజ్యవాద సంధికి వ్యతిరేకంగానూ, సామ్రాజ్యవాదానికి, జమీందారీవిధానా

నికి వ్యతిరేకంగా చైనా ప్రజలచే ప్రారంభింపబడిన దేశభక్తియుతమైన మే నాల్గవ తేదీ వుద్యమాలఫలితంగా చైనా కమ్యూనిస్టుపార్టీ స్థాపించబడింది.

ప్రథమ ప్రపంచ మహాయుద్ధకాలంలో; అంతవరకూ బలహీనంగానున్న చైనా దేశపు పరిశ్రమలు, వేగంగా అభివృద్ధి జెందసాగేయి; వాటితోపాటు సంఖ్యారూపంలో చైనాకార్మిక వర్గంకూడా అభివృద్ధి జెందింది; అంతేకాక, చైనా కార్మిక వర్గంయొక్క పోరాటాల పరిమాణంకూడా పెరిగింది. రష్యా దేశంలో అక్టోబరు మహావిప్లవం విజయాన్ని సాధించిన తర్వాత, చైనదేశపు విప్లవాత్మక మేధావివర్గాలలో మార్క్సిజం - లెనినిజం యొక్క ప్రభావం ప్రవేశించింది. "మే" నాల్గవ తేదీ వుద్యమం, మార్క్సిజం - లెనినిజంతో చైనా దేశపు కార్మికోద్యమం సమ్మిశ్రితమవుటను త్వరితం చేసింది; ఆవిధంగా, అది పార్టీస్థాపనకు కావలిసిన పునాదులను వేసింది, "మే" నాల్గవ తేదీ వుద్యమం సంభవించిన ఒక సంవత్సరం కాలం గడిచినతర్వాత, షాంఘై, పెకింగ్, హాంకోవ్, ఛాంగ్షా, కాంటన్. త్సినాన్, హాంగ్‌చౌ లాంటి మహానగరాలలో చిన్నచిన్న కమ్యూనిస్టు గూళ్ళు యేర్పడ్డాయ్.

చైనా దేశపు కార్మికులసంఖ్య పెరుగుదలతోపాటు, చైనా దేశం అర్ధ - వలస హోదాలకు దిగజారిపోజొచ్చింది; ఇదెలా జరిగిందంటే, చైనాలో సామ్రాజ్యవాదుల దురాక్రమణ ఫలితంగా యేర్పడింది; తత్ఫలితంగా విదేశ దురాక్రమణదారులు, వారితొత్తులైన చైనాదేశపు ఫ్యూడల్ పాలకులకు వ్యతిరేకంగా చైనా దేశప్రజల పోరాటంకూడా పెరుగజొచ్చింది

1840 సంవత్సరంలో బ్రిటనుయొక్క సాయుధసైన్యాలు చైనాదేశంపై దండెత్తినాయి; నల్లమందు యుద్ధాన్ని ప్రారంభించాయి, ప్రథమ అసమానసంధులపై సంతకం చేయువలసినదిగా (నాన్‌కింగ్ సంధి) చైనానును బలవంతపెట్టేయి. దీని తర్వాత, 1857 సంవత్సరంలో చైనాదేశంపై ఆంగ్లో-ఫ్రెంచి యుద్ధం చేయబడింది. 1884 సంవత్సరంలో చైనాదేశానికి ఫ్రెంచిదేశానికి మధ్య యుద్ధం సంభవించింది. 1894 సంవత్సరంలో చైనాదేశానికీ, జపానుదేశానికి మధ్య యుద్ధం సంభవించింది. 1900 సంవత్సరంలో చైనాదేశంపై ఎనిమిదిశక్తులు (రాజ్యాలు) యుద్ధంజేసేయి 1914 సంవత్సరంలో చైనాదేశానికి జెందిన షాన్‌టంగ్‌ద్వీపాన్ని, చైనానుండి జపాను గుంజివేసుకొంది. ఈ యుద్ధాలద్వారాను తదితర పద్ధతుల ద్వారానూ చైనాదేశాన్ని ముక్కలుముక్కలుజేసి విదేశ దురాక్రమణదారులు మింగసాగేరు. చైనాదేశంనుండి "నష్ట పరిహారాలను" గుంజసాగేరు. చైనాగడ్డపై తమ సైన్యాలను నిలవుంచే విశిష్టాధికారాలను విదేశదురాక్రమణదారులు చైనాదేశమునుండి పొందేరు. చైనాదేశంలో విదేశదురాక్రమణదారులు తమ బ్యాంకులను, వ్యాపారసంస్థలను, ఫ్యాక్టరీలను స్థాపించుకొనే హక్కులను పొందేరు. అంతేగాక యీ విదేశ దురాక్రమణదారులు చైనాదేశపు వ్యాపార రేవులను, రవాణా మార్గాలను, కస్టమ్స్‌శాఖలను తమ కంట్రోలుక్రిందకు తెచ్చుకొన్నారు. "తమ పలుకుబడిక్రింద వుండే ప్రదేశాలను" ఏర్పరచుకొన్నారు. వీటన్నింటిసాయంతో విదేశీదురాక్రమణదారులు చైనాదేశంయొక్క ఆంతరంగిక వ్యవహారాలను

తామే నడుపసాగేరు. అంతేగాక, చైనాదేశాన్ని రాజకీయంగానూ, ఆర్థికంగానూ, అర్ధ - వలస హోదాకు దించివేసేరు. సామ్రాజ్యవాద దురాక్రమణ చైనాప్రజల అస్తిత్వానికేముప్పు తెచ్చింది. చైనాదేశపు ఆర్థికాభివృద్ధినీ, రాజకీయ పురోగమనాన్నిదుస్సాధ్యంచేసింది. ఆవిధంగా చైనాదేశంలో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడుటనేది సామ్రాజ్యవాద పరిపాలనను కూలద్రోయుటనేది చైనా విప్లవంయొక్క అత్యంతప్రధాన కర్తవ్యంగా తయారయ్యింది. విదేశ పెట్టుబడిదారీవిధానం చైనాదేశంలో చొచ్చుకొనిపోయినకొలదీ, తత్ఫలితంగా చైనాదేశపు ఫ్యూడల్ ఆర్థికవిధానం (భూస్వామికవిధానపు ఆర్థికవిధానం) భగ్నం గాజొచ్చింది; చైనాదేశీయ పెట్టుబడిదారీవిధానాభివృద్ధికి వుత్తేజం కలుగజొచ్చింది. చైనాదేశపు ఆధునికపరిశ్రమలు, 1860 సంవత్సరం ఆప్రాంతాలకాలంలో, పైకి రాజొచ్చాయి. అయితే సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజముల ద్విముఖపీడినమూలంగా చైనాదేశపు యీ జాతీయపరిశ్రమలు చాలాంబలహీనంగా వుండిపోవలసివచ్చింది; అభివృద్ధిజెందుటకు చాలా దశాబ్దాలు పట్టింది. ఫ్యూడలిజంయొక్క అవసానదశలలో, చైనాదేశపు అభివృద్ధినిరోధక పరిపాలకులు, వివిధవర్గాలకుజెందిన శ్రామికప్రజానీకంపై, రాక్షసపరిపాలన చేయజొచ్చెను. భూస్వామివర్గంచేతులలో వ్యవసాయానుగుణ్యమైన భూమిలో అత్యధికభాగంవుండిపోయింది; వస్తుతః ఆ భూములను సేద్యంచేయుచున్న రైతుల ఆదాయంనుండి ఈభూస్వామికవర్గం ఎక్కువభాగాన్ని కొట్టేసేవారు; యీ భూస్వాములకు ఆర్థికంగా విశిష్టాధికారాలుండు

టయేగాక, అనేకరకాల విశిష్టాధికారా లుండేవి. వడ్డీవ్యాపారస్తులు, వ్యాపారస్తులు, దళారులు (కాంప్రడోర్స్) జమీందారీవిధాన నిరంకుశులు (ఫ్యూడల్ బ్యూరోక్రాట్స్), భూస్వాములు అందరూకలిసి, రైతాంగప్రజలను, చేతిపరిశ్రమల శ్రామికప్రజలను దోచేసేవారు ఇకపరిశ్రమల విషయంజూస్తే పరిశ్రమలలో కొన్నిటిపై సామ్రాజ్యవాదుల పెత్తనం వుండేది; మరికొన్నింటిపై చైనాదేశపు నిరంకుశులకు పెత్తనం వుండేది. మరి కొన్నింటిపై చైనాదేశపు పెట్టుబడిదారుల పెత్తనవుండేది. సామ్రాజ్యవాదులూ, చైనాదేశపు నిరంకుశాధికారులూ కలసి చైనాదేశపు పెట్టుబడిదారులను అణచివేస్తూవుండేవారు; పిండివేస్తూ వుండేవారు.

చైనాదేశపు ఫ్యూడల్ – నిరంకుశ ప్రభుత్వం, చైనా ప్రజల విప్లవోద్యమాన్ని అణచివేయుటలో, సామ్రాజ్యవాదుల సహాయం పైననూ; సహాయంపైననూ చాలాకాలంవరకూ ఆధారపడింది. 1900 సంవత్సరంలో జరిగిన యుద్ధంలో చైనాదేశపు ఫ్యూడల్ – నిరంకుశప్రభుత్వం పరాజయం పొందింది; యీ దెబ్బతో, అది సామ్రాజ్యవాదులకు పూర్తిగా లొంగిపోయింది. అటు తర్వాతకాలంలో, యుద్ధస్వాముల నాయకత్వాన 1912 సంవత్సరంలో, స్థాపించబడిన "చైనారిపబ్లికు" అని పిలువబడిన దాని ప్రభుత్వాలుకూడా పై పరిస్థితులలోనే దొర్లేయి; అంటే, సామ్రాజ్యవాదులకు లొంగివుండే తమ యేలుబడిని సాగించేయి; అంతేగాని, పరిస్థితులలో యేమీ మార్పులేదు. 1912 సంవత్సరం తర్వాత సంభవించిన ప్రధాన (మూల) మార్పు యేమంటే, అంతవరకూ పైకి

స్వమైక్యంగా కనుపడే చైనాలో, చీలికలు బహిర్గతమయ్యాయి. చైనా దేశంలోని యుద్ధ - స్వాములలో కొందరిని ఒక దేశపు సామ్రాజ్యవాదులు, మరికొందరిని, యింకొక దేశపు సామ్రాజ్యవాదులూ సపోర్టుచేయ సాగేరు. తమ తమ సామ్రాజ్యవాద యజమానుల సపోర్టుతీసుకొని చైనాదేశపు యుద్ధస్వాములు (వార్ లార్డ్సు) నిర్విరామంగా తమలో తాము కలహించజొచ్చేరు; ఒకరిపై మరియొకరు యుద్ధాలు చేయజొచ్చేరు. 1912 సంవత్సరానికి పూర్వకాలంలోనూ, అటుతర్వాత కాలంలోనూకూడా వివిధ ముఠాలకు జెందిన ఫ్యూడల్ పరిపాలకులు యదార్థమైన సామాజిక సంస్కరణ లను ప్రవేశపెట్ట నిరాకరించేరు. ఆ విధంగా చైనాదేశంలో ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా పోరాడుటయనేదీ, ఫ్యూడలిజం యొక్క పరిపాలనను కూలద్రోయుటయనేదీ చైనా విప్లవం యొక్క అత్యంత ప్రధాన కర్తవ్యాలలో మరియొకటిగా తయారయ్యింది;

పైన వర్ణించబడిన పరిస్థితులలో చైనాప్రజల ప్రాథమిక డిమాండ్లుయేమంటే సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజముల పీడనను కూలద్రోయాలనీ, చైనాదేశానికి స్వాతంత్ర్యాన్నీ, ప్రజాతంత్రాన్నీ, స్వేచ్ఛనూ సాధించాలనేవి.

ఈ ప్రధానకోర్కెలను సాధించుటకొరకు సవ్య నాయకత్వం కావాల్సివచ్చింది. నల్లమందు యుద్ధకాలమునుండి "మే" నాల్గవ తేదీ వుద్యమమువరకు సామ్రాజ్యవాదానికీ, ఫ్యూడలిజానికీ వ్యతిరేకంగా చైనాప్రజలు అనేక పోరాటా లను నడిపేరు. ఇందులో అత్యంత ప్రధానమైనది 1851-1864

సంవత్సరాలమధ్య జరిగిన రైతాంగప్రజల విప్లవాత్మకయుద్ధం; యీ విప్లవాత్మకయుద్ధం నల్లమందుయుద్ధం సంభవించిన పది సంవత్సరాలతర్వాత సంభవించింది; యీ విప్లవాత్మకయుద్ధం "తైపింగ్ రాజ్యాన్ని" జనింపజేసింది; యిక ప్రదేశ్ళకు కమ్యూనిస్టుపార్టీ స్థాపింపబడుతుందనగా 1911 సంవత్సరంలో సంభవించిన బూర్జువా విప్లవానికికూడా నాంది అయ్యింది. ఏమైనప్పటికి, యీ విప్లవాలు, పోరాటాలు, పరాజిత మయ్యాయి. తాను బలహీనంగా వుండుటచే, చైనా బూర్జువా వర్గం, సామ్రాజ్యవాదాన్నీ, ఫ్యూడలిజాన్నీ జూచినా, కార్మికులన్నా, కర్షకులన్నా భయపడింది; సామ్రాజ్యవాదానికి, ఫ్యూడలిజానికు వ్యతిరేకంగా పోరాట సమస్యనుగురించి యిద మిద్ధమని తెల్పలేకపోయింది సరిగదా, ఆసమస్య వూసైనా ఎత్తే ధైర్యం దానికి లేకపోయింది. చైనాదేశపు జనాభాలో రైతాంగప్రజలు అత్యధిక సంఖ్యాకులు; వారికి, సామ్రాజ్యవాదాన్నీ, ఫ్యూడలిజాన్నీ, ఎదిరించాలనే దృఢనిశ్చయముంది; కాని, ఉత్పత్తిపద్ధతులలో వారు చాలా వెనుకబడియున్నారు; ఉత్పత్తిపద్ధతులలో వెనుకబడినతనంవల్ల, రైతాంగప్రజలకు, పోరాటంయొక్క భవిష్యత్తునుగురించి చక్కగా చూడగలిగిన సామర్థ్యం లేకపోయింది; విప్లవాన్ని విజయంవైపునకు నడిపే కర్తవ్యభారాన్ని మోసే సామర్థ్యం రైతాంగ ప్రజలకు లేకపోయింది. నాయకత్వ బాధ్యతను వహించటానికి ఒక నూతన వర్గం అవసరమయ్యింది. అలాంటి నూతనవర్గం యెలాంటిదై వుండాలంటే, పోరాటంకొరకు సవ్యమైన, పరిపూర్ణమైన కార్యక్రమాన్ని ముందుంచగలిగేదిగానూ, బలవంతుడైన శత్రువు

నకు వ్యతిరేకంగా పోరాటాన్ని గట్టిగానూ, దీక్షాయుతంగానూ సాగించుటకై, సమైక్యమొందించుటకు వీలైనన్ని దేశీయ, విదేశీయ శక్తులన్నింటినీ ఐక్యమొందించుటకు సమర్ధవంతమైనట్టిదిగానూ వుండాలి. కార్మికవర్గమే అలాంటివర్గం. చైనా కార్మికవర్గం సంఖ్యారూపేణా చిన్నదైనప్పటికీ (చైనా కార్మికుల సంఖ్య ఆనాటికి ముప్పది లక్షలు మాత్రమే) చైనాదేశపు రైతాంగప్రజలకు, దీటికి భేదముంది. ఎందువల్లనంటే, చైనాకార్మికవర్గం నూతన ఉత్పత్తిశక్తులకు ప్రాతినిధ్యం వహిస్తూవుంది. చైనా బూర్జువావర్గానికీ, చైనాకార్మికవర్గానికి భేదముంది. ఎందువల్లనంటే, చైనా కార్మికవర్గం ముప్పేట పీడనకు గురి అవుతూవుంది. అంటే సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజం, పెట్టుబడిదారీవిధానాల పీడనకు చైనాకార్మికవర్గం గురియవుతూవుంది. అంతేగాక చైనాకార్మికవర్గానికి పై మూడింటికీ వ్యతిరేకంగా పోరాడాలనే గట్టి పట్టుదలవుంది.

1919 సంవత్సరంలో సంభవించిన "మే" నాల్గవ తేదీ వుద్యమంలో చైనాకార్మికవర్గం తనబలాన్ని ప్రదర్శించసాగింది. మార్క్సిజం – లెనినిజంయొక్క ప్రభావాన్ని ఆమోదించ ప్రారంభించింది. చైనాదేశ చరిత్రలో మొట్టమొదటి సారిగా షాంఘై, తాంగ్‌షాన్, చాంగ్సిన్‌టియన్ నగరాలలోని కార్మికులు రాజకీయసమ్మెకు పిలుపునిచ్చేరు. అంటే, జాతిమొత్తంమీద సామ్రాజ్యవాద వ్యతిరేకమైన ప్రజాపోరాటంలో తమ పాత్రను నిర్వహించేరన్నమాట. అంతేగాక, వారావిధంగా రాజకీయసమ్మె చేయవలసిందిగా పిలుపు యివ్వటంచే, విజయాన్ని త్వరితంచేయుటకై పోరా

టాన్ని తెచ్చుటకు సహాయపడ్డారన్నమాట. చైనాకార్మికవర్గ బలంయొక్క పెంపుదల, చైనా మేధావివర్గంలోని వామపక్షానికి నూతనోత్సాహాన్ని యిచ్చింది. వారు తమ మనస్సులను దిట్టపరచుకొని, నడుముబిగించి చైనాకార్మికులలో విప్లవాత్మక కార్యకలాపాలను సాగించుటకు సహాయభూత మయ్యింది. "మే" నాల్గవ తేదీ వుద్యమం, సాంస్కృతిక రంగంలో ప్రజాతంత్ర శాస్త్రవిజ్ఞానాలకొరకు పోరాట నినాదాన్ని యిచ్చింది; కాని, రష్యాలోని అక్టోబరు మహావిప్లవంయొక్క ప్రభావం క్రింద యీ వుద్యమంలోని వామపక్షం – కమ్యూనిజాన్ని గురించి ప్రాథమికభావాలను పొందిన విప్లవాత్మక మేధావులు– చైనాదేశం. సోషలిజాన్ని సాధించాలన్న భావాలనూ, చైనా విప్లవాన్ని నడుపుటకు మార్క్సిజం – లెనినిజాన్ని వినియోగించాల్సిన అవుసరంగలదన్న దృక్పథాన్ని వ్యాపింపచేయ సాగారు. వారీ దృక్పథాన్ని గట్టిగా కలిగియున్నారు. అంతేగాక, చైనాకార్మికులలో ప్రచారాన్నీ, నిర్మాణకార్యక్రమాన్నీ కొనసాగించేరు. ఈ విధంగా చైనాకార్మికోద్యమం మరియు చైనా విప్లవోద్యమం ఒక నూతనదశలో ప్రవేసించేయి.

కామ్రేడ్ మావోసీయూంగ్, "నూతన ప్రజాస్వామికం" అన్న తనపుస్తకంలో, 1919 సంవత్సరాన్ని గురించి చరిత్రలో ఒకక్రొత్త మలుపుగా భావించేడు; అంటే, చైనా ప్రజాతంత్ర విప్లవాన్ని, పాతరకపు ప్రజాతంత్ర విప్లవంనుండి ఒక నూతన రకపు ప్రజాతంత్ర విప్లవానికి మార్పుచెందించిన మలుపుగా భావించేడు, దీనికి కారణమేమంటే, ఆ తేదీనుండి చైనాలోని ప్రజాతంత్ర విప్లవం, చైనా కార్మికవర్గంచే నడుపబడే విప్ల

వంగా, తయారయ్యింది; ప్రపంచ శ్రామికవర్గ సోషలిస్టు విప్ల వంలో ఒకభాగంగా యేర్పడింది. ఈచారిత్రాత్మక సమీక్షలో, కామ్రేడ్ మావోసీటుంగ్, జాతీయసమస్యపైన లెనినిస్టు - స్టాలినిస్టు దృక్పథాన్ని చక్కగా, గట్టిగా వివరించేడు; అదేవిధంగా నంటే, ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం, రష్యాలో అక్టోబరు విప్లవం సంభవించిన తర్వాత, జాతీయ సమస్య యనేది ప్రపంచ శ్రామికవర్గ సోషలిస్టు విప్లవంలో అంతర్భాగమయ్యిందనీ, అంతేగాక, చైనాలో 1919 లో సంభవించిన విప్లవోద్యమం, "ప్రపంచవిప్లవంయొక్క పిలుపునకు జవాబుగా, రష్యను విప్లవంయొక్క పిలుపుకు జవాబుగా, కామ్రేడ్ లెనిన్ యిచ్చిన పిలుపునకు జవాబుగా యేర్పడిన" సంఘటనగా కామ్రేడ్ మావోసీటుంగ్ వివరించేడు. పై విషయాలపై కామ్రేడ్ మావోసీటుంగ్ లెనినిస్టు - స్టాలినిస్టు దృక్పథాన్ని వివరించిన వైనమది.

ఈ విషయాలనుగురించి మనం తెలుసుకొనేటప్పుడు కామ్రేడ్ లెనిన్ 1900 సంవత్సరంనాటికే అందులో ప్రత్యేకంగా 1912 - 1913 సంవత్సరాలలో చైనాసమస్యపై తన దృష్టిని కేంద్రీకరించి అత్యంత ప్రధానమైనవ్యాసాలు వ్రాసినాడన్న విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి. 1918 - 1920 సంవత్సరాలకాలమంటే అక్టోబరు విప్లవానంతరం అత్యంత క్లిష్టమైన సంవత్సరాలన్నమాట. యీ క్లిష్ట సంవత్సరాలలో అనేకసార్లు కామ్రేడ్సు లెనిన్, స్టాలిన్లు ప్రాగ్దేశాలలోని జాతీయసమస్యకు సంబంధించిన విషయాలకు దిక్సూచికత్వాన్ని ప్రసాదించేరు. ఈ దిక్సూచికత్వమే కామ్రేడ్ మావోసీటుంగ్

యొక్క "నూతన ప్రజాతంత్ర సిద్ధాంతానికి" మూలసూత్ర మయ్యింది. 1920 సంవత్సరం జులైమాసంలో జరుపబడిన కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ యొక్క రెండవ కాంగ్రెసులో జాతీయ మరియు వలససమస్యపై కామ్రేడ్ లెనిన్ ప్రత్యేక రిపోర్టును యిచ్చేడు; ఒక కార్యక్రమాన్ని ముందుపెట్టేడు. కామ్రేడ్ లెనిన్ యొక్క యీ మహోదాత్తరచనలు పీడిత జాతులకు, వలస, అర్ధవలస దేశాలలోని ప్రజలకు వారనుసరించవలసిన ప్రాథమిక విప్లవక్రమాన్ని స్పష్టంజేసేయి. జాతీయ విప్లవోద్యమాలలో ఆయాదేశాల కమ్యూనిస్టులు అవలంబించవలసిన మూలవిధానాన్ని వివరించేయి; తన్మూలంగా చైనా విప్లవానికి అంతులేనిసహాయం చేసినట్లయ్యింది.

"మే" నాల్గవ తేదీ వుద్యమం తర్వాత వివిధ కేంద్రాలలో చిన్నచిన్న కమ్యూనిస్టుగ్రూపులు అభివృద్ధిచెందినాయి. ఈ గ్రూపులచే ఎన్నుకోనబడిన 12 మంది డెలిగేట్లు చైనా దేశంయొక్క పరిశ్రమలకు, కార్మికోద్యమానికి కేంద్రమైన షాంఘైనగరంలో 1921 సంవత్సరం, జులై 1వ తారీఖున సమావేశమయ్యారు. ఈ సమావేశమే ప్రథమ కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసు. ఈ పార్టీ కాంగ్రెసులో పాల్గొన్న డెలిగేట్లలో మాసీయూంగ్, తుంగ్‌సీవు, చెన్ - తాన్ - ఛియూ, హూ - షూ - హెంగ్, మరియు, తదితరులున్నారు. వీరందరూ ఆనాడు 50 మంది కమ్యూనిస్టులకు ప్రాతినిధ్యం వహించేరన్నమాట. ప్రథమపార్టీ కాంగ్రెసు చైనాకమ్యూనిస్టుపార్టీయొక్క ప్రథమ నిబంధనావళిని యేర్పరచింది; పార్టీ కేంద్రసంఘాన్ని ఎన్నుకొంది; చైనా కమ్యూనిస్టుపార్టీని

స్థాపించింది. ఆనాటినుండి చైనాదేశంలో, పరిపూర్ణంగా నూతనమైన, సమైక్యతగల్గిన ఒకరాజకీయపార్టీ కార్మికవర్గము యొక్క ఒకపార్టీ, కమ్యూనిజాన్ని లక్ష్యంగాగలిగియున్న ఒకపార్టీ, తన కార్యాచరణకు మార్క్సిజం - లెనినిజాన్ని దిక్సూచిగా గలిగిన ఒకపార్టీ గోచరం కాజొచ్చింది.

కామ్రేడ్ మావోసీటూంగ్, హూనాన్ రాష్ట్రంలో "మే" నాల్గవ తేదీ వుద్యమానికిపూర్వమే, విప్లవసంఘాలను యేర్పరచేడు; ఆయన ఈ రాష్ట్రంలోని పార్టీ సంఘాలకు ప్రతినిధి. 1920 సంవత్సరములలో కామ్రేడ్ మావోసీటూంగ్, మార్క్సిజాన్ని అధ్యయనంచేయుటకు ఒకగ్రూపును సంఘటిత పరచినాడుకూడాను; అదేసంవత్సరంలో సోషలిస్టుయూత్ లీగును సంఘటితపరిచేడు. ప్రథమపార్టీ కాంగ్రెసు ముగిసిన తర్వాత కామ్రేడ్ మావోసీటూంగ్, హూనాన్ రాష్ట్రానికి తిరిగివచ్చాడు; హూనాన్ రాష్ట్రపార్టీ సెక్రటరీ పదవినితీసుకొన్నాడు. కామ్రేడ్ మావోసీటూంగ్ హూనాన్ రాష్ట్రంలో పనిచేయుటమూలంగా ఆ రాష్ట్రం ప్రథమ విప్లవాత్మక అంతర్యుద్ధంలో కార్మికోద్యమంలోనూ, కర్షకోద్యమంలోనూ అత్యంత పురోగామిక రాష్ట్రాలలో నొకటిగా తయారయ్యింది.

ప్రథమపార్టీ కాంగ్రెసు చెన్-తూ-హిస్యూను పార్టీ యొక్క కేంద్రసంఘాలను నడుపుటకు నాయకుడుగా ఎన్నుకొంది. ఏమైనప్పటికి చెన్-తూ-హిస్యూ మంచి మార్క్సిస్టు గాడు. "మే" నాల్గవ తేదీ వుద్యమానికి ముందుకాలంలోనూ, తదుపరికాలంలోనూ అతడు తీవ్రరకానికిజెందిన డెమాక్రాట్‌గా (ప్రజాతంత్రవాదిగా) మాత్రమే గుర్తించబడ్డాడు. చైనా

దేశంలో మార్క్సిజం ప్రవేశించినతర్వాత, బాగా పలుకుబడి గలిగిన సోషలిస్టు ప్రచారకుడుగానూ, కమ్యూనిస్టుపార్టీకి ధర్మపితగా తయారయ్యాడు.

1922 సంవత్సరం, "మే" మాసంలో హాంగ్‌చావ్ లోని వెస్ట్‌లేక్‌లో (హిసిహూలో) రెండవపార్టీ కాంగ్రెసు జరిగింది. ఈ కాంగ్రెసుపార్టీ మానిఫెస్టో నొకదానిని తయారు జేసింది; దానిలో పార్టీయొక్క కార్యక్రమాన్ని గురించి నిర్వచించింది; ఆనాడు, దేశంలో అమలులోనున్న వివిధరకాల బూర్జువా సంస్కరణవాద సిద్ధాంతాలను విమర్శించింది; చైనా ప్రజల మౌలిక కర్తవ్యాలను యీ క్రిందివిధంగా నిర్వచించింది:—

"అంతర్యుద్ధాన్ని అంతంజేయాలి; యుద్ధస్వాములను కూలద్రోయాలి; ఆంతరంగిక శాంతిని స్థాపించాలి; అంతర్జాతీయ సామ్రాజ్యవాద పీడనను కూలద్రోయాలి; చైనాజాతికి పరిపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించాలి; యావత్తు చైనాను వాస్తవిక ప్రజాతంత్ర రిపబ్లికుగా సమైక్యంజేయాలి."

ఆవిధంగా, చరిత్రలో ప్రప్రథమంగా, చైనా కమ్యూనిస్టుపార్టీ, చైనా ప్రజలముందు, వాస్తవిక ప్రజాతంత్ర నినాదాన్ని వుంచింది.

అయితే, ఆనాడు రచించబడిన చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రణాళికయొక్క కార్యక్రమంలోని లోట్లు యేమంటే, ప్రజాతంత్ర విప్లవం, శ్రామికవర్గంచే నడుపబడాలన్న విషయాన్ని ఎత్తిజూపలేదు; కార్మికులు, కర్షకులు, రాజకీయాధికారాన్ని హస్తగతం జేసుకోవాలన్న విషయాన్ని డిమాండు

చేయలేదు; భూమికోరకు రైతాంగప్రజల డిమాండును గురించి వివరించలేదు; కార్మికులు, కర్షకులు ప్రజాతంత్ర విప్లవంలో పాల్గొనాలని మాత్రం పిలుపునిచ్చింది; వారు తమ హక్కులకై పోరాడాలని మాత్రం పిలుపునిచ్చింది. అటు తర్వాతికాలంలో, 1924 -1927 సంవత్సరాలకాలంలో, పార్టీ, విప్లవాత్మక కార్యక్రమంలో, నాయకత్వం వహిస్తున్నప్పుడు, పైనుదహరింపబడిన లోట్లు, చెన్ - తూ - హిస్యూ యొక్క అవకాశవాద ముఠాచే పార్టీయొక్క సాధారణ రాజకీయ పంథాలో తీవ్రమైన పొరపాటుగా, ఘోరమైన తప్పిదంగా అభివృద్ధిజేయబడ్డాయ్. (అంటే, పార్టీ ప్రణాళికలోని లోట్లను అవకాశవాదముఠా తన వాదానికి అనుగుణ్యంగా వుపయోగించుకొన్నదన్నమాట- అను.)

రెండవపార్టీ కాంగ్రెసు, పార్టీ, కమ్యూనిస్టు అంతర్జాతీయ సంస్థలో జేరాలని తీర్మానించింది.

చైనా కమ్యూనిస్టుపార్టీ స్థాపించబడినతర్వాత రెండు సంవత్సరాలవరకు, పార్టీ చైనా కార్మికోద్యమాన్ని నడుపుటలో తనకృషిని కేంద్రీకరించింది. యావద్దేశములోనూ, కార్మికోద్యమాన్ని నడుపుటకై, బహిరంగంగా వ్యవహరించే చైనా ట్రేడ్ యూనియను సెక్రేటరియట్‌ను నెలకొల్పింది; అంతేగాక 1922 సంవత్సరం, 'మే' మాసంలో, కాంటన్ మహానగరంలో ప్రథమ అఖిలచైనా లేబరుకాంగ్రెసును జరిపింది. పార్టీ చురుకుగా పనిచేసిన ఫలితంగా, 1922 సంవత్సరం, జనవరి మాసంనుండి, 1923 సంవత్సరం, ఫిబ్రవరిమాసం వరకూగల కాలంలో, చైనాదేశమంతటిలోనూ, కార్మిక పోరా

టాలు మహాప్రవాహంలాగున విజృంభించేయి. యావద్దేశ మంతటిలోనూగల మహానగరాలలోనూ, పారిశ్రామిక కేంద్రాలలోనూ, వందకుపైబడిన సమ్మెలలో మూడులక్షల మంది కార్మికులు పాల్గొన్నారు. ఈ సమ్మెలన్నీ కమ్యూనిస్టు పార్టీ సభ్యుల నాయకత్వాన కొనసాగించబడ్డాయ్; ఈ సమ్మెలలో అత్యధికభాగం, పరిపూర్ణవిజయాన్ని సాధించాయ్. ఈ విజయాలను సాధించిన తర్వాత, కమ్యూనిస్టులచే నడుపబడుటకు కార్మికసంఘాలను కార్మికులు నెలకొల్పారు. కార్మికోద్యమమూ, కార్మికసంఘాలు, త్వరితగతిని అభివృద్ధిజెందటం యనేది, చైనాదేశపు రాజకీయ, ఆర్థికజీవితంలో, కార్మికుల ప్రదానపాత్రను అత్యంత త్వరితంగానూ, స్పష్టంగానూ, ప్రదర్శించింది.

ఏమైనప్పటికీ 1923 సంవత్సరం, ఫిబ్రవరి మాసంలో చైనా కార్మికోద్యమంయొక్క యీ ప్రథమ సంచలనంపై అభివృద్ధినిరోధక పాలకవర్గం, తీవ్రంగా దెబ్బతీసింది. ఆ కాలంలో హోపై, హోనాన్, హూపే, రాష్ట్రాలను పరిపాలిస్తున్న యుద్ధస్వామి వూ-పై-వూ అనునాతడు, పెకింగ్ - హాంకోవ్ రైల్వే కార్మికుల జనరల్‌ట్రేడ్ యూనియన్ ప్రారంభసమావేశాన్ని అణచివేయుటకు పశుబలప్రయోగం చేశాడు. వూ-పై-వూ జరిపించిన దారుణచర్యలకు వ్యతిరేకంగా తమ అసమ్మతిని తెలుపుటకై పెకింగ్-హాంకోవ్ రైల్వేకు సంబంధించిన కార్మికులు, తదితర రైల్వే లైనులకు సంబంధించిన కార్మికులు, సమ్మె చేయగానే, వూ-పైవూ - తనసేనలను రప్పించి, ఫిబ్రవరి 7వ తారీఖున

హాంకోవ్ చాంగ్షిక్ తియన్, రైల్వే కార్మికులపై దారుణ హత్యాకాండను ప్రారంభించాడు; ఈ సంఘటనలో 40 మంది కార్మికులు చంపబడ్డారు. వందలాదిమంది క్షతగాత్రులయ్యారు; యీ దారుణహత్యాకాండ "ఫిబ్రవరి 7వ తేదీ హత్యాకాండ"గా చరిత్రలో పిలువబడుతూవుంది.

చైనా రైల్వేకార్మికుల వీరోచితపోరాటం, కార్మికుల సంఘటనాత్మకశక్తియొక్క త్వరితాభివృద్ధిని, విప్లవాత్మకతక వుత్సాహాన్ని చూపెట్టింది; అంతేగాక, యావత్ చైనాదేశపు ప్రజలలో చైనా కార్మికవర్గం, చైనా కమ్యూనిస్టుపార్టీల రాజకీయప్రతిష్టను ద్విగుణీకృతం జేసింది. అంతేగాక, ప్రజా స్వామికహక్కులు యేమాత్రం లేనిపరిస్థితులలో, బలవంతులైన మిత్రులను చేకూర్చుకోనిదే స్వకీయమైన సాయుధసైన్యాలులేనిదే పరిపూర్ణంగా సాయుధులైన శత్రువులను కార్మికవర్గం వోడించజాలదని ధృవపరచింది. అభివృద్ధినిరోధకమైన ప్రభుత్వం అంతులేకుండా కార్మికులను యిక్కట్లపాలు జేయుచుండుటచే, నూతనంగాజనించిన కార్మికపోరాటాలు, తాత్కాలికంగా వొంగజొచ్చాయి; చైనా విప్లవంలో విజయాన్ని సాధించాలంటే, చైనాదేశపు ప్రజానీకంలో నూటికి ఎనభైవంతులమందిగానున్న, రైతాంగప్రజలతోనూ, లక్షలాదిసంఖ్యలోనున్నపట్టణపెటీ బూర్జువావర్గప్రజలతోనూ, సామ్రాజ్యవాదాన్ని, ఫ్యూడలిజాన్ని వ్యతిరేకించుటకు సంసిద్ధముగానున్న బూర్జువావర్గ ప్రజాతంత్రశక్తులతోనూ కూడిన ఒక సామ్రాజ్యవాదవ్యతిరేకమైన జమీందారీవిధాన వ్యతిరేకమైన మిత్రత్వాన్ని స్థాపించాలని, విషయాలు, చైనా కమ్యూ

నిస్టుపార్టికి, కార్మికవర్గానికీ బోధించేయి; అంతేగాక చైనా కమ్యూనిస్టు పార్టీ, కార్మికవర్గాలు, సాయుధ విప్లవ ప్రతీఘాతుకశక్తులను, సాయుధ విప్లవంద్వారా ఎదిరించాలని, విషయాలు బోధించేయి.

అప్పుడు, చైనా కమ్యూనిస్టుపార్టీ, సవ్యమార్గాన్ని త్రొక్కింది. అంటే, డాక్టర్ సన్-యత్-సేన్ చే నడుపబడు చున్న కొమింటాంగ్‌తో ఐక్యతను సాధించుటకు కావలసిన చర్యలను తీసుకొంది. ఇలాంటి ఐక్యతకై చైనా కమ్యూనిస్టు పార్టీ ఎందుకు యత్నించిందంటే కార్మికవర్గానికి, తదితర ప్రజాతంత్ర శక్తులకు మధ్యకావలసిన మిత్రత్వాన్ని సాధిద్దాము గదా అన్నవుద్దేశంతో అలా వ్యవహరించింది. కొమింటాంగ్ నకు ముందు కాలంలో రివల్యూషనరీ లీగ్ అనే ఒకపార్టీ (తుంగ్ మెన్ హుయీ) వుండేవి. అది విప్లవంయొక్క సంఘటన కర్తలలో ప్రధానమైనది; అది 1911 సంవత్సరంలో మంచూ ప్రభుత్వాన్ని కూలద్రోసింది. రాజకీయంగా జూస్తే, రివల్యూషనరీలీగ్ అంతిగట్టి సంఘంకాదు; బూర్జువావర్గంలోని తీవ్రశక్తులు, పెట్టీ - బూర్జువావర్గం, బూర్జువావర్గంలోని ఉదారవాదశక్తులు మొదలుకొని భూస్వామివర్గంలోని మంచూ ప్రభుత్వవ్యతిరేకశక్తులవరకూ, అన్నిరకాలశక్తులూ, యీ రివల్యూషనరీలీగులో వున్నారు. రివల్యూషనరీలీగ్‌యంటే యీ శక్తులన్నింటి మిత్రత్వంతో యేర్పాటుచేయబడిన సంఘమన్నమాట,

ఈ 1911 సంవత్సరపు విప్లవానికి ద్రోహంసంభవించిన తర్వాత పై నుదహరింపబడిన మిత్రమండలిలోనిశక్తులు,

అంటే రివల్యూషనరీలీగ్‌లో కలసిపనిచేసినశక్తులు, సామ్రాజ్య వాదానికీ, అభివృద్ధినిరోధకశక్తులకూ, లొంగిపోయాయి. ఏమైనప్పటికీ డాక్టరు సన్ - యత్ - సేన్ నాయకత్వాన నడుపబడుతున్న గ్రూపు బూర్జువా - ప్రజాతంత్ర విప్లవాన్ని కొనసాగించాలని నొక్కి-వక్కాణించసాగింది; తత్ఫలితంగా, అది అనేక అపజయాలను పొందసాగింది. పెకింగ్ మహానగరంలో స్థాపితమైన, కూర్చున్న అభివృద్ధినిరోధక ప్రభుత్వానికి వ్యతిరేకంగా కార్యకలాపాలను నడిపించుటకై క్వాన్‌టంగ్ రాష్ట్రం లోని యుద్ధస్వాములపై ఆధారపడ్డాడు డాక్టర్ సన్ - యత్ సేన్. కాని క్వాన్‌టంగ్ రాష్ట్రంనుండీ యుద్ధస్వామియైన చెన్ - చియాంగ్ - మింగుచే, డాక్టర్ సన్ .. యత్ - సేన్ తరిమివేయబడ్డాడు, తత్ఫలితంగా కొమింటాంగ్‌లో మరింతగా చీలిక లొచ్చాయి.

రష్యాలో అక్టోబరు సోషలిస్టు విప్లవం అఖండవిజయాన్ని సాధించటంచైనా దేశంపట్లనూ, ప్రాగ్దేశంలోనిపీడితప్రజలపట్లనూ సోవియట్‌యూనియన్ న్యాయబద్ధమైన విధానాన్ని అనుసరించటమూ, ''మే'' నాల్గవతేదీ వుద్యమమూ దానితరవాత చైనాకమ్యూనిస్టుపార్టీ, మరియు చైనాకార్మికోద్యమాలు జరుగుటా - యివన్నీ డాక్టర్ సన్ - యత్ - సేన్ దృష్టినీ, కొమింటాంగ్‌పార్టీలోని యితరమెంబర్లదృష్టినీ క్రమేణా ఆకర్షించాయి. తత్ఫలితంగావారు సోవియట్‌యూనియనూ, మరియు కమ్యూనిస్టుపార్టీలతో సమైక్యమవుటకుగాను విప్లవాత్మకపాలసీని అనుసరించులాగున జేశాయి.

1923 సంవత్సరం జూలై మాసంలో చైనాకమ్యూనిస్టు పార్టీయొక్క మూడవపార్టీ కాంగ్రెసు జరిగింది. ఈకాంగ్రెసు, డాక్టరు సన్ - యత్ - సేన్ యొక్క సామ్రాజ్యవాదవ్యతిరేక వైఖరినిగురించి, ఫ్యూడల్ యుద్ధస్వాములకు వ్యతిరేకంగా అతడు అనుసరిస్తున్న వైఖరిని గురించి, అంతేగాక కొమింటాంగ్ ను, కార్మికుల, కర్షకుల పెటీబూర్జువావర్గానికి జెందినవారి జాతీయబూర్జువావర్గీయుల విప్లవాత్మక మిత్రత్వంతోకూడిన కొమింటాంగ్ గా మార్చవచ్చునన్న విషయాన్నిగురించి, చాలా చక్కగా అంచనావేసింది.

మూడవపార్టీ కాంగ్రెసు పార్టీలోనున్న రెండుప్రధాన పెడమార్గాలను విమర్శించింది. ఆ రెండు పెడమార్గాలలో ఒకటి యేదంటే, చెన్ తూ - హిస్యూయొక్క లొంగుబాటు తత్వం (Capitulationism) ఈ లొంగుబాటుతత్వంయొక్క దృక్పథమేమంటే బూర్జువాప్రజాతంత్ర - విప్లవాన్ని, బూర్జువావర్గమే నడుపాలనీ, "బూర్జువా - ప్రజాతంత్ర - విప్లవానికి సంబంధించినపనియంతా కొమింటాంగ్ నకు వప్పజెప్పాలనీ" "ప్రజాతంత్రవిప్లవం విజయమందగానే, శ్రామికవర్గం పొందగలిగిన లాభమేమంటే, కొంత స్వేచ్ఛ లాభం"యనీ వాదించసాగింది. ఈ పెడమార్గాన్ని ప్రతిపాదించిన మొనగాళ్లు - శ్రామికవర్గం, మరియు కమ్యూనిస్టుపార్టీలు, విప్లవాన్ని నడుపుటకు కావలసిన సామర్థ్యానికై ప్రోత్సాహమిచ్చుటకు యత్నించలేదు. చైనాశ్రామికవర్గం, కమ్యూనిస్టుపార్టీలు, తమ అధ్వర్యాన ప్రజాతంత్రవిప్లవాన్ని నడుపుటద్వారా, విప్లవవిజయఫలింతలో అధికభాగం శ్రామికవర్గపరమవునట్లు,

తత్ఫలితంగా, శ్రామికవర్గం ప్రతిభావంతమైన రాజకీయశక్తికి కేంద్రంగావుండునట్లు అంతిమదశలో రాజ్యాంగయంత్రాన్ని సోషలిజంవైపునకు పురోగమింపజేయుటకై, పైనచెప్పబడిన ట్లుగా శ్రామికవర్గం పొందినరాజకీయాధికారాన్ని వినియోగించుటకుగాను, కావలసిన సామర్థ్యాన్ని సంపాదించుటకై యీ లొంగుబాటుతత్వానికి చెందినవారు యత్నించలేదు. అంటే యీ లొంగుబాటుతత్వ పెడమార్గానికి చెందినవారి అభిప్రాయమేమంటే, ప్రథమ విప్లవంలో బూర్జువావర్గాన్ని బూర్జువా రిపబ్లికును స్థాపించి 'కొంత స్వేచ్ఛను, కొన్నిహక్కులను "మాత్రమే" శ్రామికవర్గం పొందాలనీ వీరివుద్దేశం; అంతకన్న మరేమీగాదు. అందువలన యీ లొంగుబాటు తత్వదారులు బూర్జువా ప్రజాతంత్రవిప్లవంలో శ్రామికవర్గం నిశ్చేష్టపాత్రను మాత్రమే వహించాలనీ, అప్రధానపాత్రను మాత్రమే వహించాలిగాని నాయకత్వపాత్రనువహించరాదనిభావించారు.

బూర్జువావర్గం బూర్జువా రిపబ్లికును స్థాపించుకొనునంతవరకూ శ్రామికవర్గం వేచియుండాలనీ, బూర్జువా రిపబ్లికును కూలద్రోసి దానిస్థానంలో శ్రామికవర్గ నియంతృత్వాన్ని స్థాపించుటకు ముందుగా బూర్జువా రిపబ్లికును కూలద్రోయుటకు అనుగుణ్యమైన కాలమెప్పుడు మేరకు పెట్టుబడిదారీ ఆర్థికవిధానాన్ని అభివృద్ధిజెందనీయాలనీ, అంతవరకూ శ్రామికవర్గం వేచియుండాలనీ యీ లొంగుబాటు తత్వదారులు వాదించేరు. అలాచేసినప్పుడు మాత్రమే సోషలిజాన్ని పొందగలమని భావించేరు. అంటే, సోషలిజాన్ని గొనివచ్చుటకు మరియొక విప్లవాన్ని గొనిరావాలన్నమాట. పైన వివరించబడిన లొంగు

బాటు తత్వాదారుల దృక్పథం "రెండు విప్లవాలసిద్ధాంతం"గా పేరుబడింది.

ఇక రెండవ పెడమార్గమేమంటే "కవాట బంధ తత్వం" (క్లోజ్డ్ డోర్ పాలసీ; (అంటే, "నన్నుముట్టుకోకు నా మాలకాకి" అని తలుపులు బిగించుకొని కూర్చోటం, మాడి గట్టుకొని కూర్చోవటం, ఎవరితోనూ చేతులు కలుపకుండా దూరంగా ఏకాకిగా వుండిపోవటం); యీ "కవాట బంధ తత్వానికి" ప్రతినిధి చాంగ్ - కువో - తావో. ఈ వాదానికి జెందినవారు కమ్యూనిస్టుపార్టీ, కొమింటాంగ్‌తో సహకరించ రాదనీ, విప్లవాన్ని కార్మికవర్గమొక్కటే జరుపాలనీ, ప్రజా తంత్రవిప్లవాన్ని కొమింటాంగ్ సాగించజాలదనీ వాదించ సాగేరు. అందువలన వీరు కమ్యూనిస్టుపార్టీ మెంబర్లూ, కార్మి కులూ, కర్షకులూ కొమింటాంగ్ పార్టీలలో జేరరాదని వాదించేరు

పార్టి కాంగ్రెసు, మితవాద; "అతివాద" దృక్పథాలను రెండింటినీ తప్పుడు అభిప్రాయాలని విమర్శించి, రుజువుజేసింది. కొమింటాంగ్‌తో సహకరించుటకు తీర్మానించింది. కమ్యూని స్టుపార్టి మెంబర్లును, కొమింటాగ్‌లో జేరనిచ్చుటకు తీర్మానిం చింది. కొమింటాంగ్‌ను, ఒక ప్రజాతంత్ర విప్లవాత్మకమిత సంఘంగా పునర్నిర్మించుటకు మార్పుజెందించుటకు, అదే కాలంలో, కమ్యూనిస్టుపార్టియొక్క నిర్మాణాత్మక రాజకీయ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకొనుటకు తీర్మానించింది. ఏమైనప్ప టికీ, రైతుసమస్యపట్లను, విప్లవాత్మకసాయుధ సైన్యాలపట్లను తగినంతశ్రద్ధను చూపించలేకపోయిందనే చెప్పాలి.

కామ్రేడ్ మావ్‌సీటుంగ్, మూడవపార్టీ కాంగ్రెసునకు హాజరయ్యేడు. సవ్యదృక్పథాలను సమర్థించేడు. అపసవ్య దృక్పథాలను విమర్శించేడు; ఈ కాంగ్రెసులో పార్టీ కేంద్ర కమిటీకి సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు.

పార్టీయొక్క సమైక్యసంఘటనావిధానంవల్లన చైనా విప్లవవేగాన్ని మరింతంగా అభివృద్ధిజెందించింది. కమ్యూనిస్టు పార్టీ కృషికి ధన్యవాదాలు. కమ్యూనిస్టు అంతర్జాతీయసంస్థ యొక్క ప్రధానసంఘాలు, సోవియట్ యూనియన్‌యొక్క కమ్యూనిస్టుపార్టీ (బోల్షివిక్కు శాఖ) ఇచ్చిన అత్యంతప్రధాన సహాయాలకు ధన్యవాదాలు, కొమింటాంగ్, తన ప్రథమ జాతీయ కాంగ్రెసును, 1924 జనవరిలో కాంటన్ మహానగరంలో జరిపింది; ప్రజాతంత్రవిప్లవంయొక్క కార్యక్రమాన్ని రూపొందించింది; తన సంఘాన్ని పునర్నిర్మించుకొనుటకై విప్లవాత్మకంగా తయారుజేసుకొనుటకై, వివిధసూచనలను రూపొందంచుకొంది; ఒక ప్రణాళికను ప్రకటించుకొంది. కమ్యూనిస్టుపార్టీ మెంబర్లు, కొమింటాంగు సభ్యులు కలసి యీ సమావేశాన్ని జరిపేరు. యదార్థానికిది విప్లవోద్యమానికి నాందియయ్యింది. కొమింటాంగ్ వామపక్షానికి అధినేతయైన డాక్టర్ సన్‌యత్ సేనూ, కమ్యూనిస్టుపార్టీలమధ్య సహకారం బలపడింది; అంతేగాక, సామ్రాజ్యవాదం, భూస్వామిక విధానం కొమింటాంగ్‌లో వాటి యేజంట్లుకు - మితవాద శక్తులకు వ్యతిరేకంగా జరుపబడే పోరాటంలో యావత్ జాతి పురోగమించుటకు యీ సహకారం అవసరమయ్యింది. కమ్యూనిస్టుపార్టీ దాని నాయకత్వాలు ప్రతిపాదన, సపోర్టు

చేయగా క్వాంటంగ్ రాష్ట్రంలో ఒక విప్లవాత్మక ప్రభుత్వం మరియు ఒక విప్లవాత్మక సైనిక విద్యాలయం నెలకొల్పబడ్డాయ్. క్వాంటంగ్ రాష్ట్రంలోని అభివృద్ధినిరోధక శక్తులకు వ్యతిరేకంగా విప్లవ దండయాత్ర సాగించబడింది. జాతీయ అసెంబ్లీ సమావేశాన్ని జరుపవలసినదిగానూ, అసమానసంధులు రద్దుచేయవలసినదిగానూ, నినదిస్తూ యావత్ జాతీయ ప్రజావుద్యమం ప్రారంభించబడింది. కార్మికోద్యమం మరల తన కార్యకలాపాలను ప్రారంభించింది. రైతాంగప్రజలు, తమ రైతువుద్యమాన్ని ప్రారంభించారు. 1925 జనవరిలో జరుపబడిన చైనాకమ్యూనిస్టుపార్టీయొక్క నాల్గవ పార్టీకాంగ్రెసు, ప్రజాపోరాటాల నూతనప్రవాహంకై నిర్మాణాత్మకయత్నాలు జరిపింది. అదే సంవత్సరం, మార్చి నెలలో డాక్టర్ సన్ యత్ సేన్ స్వర్గస్థుడయ్యాడు. ఈ మహోదాత్త విప్లవాత్మకునిపట్ల యావజ్జాతి తన సంతాపాన్ని రాజకీయప్రచార మహోద్యమంలో వెలిబుచ్చుతూ వచ్చింది.

బ్రిటీషు, జపాను సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా, 1920 సంవత్సరం మేనెలలో షాంఘైకార్మికులు సమ్మెజేసారు. దాని ననుసరిస్తూ, దేశంమొత్తంమీద మహావిప్లవోద్యమం ప్రారంభమయ్యింది. షాంఘైనగరంలోని ఒక జపాను కాంటన్ మిల్లు పెట్టుబడిదారుడు, కు–ఛెంగ్–హాంగనే చైనా కమ్యూనిస్టువర్కరును చంపాడు. ఈ సంఘటన 1925 మే 15 తారీఖున జరిగింది. కాంటన్ మిల్లుకార్మికులను సపోర్టుజేస్తూ, షాంఘైకార్మికులు, విద్యార్థులు మే 30 వ తారీఖున పెద్ద ప్రదర్శనాన్ని జరిపేరు. ఈ ప్రదర్శనదారులు, నాన్ కింగ్

రోడ్డునకు జేరగానే బ్రిటిష్‌పోలీసులు ప్రదర్శకులపై కాల్పులు సాగించేరు. అనేకమంది యీ కాల్పులవల్ల చనిపోయారు; అనేకమంది గాయపడ్డారు. దీనివలన షాంఘైయిన్నూ, దేశ మంతటాను, ప్రజలక్రోధం ప్రజ్వలితమయ్యింది. చైనాప్రజలపై యీ సామ్రాజ్యవాదులు జరిపిన హత్యాకాండకు అసమ్మతిగా షాంఘై కార్మికులు, విద్యార్థులు, యితరప్రజలు ప్రదర్శనాలు విడువకుండా సాగించేరు. బ్రిటిష్, అమెరికను, జపాను సామ్రాజ్యవాదుల పోలీసుల తుపాకిగుండ్లకు వేలాదిమంది ప్రదర్శకులు బలియైపోయారు. షాంఘైనగరంలోని కార్మికులు, జనరల్ సమ్మెకు పిలుపిచ్చేరు; విద్యార్థులు పాఠశాలలకుపోవ నిరాకరించేరు; వ్యాపారస్థులు వ్యాపారముచేయ మానివేసారు. ఈఉద్యమం త్వరితంగా దేశంలోనున్న నగరాలన్నింటికీ ప్రాకింది; కార్మికులు, విద్యార్థులు, పౌరులు సామ్రాజ్యవాద వ్యతిరేకప్రదర్శనా లనేకం జరిపేరు; కార్మికులు సమ్మెజేసేరు; విద్యార్థులు పాఠశాలలలో సమ్మెచేయసాగేరు; దుకాణాలన్నీ మూసివేయబడ్డాయి. బ్రిటిష్‌సరకుల, జపానుసరుకులబహిష్కరణోద్యమం ప్రారంభమయ్యింది. హాంగ్‌కాంగ్‌లో జనరల్ సమ్మెను ఆర్గనైజుజేసినతర్వాత అచ్చటి కార్మికులు, కాంటన్ నగరానికివెళ్ళేరు. హాంగ్‌కాంగ్‌ను ముట్టడించేరు; హాంగ్‌కాంగ్ నిర్జనప్రదేశంగా తయారయ్యింది. హాంగ్‌కాంగ్‌లో సమ్మెజేస్తున్న కార్మికులు, కాంటన్‌లోని కార్మికులు విద్యార్థులతో కలసి, సైనిక విద్యాలయ కాడెట్లతోసహా, జూన్ 23 వ తారీఖున పెద్దప్రదర్శనాన్ని చేసేరు: షామీన్, కాంటన్‌లవద్ద యీ ప్రదర్శకులపై బ్రిటిష్

సామ్రాజ్యవాదుల నౌకాదళం కాల్పులు సాగించింది. ఈ ప్రదర్శనలలో చాలామంది చనిపోయారు; గాయపడ్డారు. దీనివలన దేశమంతటా విరివిగా ప్రతిఘటన సాగింది. ఈ ఉద్యమాలన్నింటిలోనూ, జాతియావత్తు యితరవిషయాలతో పాటు,ప్రదర్శకులపై కాల్పులు సాగించిన హంతకులను శిక్షించాలనీ, వారికి నష్టపరిహారమివ్వాలనీ, వారి కుటుంబాలకు నుమార్పణ చెప్పుకోవాలనీ, చైనా దేశంలోని విదేశీవలస స్థావరాలను చైనాకు అప్పగించివేయాలనీ విదేశీ సేనలు, చైనాగడ్డనుండి తరలించివేయాలనీ ఏకగ్రీవంగా డిమాండు జేసింది.

పెకింగులోని, దేశంలోని తదితర ప్రాంతాలలోని యుద్ధస్వాముల ప్రభుత్వం లజ్జారహితంగా, సామ్రాజ్యవాదులకు లొంగిపోసాగింది; ప్రజావుద్యమాన్ని అణచివేయసాగింది. క్వాంటంగ్ రాష్ట్రంలోని విప్లవాత్మక ప్రభుత్వం మాత్రమే, సామ్రాజ్యవాదానికి వంతిరేకంగా సమ్మెజేస్తున్న కార్మికులను, ప్రజాపోరాటాన్ని బలపరచింది; తత్ఫలితంగా హాంగ్ కాంగ్, కాంటన్ నగరాలలో సమ్మెలు పదహారుమాసాలవరకు సాగినాయ్.

మే 30 తారీఖున బ్రహ్మాండమైన ప్రదర్శనం జరిగింది; రక్తపుటేరులుపారినాయ్. అందుమూలాన దీనికి 'మే ముప్పయి వుద్యమం' అని పేరువచ్చింది. ఈ మే ముప్పయి వుద్యమం క్వాంటంగ్ రాష్ట్రాన్ని మరింత విప్లవాత్మకంగా పురోగమించుటకు అద్భుతమైన దోహదమిచ్చింది. దేశమంతటిలోనూ, మహావిప్లవం ప్రారంభమవుటకు బాటవేసింది. క్వాంటంగ్

రాష్ట్రంలోని "జాతీయ విప్లవసైన్యం" యావత్తు రాష్ట్రాన్ని ఐక్యపరచి, పెకింగునగరాన్ని కేంద్రంగా పెట్టుకొని జాతినంతనూ పరిపాలిస్తున్న జమీందారీపరిపాలనను కూలద్రోయుటకై 1926 జులై మాసంలో ఉత్తరదేశదండయాత్రను ప్రారంభించింది. కమ్యూనిస్టులు కొమింటాంగ్‌లోని విప్లవశక్తులు వీరోచితపోరాటంమూలాన ఉత్తరదేశ దండయాత్రసైన్యం, అభివృద్ధినిరోధకులైన, యుద్ధప్రభువులసైన్యాలను చాలా త్వరగా ఓడించివేసింది; అఖండ విజయాలను సాధించింది. 1926 సెప్టెంబరు మాసంలో, ఉత్తరదేశదండయాత్రసైన్యం, హాంకోవ్‌ను ఆక్రమించుకొంది. ఉత్తరదేశదండయాత్ర సైన్యం షాంఘై నగరాన్ని ఆక్రమించుకొనుటకు చేసేకృషితో సహకరించుటకుగాను షాంఘై నగరకార్మికులు, స్థానిక ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు జేశారు. కార్మిక, కర్షకోద్యమాలు దేశమంతటా, అమోఘంగా విస్తరించసాగాయి. కార్మికసంఘాలమొత్తం సభ్యత్వం 2800,000 లకు పెరిగింది. రైతుసంఘాల మొత్తం సభ్యత్వం 9500000 లకు పెరిగింది. మే ముప్పయివుద్యమానికి పూర్వం, కమ్యూనిస్టుపార్టీసభ్యత్వం, 900 లు వుండేది; అది 57,900 లకు పెరిగింది.

కాని సత్వరంగా అభివృద్ధిజెందుతున్న యీ విప్లవానికి గట్టిపునాదులు లేకపోయాయి. ప్రజాతంత్ర విప్లవాన్ని శ్రామికవర్గం నడుపాలి. కొమింటాంగ్ – కమ్యూనిస్టుల సహకార్యాన్ని కమ్యూనిస్టులు నడుపాలి ఉత్తరదేశ దండయాత్ర యుద్ధాన్ని కమ్యూనిస్టులే తప్పక నడుపాలన్న

విషయాలులాంటి, ప్రాథమిక కర్తవ్యాలపట్ల; ఆనాటి కమ్యూనిస్టుపార్టి నాయకుడైన చెన్-తూ-హిసియూ, చేష్టారహితమైన బలహీనమైనదృక్పథాన్ని అవలంబించాడు. ఆనాటికే అనేక ప్రదేశాలలో సామూహిక పోరాటాలు ప్రారంభమయ్యాయి. అనేక తావులలో భూమికై, రైతుపోరాటాలు ప్రారంభమయ్యాయి. కాని చెన్-తూ-హిస్యూ ప్రజల డిమాండులను తీర్చుటకై అందులో ప్రత్యేకంగా భూమికై రైతులు చేసే డిమాండులను తీర్చుటకై ప్రజావుద్యమాలను బలపరచే, అభివృద్ధిపరచే సూటియైన సుదృఢమైన విధానాన్ని అమలు జరుపలేకపోయాడు. రాజ్యాంగ యంత్రంయొక్క శాఖలన్నీ ఆనాడు అభివృద్ధినిరోధకుల హస్తాలలోనే వున్నాయ్. ఆ ప్రభుత్వశాఖలన్నింటినీ పునర్నిర్మించుటకు ప్రజలకు స్వంత ఆయుధసైన్యాలను సృష్టించుటకు, విప్లవాత్మకసైన్యాల బలాన్ని విస్తరింపజేయుటకు చెన్-తూ-హిస్యూ ప్రజాబలాన్ని సమీకరించాడా అంటే అదీ లేదు.

విప్లవం ఆనాటికే మహోదాత్తమైన ఉత్తరదేశదండయాత్రసైన్యంలో అమితగౌరవాన్ని సంపాదించుకొంది; కాని సైన్యంలో మనపార్టీ అనుసరించవలసిన సవ్యవిధానమంటూ ఒకటిలేకుండా వుండవలసివచ్చింది. ఉత్తరదేశదండయాత్ర సైన్యంలో కమ్యూనిస్టులు చురుకుగా రాజకీయప్రచారాన్నీ, కార్యక్రమాన్ని సాగించేరు; సాయుధసైన్యాలను కంట్రోలు చేయాలన్న ప్రధానవిషయాన్ని, పార్టినాయకత్వసంఘం గుర్తించక ఉపేక్షాభావంతో వూరుకొనుటచే అతిస్వల్పమైన సాయుధసైన్యాలు మాత్రమే, కమ్యూనిస్టుపార్టిసభ్యుల

కంట్రోలు క్రిందవున్నాయ్. ఉత్తరదేశదండయాత్రసైన్యంలోని అత్యంత అధిక భాగంపై అధికారం, పాతకాలంనాటి సైనికాధికారుల హస్తాలలో అందులో ప్రత్యేకంగా ఆనాటి "జాతీయ విప్లవసైన్యం" యొక్క సర్వసేనాధిపతియైన కోమింటాంగ్ మితవాదపక్షనాయకుడైన చియాంగ్-కై-షేక్ హస్తాలలో వుంది. తనకు అమితంగా సైన్యాధికారం సంక్రమించక పూర్వమే చియాంగ్-కై-షేక్ 1926 మార్చి 20 తారీఖునాడే కమ్యూనిస్టు వ్యతిరేక, సోవియట్ వ్యతిరేక కుట్రను పన్నేడు. సైన్యంలోనున్న కమ్యూనిస్టుపార్టీ పైననూ, కోమింటాంగ్‌లో నున్న కమ్యూనిస్టు పార్టీపైననూ దాడిచేయుటకై, చియాంగ్-కై-షేక్, సాకులను సృష్టించేడు. చియాంగ్-కై-షేక్ చేసే దాడులు ఎదురవగానే, చెన్-తూ-హిస్యూ, చియాంగునకు లొంగిపోయి, కొన్ని అవకాశవాద హక్కులను యిచ్చేడు. సైన్యంలో, కమ్యూనిస్టుపార్టీ, తన కార్యకలాపాలను పరిమితించుకోవాలి, కోమింటాంగ్ నాయకత్వ సంఘాలలో, కమ్యూనిస్టుపార్టీ, తన కార్యకలాపాలను పరిమతించుకోవాలి, అని చియాంగ్ పెట్టిన అభివృద్ధినిరోధక షరతులకు, చెన్-తూ-హిస్యూ లొంగిపోయి వప్పుకున్నాడు. 1926 సంవత్సరాంతంలో, నాన్‌చాంగ్‌లో నున్న తన హెడ్ క్వార్టర్సును, హాంకోవ్‌లోనున్న కోమింటాంగ్ వామపక్షానికి, వ్యతిరేక కేంద్రంగా చియాంగ్ తయారుజేసేడు.

1927 సంవత్సరం ప్రారంభానికి, చెన్-తూ-హిస్యూ యొక్క తప్పుడు ధోరణులు, అవకాశవాదపంథాగా అభివృద్ధి జెందింది. కోమింటాంగ్‌లోని భూస్వామికశక్తులు, బూర్జువా

శక్తులు, కార్మిక, కర్షకోద్యమాల అఖండాభివృద్ధినిగురించి, పోరాటంలో కార్మికులు, కర్షకులు ప్రదర్శిస్తున్న విప్లవాత్మక గట్టితనాన్ని గురించి, పరిపూర్ణంగా గ్రహించసాగేరు. గ్రామీణ ప్రాంతాలలోని రైతాంగప్రజల వుద్యమాన్ని చూచి, భయభ్రాంతులై భూస్వాములు, అసంఖ్యాకంగా, నగరాలకు పలాయనం చిత్తగించేరు రైతులకు వ్యతిరేకంగా అన్నిరకాల కట్టుకథలనూ వారు పనిగట్టుకొని నగరాలలో వ్యాపింప జేసేరు. "కార్మిక, కర్షకోద్యమాలు హింసాకాండను సాగించాయి" అని రూమర్లు వేయసాగారు. ఈ రూమర్లను సాకుగా తీసుకొని, కమ్యూనిస్టుపార్టీని దుమ్మెత్తిపోయసాగారు; పెట్టీ - బూర్జువావర్గ విప్లవశక్తులు, అమితంగా వూగిసలాడజొచ్చాయి. ఇలాంటి పరీక్షాసమయములో, చెన్ - తూ - హిస్యూ, అభివృద్ధినిరోధకులవైఖరిచే ముంచెత్తివేయబడ్డాడు. విప్లవాత్మక గ్రూపులనుఐక్యపరచుటకు మధ్యస్థంగానున్నగ్రూపులను తనవైపునకు మరలించుకోటానికి అభివృద్ధినిరోధకులను త్రిప్పికొట్టటానికి, ఆనాడు వువ్వెత్తుగా పెరుగుచున్న కార్మిక, కర్షకోద్యమాలపై చెన్ - తూ - హిస్యూ, విశ్వాసముంచలేకపోయాడు; అంతేగాక, "అతిగా ప్రవర్తిస్తున్నారు" అని కార్మిక, కర్షకోద్యమాలను తిట్టిపోయుటలో, చెన్ - తూ - హిస్యూ, అభివృద్ధినిరోధకుల అడుగుజాడల్లో నడిచాడు; అంతేగాక ప్రజావుద్యమాన్ని అందులో ప్రత్యేకంగ కర్షకోద్యమాన్ని అణచిపెట్టి వుంచాడు చెన్ - తూ హిస్యూ.

విప్లవరంగాన్ని విడిచిపోకుండా వుంటూరు,సదాయున్న

భావం. ఆవిధంగా, "విప్లవాన్ని రక్షించవచ్చు"నన్న ఆశతో, కొమింటాంగ్‌లోని భూస్వామికశక్తులకు, బూర్జువాశక్తులకు విశిష్టాధికారాలు, సౌకర్యాలు, కల్పించి, బుజగించాలని యత్నించాడు చెక్ - తూ - హిసూ. ఆనాడు కమ్యూనిస్టు పార్టీ, పైశక్తులకు సౌకర్యాలను కలిగించినకొలదీ, అభివృద్ధి నిరోధకులు బలపడసాగారు; అంతేగాక, కమ్యూనిస్టుపార్టీ యొక్క పూసిసలాటలు, పరిమితింపులఫలితంగా, ప్రజావుద్యమం తీవ్రంగా బలహీనపడింది; తీవ్రనష్టాలకు గురిఅయ్యింది;

ఈ పరిస్థితులలో సామ్రాజ్యవాదులు, త్వరితంగా చియాంగ్-కై-షేకుతో సహకరించజొచ్చారు. జమీందారీ భూస్వాములు, పెద్దదళారీబూర్జువావర్గంవారు తమ నూతన రాజకీయప్రతినిధిగా చియాంగ్-కై-షేకును జేసుకొన్నారు; ఇంకా పూర్తిగా అనుభవాన్ని గడించుకొనని చైనా మహావిప్లవాన్ని లోపలినుండే నొక్కిపారేయవలసిందిగా అతనిని కోరేరు.

ఇకముందైనా ప్రజావుద్యమాలు పరాజయం పొందకుండా ఆపుటకు లేక కనీసంగా ఎక్కువనష్టాలకు గురికాకుండా చూచుకోటానికి ఆకాలంలో కమ్యూనిస్టుపార్టీకి అవకాశాలున్నాయ్. ఎందువల్లనంటే 1926 నవంబరు నాటికే కామ్రేడ్ స్టాలిన్ "చైనావిప్లవంపై అభిప్రాయాలు"అన్న తన ప్రఖ్యాత వుపన్యాసంలో సకాలమైన, సవ్యమైన హెచ్చరిక యిచ్చాడు. ఈ వుపన్యాసంలో కామ్రేడ్ స్టాలిన్ అత్యంతసవ్యంగా చైనా బూర్జువావర్గంయొక్క బలహీనతను చూపెట్టేడు. చైనా విప్లవానికి వ్యతిరేకంగా దురాక్రమణను సాగించుటకై

సామ్రాజ్యవాదశక్తులు, చైనావిప్లవ ప్రతీఘాతుకశక్తులను వినియోగించుకొనే తీవ్రప్రమాదం గలదని, హెచ్చరించాడు. చైనావిప్లవంలో, యధార్థసాయుధ విప్లవసైన్యాల అవసరం గలదనీ, కమ్యూనిస్టులు సైనికశాస్త్రాన్ని అధ్యయనంజేయవలసిన ఆవశ్యకతగలదనీ, వారు సాయుధసైన్యాలను నడుపగలిగినసమర్థతను పొందవలసిన ఆవశ్యకతగలదనీ, గ్రామీణప్రాంతాలలో, విప్లవాన్ని అభివృద్ధిజేయాలనీ, రైతుల డిమాండ్లనుతీర్చాలనీ, శ్రామికవర్గంపైకొచ్చి, నాయకత్వాన్ని చేపట్టాలనీ, కామ్రేడ్ స్టాలిన్‌సుస్పష్టం జేసేడు. అటుతర్వాత, కామ్రేడ్ స్టాలినూ, కమ్యూనిస్టు అంతర్జాతీయ సంస్థయొక్క కార్యనిర్వాహకవర్గమూ కలసి, చైనావిప్లవంలో, చైనా కమ్యూనిస్టుపార్టీ అనుసరించవలసిన విధానంపై దిశానిర్దేశన యిచ్చారు. కామ్రేడ్ స్టాలిను, కమ్యూనిస్టు అంతర్జాతీయ సంస్థలు యీ అమూల్య అభిప్రాయాలు, చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకులను సకాలంలో మేల్కొల్పి గలిగినట్లయితే, చైనావిప్లవాన్ని, ఒక్కదెబ్బన ఓడించుటకు, శత్రువునకు సాధ్యమయ్యేదిగాదు.

చైనా విప్లవంయొక్క యీ ప్రథమ పరీక్షాసమయంలో, కామ్రేడ్ మాసీయాంగ్, ప్రప్రథమంగా తన ఘన విప్లవాత్మక మేధాసంపత్తిని ప్రదర్శించేడు. కామ్రేడ్ మాసియాంగ్, ప్రప్రథమంగా చైనాలోని వర్గసంబంధాలను వివరించుటకు మార్క్సిజం-లెనినిజం పద్ధతులను వినియోగించాడు. కర్షకులపై నాయకత్వాన్ని వహించుటలో చైనా కార్మికవర్గంయొక్క సమర్థత, అసమర్థతలే, చైనా విప్లవంయొక్క

జయాపజయాలకు కీలకమని గుర్తించాడు. మూడవపార్టీ కాంగ్రెసుతో సహా యింతకుపూర్వం జరిగిన పార్టీ కాంగ్రెసులలో పరిష్కరింపబడని సమస్య యిదే. 1924 సంవత్సరాంతంలో హూనాన్‌లోని గ్రామీణ పరిస్థితులను అధ్యయనం చేయుటకు రైతాంగ ప్రజల విప్లవాత్మక పోరాటాలను నడుపుటకు కామ్రేడ్ మాసీయాంగ్ బయలుదేరేడు. 1925, 1926 సంవత్సరాలలో క్వాంటంగ్ రాష్ట్రంలో రైతుపోరాటాలను నడుపుటకై కార్యకర్తలకు తర్ఫీదు యిచ్చుటకై కృషిసల్పుతూ, అచ్చటి జాతీయ కర్షకోద్యమ విద్యాలయానికి అధ్వర్యం వహించేడు. 1926 మార్చి నెలలో కామ్రేడ్ మాసీయాంగ్ ఒక మార్క్సిస్టు-లెనినిస్టు గ్రంథాన్ని వ్రాసాడు. దీనిపేరు "చైనా సమాజంలోని వివిధవర్గాలపై వివరణ" ఈ గ్రంథంలో కామ్రేడ్ మాసీయాంగ్ చైనాదేశంలోని కర్షకులు, తదితర వర్గాలను గురించి సూత్రీకరించేడు. విప్లవంలో తమ మిత్రులను, శత్రువులను గుర్తించుటే ప్రధానమైన సమస్యయని చెప్పేడు. అలామిత్రులను, శత్రువులను గుర్తించినప్పుడే "యదార్థ శత్రువుల నెదిరించుటకు యదార్థమిత్రులను ఐక్యపరచ గలుగుతాం" అని చెప్పేడు. తర్వాత కామ్రేడ్ మాసీయాంగ్ తన పుస్తకంలో చైనాదేశపు ఐదు ప్రధాన సామాజిక శక్తుల—(1) భూస్వామిక, మరియు దళారీవర్గాలు, (2) బూర్జువావర్గం, (3) మధ్యమ తరగతి రైతులు, మరియు యితర పెటీ-బూర్జువావర్గాలు, (4) బీదరైతులు, మరియు యితర అర్ధశ్రామికులు, (5) శ్రామికవర్గం, యీ ఐదు ప్రధాన సామాజిక శక్తుల - ఆర్థిక, రాజకీయ స్థితినిగురించి చక్కగా

వివరించేడు. "యుద్ధస్వాములు, నిరంకుశులు, దళారీలు, పెద్ద భూస్వామిక వర్గాలన్నీ సామ్రాజ్యవాదులతో కలసి కుటలు పన్నుతున్నాయ్; మేధావి వర్గంలో ఒకభాగం పైవారితో చేతులు కలుపుతూవుంది. వీళ్ళే మన శత్రువులు. మన విప్లవంలో, పారిశ్రామికవర్గం నాయకత్వశక్తి అర్ధ శ్రామిక వర్గాలు, పెటీ-బూర్జువా వర్గాలు మన సన్నిహిత మిత్రులు మధ్యమ తరగతులలోని (ఇక్కడ కామ్రేడ్ మాసీటూంగ్ జాతీయ బూర్జువా వర్గాన్నిగురించి చెప్పేడన్న సంగతి గుర్తుంచుకోవాలి) మితవాదపక్షం మనకు వ్యతిరేకమైన, బలమైన శత్రువు, మధ్యమ తరగతులలోని అతివాద పక్షం మనకు బలమైన మిత్రుడు. అయితే మనంఎల్లప్పుడూ, మేల్కొనివుండాలి. మన రంగాన్ని వారు విచ్ఛిన్నం చేయగలరు" అని పైవిధంగా కామ్రేడ్ మాసీటూంగ్ తన పుస్తకంలో చక్కగా వ్యక్తీకరించేడు. బూర్జువావర్గాన్ని, కోమింటాంగును మాత్రమే గుర్తించి, రైతాంగప్రజలను గుర్తించలేకపోయిన చెన్-తూ-హిస్యూ యొక్క మితవాద అవకాశవాదతత్వాన్ని, కార్మికులను మాత్రమే గుర్తించి, రైతాంగప్రజలను గుర్తించలేకపోయిన చాంగ్-కువో-తావో యొక్క "అతివాద" అవకాశవాదాన్ని, పైవిధంగా కామ్రేడ్ మాసీటూంగ్ వ్యతిరేకించాడు.

ఆనాటికే వుద్భవించిన రైతుపోరాటాలనూ, ఉత్తర దేశదండయాత్ర యుద్ధకాలంలో మరింతగా పెరుగుచున్న రైతుపోరాటాలను బలపరచుటకై, కామ్రేడ్ మాసీటూంగ్ 1927 జనవరిమాసంలో భూస్వాముల పరిపాలనను కూల

ద్రోయుటకై, ఆనాటికే జరుగుతూవున్న శక్తివంతమైన హూనాన్ రైతుపోరాటాలనుగురించి పరిశోధన ప్రారంభించేడు. ఈ పరిశోధనను పూర్తిజేసి, ప్రథమ విప్లవాత్మక అంతర్యుద్ధ కాలం యావత్తులోనూ, అత్యంతప్రధానమైన పార్టీగ్రంథాన్ని రచించేడు. దీనిపేరు "హూనాన్‌లోని కర్షకోద్యమంపై జరుపబడిన పరిశోధన గురించి రిపోర్టు" పార్టీలో వున్నవారు గానీయుండి, లేక పార్టీ వెలుపలున్నవారు గానీయుండి, వారెవరైనప్పటికినీ, రైతాంగప్రజలపట్ల సందేహాన్ని వెలిబుచ్చిన వారిని, రైతాంగప్రజలను తిట్టినవారిని కామ్రేడ్ మాసీటూంగ్ తీవ్రంగా ఖండించేడు. పార్టీ అసంఖ్యాక ప్రజానీకాన్ని వీలైనంత హెచ్చుగా సమీకరించే విధానాన్ని అవలంబించి నట్లయితే చాలా కొద్దికాలంలో "చైనాదేశపు మధ్యభాగం లోని రాష్ట్రాలలోనూ, దక్షిణభాగపు రాష్ట్రాలలోనూ, ఉత్తర భాగపు రాష్ట్రాలలోనూ కోట్లాదిప్రజలు మేల్కొంటారు. మహోధృతంగా పైకిలేస్తారు. పెనుతుఫానులాగున, శక్తివంతంగా తమకు ఎదురైన శక్తి ఎంత గొప్పదైనప్పటికినీ దానిని తుడిచిపెట్టేస్తూ అద్వితీయంగా, అమోఘంగా ముందుకు సాగిపోతారు. తమ విముక్తి లక్ష్యంవైపునకు పరుగెత్తుతూ, వారు అన్నిరకాల బంధనాలనూ తెంచివేస్తారు. సామ్రాజ్య వాదులను, యుద్ధస్వాములను, లంచగొండి వుద్యోగస్తులను, చెడ్డ పెద్దమనుష్యులను (దుష్ట అభిజాత్యవర్గాన్ని) – వీరందరినీ శ్మశానంవైపునకు తరిమివేయగలరు" అని కామ్రేడ్ మాసీటూంగ్ గట్టిగా నొక్కి వక్కాణించాడు.

కామ్రేడ్ మాసీటూంగ్ వ్రాసిన యీ పుస్తకం

యొక్క ప్రధానవిలువ దేనిలో వున్నదంటే:— (1) అది చైనావిప్లవంలో రైతాంగ ప్రజల పాత్రనుగురించి పూర్తి అంచనాయిచ్చింది. (2) అది గ్రామీణప్రాంతాలలో రైతాంగ ప్రజల రాజకీయాధికారాన్ని, రైతాంగ సాయుధశక్తులను స్థాపించవలసిన ఆవశ్యకతను గురించి నొక్కి వక్కాణించింది. (3) రైతాంగంలో వివిధతరగతులను వర్గీకరించి వివరించింది. చైనా దేశపు ప్రజానీకంలో అత్యధికభాగపు జనాభాగా నున్న బీదరైతులు, రైతులలో అత్యంత విప్లవాత్మకశక్తియని ఎత్తి చూపింది. (4) నిర్నిబంధంగా ప్రజానీకంపై విశ్వాసముంచాలనీ, ఆధారపడాలనీ, సమీకరించాలనీ, సంఘటితపరచాలనీ, అనే విప్లవాత్మకసూత్రాన్ని అమలు జరుపవలసిందిగా అది నొక్కి వక్కాణిస్తూవుంది. ఈ కారణాలవలన యీ పుస్తకం రైతుపోరాటాలను నడుపుటలో చైనాకమ్యూనిస్టులకు ప్రధాన గ్రంథంగా గుర్తించబడింది. కాని ఆకాలంలో, కామ్రేడ్ మావొసెటూంగ్ యొక్క సవ్యదృక్పథాలకు, పార్టీసభ్యుల మొత్తంలోని ఒక భాగంలో పలుకుబడి యేర్పడినప్పటికినీ, వీటిని చెన్ - తూ-హిస్యూ యొక్క అవకాశవాద నాయకత్వ ముతా అణచివేసింది. పార్టీయొక్క నిర్ణాయకనాయకత్వం యీ దృక్పదాలను (మావొసెటూంగ్ దృక్పథాలను) ఆమోదించలేదు. అందువలన ఆ కాలంలో విప్లవం, రక్షింపబడజాలకపోయింది.

సరిగా కామ్రేడ్ స్టాలిన్ జోస్యం చెప్పినట్లుగానే చైనా విప్లవానికి వ్యతిరేకంగా సామ్రాజ్యవాదులు తమ జోక్యాన్ని చిక్కపరచారు. 1927 మార్చి, 24 వ తారీఖున, ఉత్తరదేశ దండయాత్రసైన్యం, నాన్‌కింగ్ నగరాన్ని ఆక్రమించుకోగానే

బ్రిటన్, అమెరికా, జపాన్, ఫ్రాన్సు, ఇటలీదేశాల సామ్రాజ్య వాదుల నౌకాదళాలు, నాన్‌కింగ్‌నగరంపై కాల్పులు సాగించాయి. సామ్రాజ్యవాదుల ఆజ్ఞల ప్రకారం చియాంగ్‌కైషేక్ ఏప్రియల్ 12 వ తారీఖున, షాంఘైనగరంలో విప్లవప్రతీఘాతుక కుట్రచేసి, అసంఖ్యాకంగా కార్మికులను, కమ్యూనిస్టుపార్టి సభ్యులను వూచకోతకోసాడు. కమ్యూనిస్టులకు తాను వ్యతిరేకినని ప్రకటించాడు. హాంకోవ్‌లో నున్న కొమింటాంగ్ వామపక్షం, చియాంగ్-కై-షేకును శిక్షించుటకు దండయాత్ర జరుపుతానని ప్రకటించినప్పటికీ ఆ ముఠాలోని అభివృద్ధినిరోధక ధోరణులమూలంగా అతిత్వరితంగా అభివృద్ధిజెందలేదు.

ఈ క్లిష్టసమయంలో హాంకోవ్‌లో ఏప్రియల్ 12 వ తారీఖున చైనాకమ్యూనిస్టుపార్టీ తన అయిదవపార్టీ కాంగ్రెసును జరిపింది. కామ్రేడ్ మావోసీటూంగ్ యీ సమావేశానికి హాజరయ్యాడు. కాని, చెన్-తూ-హిస్యూ ముఠా కాంగ్రెసు యొక్క నాయకత్వంనుండి కామ్రేడ్ మావోసీటూంగ్‌ను పూర్తిగా మినహాయించింది. కాంగ్రెసులో కామ్రేడ్ మావోసీటూంగ్ వోటుచేయుటకు అవకాశం యివ్వకుండా చేసింది. చూ-ఛియూ-పైయ్, జెన్-పి-షిహి లాంటి కొంతమంది కామ్రేడ్సు, చెన్-తూ-హిస్యూ యొక్క అవకాశవాద నాయకత్వాన్ని విమర్శించేరు. కాని, వారికి సవ్యమైన అభిప్రాయాలంటూ లేవు. చైనావిప్లవం విషయంలో కమ్యూనిస్టు అంతర్జాతీయసంస్థ యిచ్చిన సరియైన దిక్సూచినను అయిదవ పార్టీకాంగ్రెసు ఆమోదించినప్పటికినీ, అవకాశవాదతత్వాన్ని

ఖండిస్తూ తీర్మానాలు జేసినప్పటికినీ వ్యవసాయసంస్కరణలను ప్రవేశపెట్టవలసినదిగా పిలుపిచ్చినప్పటికినీ అది చెన్-తూ-హిస్యూనే పార్టీ జనరల్ సెక్రటరీగా ఎన్నుకొంది. చెన్-తూ-హిస్యూ యదార్థానికి తన అవకాశవాద దృక్పథాల మొండిపట్టును వదలలేదు. ఆ విధంగా అయిదవపార్టీ కాంగ్రెసు యదార్థానికి యే సమస్యలనూ పరిష్కరించలేదు. ఇదైన వెంటనే మే 21 వ తారీఖున అభివృద్ధి నిరోధక సైనికాధికారియైన హిసూ-కే-హిసియాంగ్, చాంగ్‌షాలో విప్లవ ప్రతీఘాతుక తిరుగుబాటును లేవనెత్తి అనేకమంది విప్లవకారులను పూచకోత కోసాడు. జులై 15 వ తారీఖున వూహాన్‌లో కొమింటాంగ్ కమ్యూనిస్టులతో తెగతెంపులు చేసుకోటానికి నిశ్చయించుకొంది. ఆ విధంగా విప్లవానికి ద్రోహంచేసింది. ఈ విధంగా ప్రథమ విప్లవాత్మక అంతర్యుద్ధం పరాజితమయ్యింది.

ప్రథమ విప్లవాత్మక అంతర్యుద్ధం ఓడిపోయి నప్పటికినీ, పిన్నవయస్సులోనున్న చైనా కమ్యూనిస్టు పార్టీకి చైనా ప్రజలకు అది చాలా చాలా గొప్పదైన ప్రధానమైన గుణపాఠాలను నేర్పింది. చైనా ప్రజాతంత్ర విప్లవాన్నిగురించి ప్రథమ విప్లవాత్మక అంతర్యుద్ధం యీ మూలసూత్రాలను వెలువరించింది.

(1) వర్తమాన చైనాలోని ప్రజాతంత్ర విప్లవం కార్మికవర్గంచే నడుపబడే సంయుక్త సంఘటనచే జరుపబడాలి. యీ సంయుక్త సంఘటన లేకుండా విప్లవం విజయాన్ని సాధించజాలదు. యీ సంయుక్త సంఘటన కార్మికవర్గంచే నడుప

బడక బూర్జువావర్గంచే నడుపబడితే ఓడింప బడు తుంది.

(2) చైనా ప్రజాతంత్రవిప్లవంలో కార్మికవర్గనాయ కత్వంయొక్క కేంద్రసమస్యయేదంటే రైతుసమస్యయనేది. విప్లవాత్మక మిత్రుడుగా రైతాంగప్రజలను, కార్మికవర్గం తనవైపునకు త్రిప్పకొన్నప్పుడే విప్లవవిజయం సాధింపబడ గలదు.

(3) విప్లవప్రతీఘాతుకాన్ని వ్యతిరేకిస్తూ సాయుధ విప్లవం మాత్రమే చైనాలో విప్లవంయొక్క ప్రధానరూపంగా వుండగలదు; విప్లవాత్మక సాయుధశక్తులు లేకపోతే ప్రతి విషయంలోనూ నష్టపడకతప్పదు.

ప్రథమ విప్లవాత్మక అంతర్యుద్ధంలోనేగాక, తర్వాతి కాలాలలోగూడ యీ గుణపాఠాలు సవ్యమైనవని రుజు వయ్యింది.

చైనాలో ప్రథమ విప్లవాత్మక అంతర్యుద్ధంయొక్క ఓటమి, విప్లవప్రతీఘాతుకశక్తుల బలాన్ని ప్రదర్శించింది; అందులో ప్రప్రథమంగా విప్లవంయొక్క బలంకన్న సామ్రా జ్యవాదులు బలంగా వున్నారని రుజువుజేసింది; చైనాలో అనేకదశాబ్దాలనుండి దురాక్రమణసాగిస్తున్న శక్తివంతమైన అంతర్జాతీయ సామ్రాజ్యవాదాన్ని ఓడించుటకు, చైనా జమీందారీవిధానాన్ని ఓడించుటకు మనం తీవ్రపోరాటాన్ని నడుపాలి; ఈ తీవ్రపోరాటాన్ని విజయంవైపునకు పురోగమింప జేయుటకు విజయులమౌన్ని చేర్చుటకు విప్లవోత్సాహం పైననే

ఆధారపడియుండుటయేగాక మార్క్సిజం - లెనినిజంయొక్క సైద్ధాంతిక దిశానిర్దేశనపై కూడా ఆధారపడాలి.

తనకు పునాది యేర్పడగానే చైనా కమ్యూనిస్టుపార్టీ అద్భుతమైన యావజ్జాతీయ విప్లవాత్మక పోరాటంలో దూకింది. యీ పోరాటంలో అనేకమంది కమ్యూనిస్టులు కార్మికవర్గం పట్ల అంతులేని విశ్వాసాన్ని ప్రదర్శించారు. ప్రజా ఆశయం పట్ల అంతులేని విశ్వాసాన్ని ప్రదర్శించేరు, ఉత్తమ నిర్మాణాత్మక సామర్థ్యాన్ని ప్రదర్శించేరు. కాని కామ్రేడ్ మూసియాంగ్ మరి కొంతమంది కామ్రేడ్సు తప్ప మిగతావారందరూ మార్క్సిజం-లెనినిజాన్ని తీవ్రంగా అధ్యయనం చేయలేకపోయారు. మార్క్సిజం-లెనినిజంయొక్క శక్తినీ సారాన్ని గ్రహించలేక పోయారు.

పార్టీయొక్క యీ బలహీనతవలన మన పార్టీ నాయకత్వసంఘాలు, స్టాలిన్, కమ్యూనిస్టు అంతర్జాతీయ సంస్థలు యిచ్చే విప్లవాత్మక దిశానిర్దేశనను అర్థం జేసుకోలేక పోయింది. అవకాశవాద తత్వ పొరపాట్లను అధిగమించ లేకపోయింది. అతిత్వరితంగా మార్పుజెందుచున్న విప్లవాత్మక పోరాటాల క్లిష్టసమయాలలో బూర్జువావర్గ ద్రోహాన్ని దాటలేకపోయింది. పార్టీలో మార్క్సిజం - లెనినిజంయొక్క సైద్ధాంతిక జ్ఞానం లోపించుటవలన పార్టీ యావత్తూ ఆనాటికింకా బాల్యదశలోనే వున్నట్లు వ్యక్తంజేసింది.

ప్రథమ విప్లవాత్మక యుద్ధం వోడిపోగానే చైనా కమ్యూనిస్టుపార్టీ క్లిష్టదశలో పడింది. ఈ క్లిష్టకాలంలోనే చైనా కమ్యూనిస్టుపార్టీ రాజకీయంగానూ, సైనికంగానూ పరిపక్వస్థాయిని జేరుకొంది.

# రెండ అధ్యాయం.

# రెండవ విప్లవాత్మక అంతర్యుద్ధం

1927 సంవత్సరంలో విప్లవం సత్వరాభివృద్ధి చెందుతున్న కాలంలో విప్లవంలోని, విప్లవం వెలుపలివున్న శక్తివంతమైన శత్రువులచే పిన్నవయసులోనున్న చైనాకమ్యూనిస్టుపార్టీ ముట్టడించబడింది. పార్టీనాయకత్వసంస్థలు చేసిన పొరపాట్లవలన, పార్టీ పైవారి దెబ్బలనుండి తన్నుతాను రక్షించుకోలేకపోయింది. తత్ఫలితంగా తీవ్రమైన దెబ్బలకు గురి అయింది. ఓటమినుండి విప్లవాన్ని రక్షించాలని పార్టీ యత్నించింది. పార్టీ పలుకుబడిక్రిందనున్న చౌ - ఎన్ - లే, చూతే, యేటింగ్, తదితర కామ్రేడ్స్ ఆగస్టు 1 వ తారీఖున కియాంగ్సీ రాష్ట్రంలోని నాన్‌బాంగ్‌లో ఉత్తర దేశదండయాత్ర సైన్యంయొక్క ముప్పయివేలమంది సైనికులను తిరుగుబాటుకై నడిపేరు. కియాంగ్సీ రాష్ట్రంలోని రైతుఉద్యమంతో కలియుటకు బదులుగా వారు దక్షిణదిశగా క్వాంటుంగ్ రాష్ట్రంవైపునకు తరలిపోయేరు. క్వాంటుంగ్ రాష్ట్రంలోని తూర్పుభాగంలోనున్న శత్రువుయొక్క హస్తాలలో దెబ్బతిన్నారు. వారి బలం కొద్దిగా మిగిలినా, ఎక్కువభాగం యుద్ధాలలో దెబ్బతింది. విప్లవం ఓడిపోవటం తప్పదని పరిస్థితులు సూచించేయి. ఏప్రియల్ 12 వ తారీఖున నుండి విప్లవం ఓడిపోయేవరకూ చియాంగ్-కై-షేక్ ప్రారంభించిన హత్యాకాండమూలంగా అద్భుతమైన పార్టీనాయకులు అనేకమంది విప్లవాత్మక కార్య

కర్తృనేకమంది, అనేకమంది మేధావులు, చియాంగ్ చేతుల్లో బలియైపోయూరు. దేశంయావత్తు అంధకారంలో కృంగిపోయింది. జాతీయ బూర్జువావర్గమేగాక పై తరగతికిజెందిన పెటీబూర్జువావర్గంలో అనేకమంది పార్టీని వదలిపోయూరు. పెటీబూర్జువావర్గంలో నుండి వచ్చిన మేధావులు – పార్టీలో జేరిన మేధావులు – పార్టీనుండి బయటికి పోయేరు. "మిశ్రమ ప్రభుత్వం" అన్న వ్యాసంలో కామ్రేడ్ మావోసేటుంగ్ నుడివినట్లుగా వీరాత్మయైన కమ్యూనిస్టుపార్టీ చైనాదేశపు విప్లవాత్మక ప్రజానీకం మాత్రం "భయపడలేదు. ఆజేయశక్తిగా నిలబడింది. అణగారిపోలేదు. ప్రజానీకం మరల నిలబడింది. రక్తపుమరకలను మరల తుడిచివేసుకొంది. మృతవీరులను సమాధిలోవుంచింది. పోరాడుతూ ముందుకు పయనించింది."

విప్లవద్రోహులైన చియాంగ్, కొమింటాంగులు, చైనా విప్లవాన్ని జనింపజేసిన సమస్యలను వేటినీ పరిష్కరించలేదు. పరిష్కరించజాలకపోయూరు, అంతేగాక చైనాదేశపు జాతీయ సంక్షోభం, చియాంగ్, కొమింటాంగులచే మరింత అధ్వాన్నంగావించబడింది. చియాంగ్, కొమింటాంగులు పూర్తిగా సామ్రాజ్యవాదులపై ఆధారపడసాగేరు; మరింత క్రూరంగా, పూర్వపు అభివృద్ధినిరోధక పరిపాలకులకన్న మరింతక్రూరంగా, నిర్దాక్షిణ్యంగా విప్లవాత్మక ప్రజలను అణచివేయసాగేరు. కస్టమ్స్‌టారిఫ్ లాంటివి కొన్నింటిపై – నామ చేతులనున్నా చియాంగ్ చేతులలోవున్నా ఒకటేకాబట్టి – వాటిపై హక్కులను చియాంగ్‌కు సామ్రాజ్యవాదులు వప్పగించారు. కాని, చైనాలో – సామ్రాజ్యవాదుల దురాక్రమణ మరింతగా

గాఢతరం గాజొచ్చింది. అందులో ప్రత్యేకంగా, చైనా దేశంలో, అమెరికనుసామ్రాజ్యవాదుల ఆర్థిక, రాజకీయ పలుకుబడి మరింత గాఢంగా జొచ్చుకొని పోసాగింది.

గతంలోవలె సామ్రాజ్యవాదం, జమీందారీవిధానాల చాకచక్యంవలన కొమింటాంగ్ యొక్క నూతన యుద్ధస్వాములు పరస్పర విధ్వంసక అంతర్యుద్ధాలలో దిగబడ్డారు. ఇంతకుపూర్వంకన్న మహాఘోరంగా కార్మికులు, కర్షకులు బాధింపబడ్డారు; దోపిడీ చేయబడ్డారు. పాతకాలపు యుద్ధస్వాములపాలనకన్న నగరాలలో కొమింటాంగ్ పరిపాలన రాక్షసంగా తయారయ్యింది. విప్లవానికి ద్రోహంజేసినతర్వాత చియాంగ్ జాతీయ బూర్జువావర్గానికి ప్రతినిధిగా యేమాత్రం వుండలేదు. అతడు సామ్రాజ్యవాదుల, జమీందార్ల దళారీ - బూర్జువావర్గీయుల ప్రయోజనాలకు ప్రతినిధిగా తయారయ్యాడు. అటుతర్వాత కాలంలో నిరంకుశపెట్టుబడిదారీవిధానంగా పేరుపెట్టబడిన - దళారీ, జమీందారీ భూస్వామిక, సైనిక, గుత్తాధికార పెట్టుబడిదారీ విధానానికి ప్రతినిధిగా తయారయ్యాడు. తత్ఫలితంగా, పూర్వంకన్న అమితంగా జాతీయ బూర్జువావర్గం, చియాంగ్ పరిపాలనక్రింద బాధపడసాగింది. ఆనాటిపరిస్థితినిగురించి కామ్రేడ్ మాసీయాంగ్, 1928 సం॥లో యిలా సమీక్షించాడు.

"యీప్రదేశములోని కార్మికులు, రైతులు, సామాన్య ప్రజలందరూ, బూర్జువావర్గంకూడా రాజకీయంగాగానీ, లేక ఆర్థికంగాగానీ విముక్తి జెందకుండానే విప్లవ ప్రతిఘాతుక పరిపాలనక్రింద అణగిపోతున్నారు."

("చైనాలో కమ్యూనిస్టు రాజ్యాంగ యంత్రాధికారం ఎలా అస్తిత్వంలో వుండసాధ్యమవుతుంది." అన్న వ్యాసంలో మాసీయూంగ్ అలా వ్రాసేడు.)

1931, 1937 సంవత్సరాలలో చైనాదేశంలో జపాను సామ్రాజ్యవాదులు పెద్దపెట్టున సైనికదాడులు సాగించ గలుగుటకు ధైర్యాన్ని యిచ్చిన ప్రధాన కారణమిది.

పాతయుద్ధస్వాముల పరిపాలనకన్న చియాంగ్-కై-షేకు యొక్క పరిపాలన అతి రాక్షసంగా వున్నప్పటికీ దానికి కావలసినన్ని బలహీనతలున్నాయి. ప్రధానంగా అది ప్రజలనుండి వేరుపడిపోయింది. ఆంతరంగికంగా గ్రుద్దులాటలతో అది సతమతం గాజొచ్చింది. ప్రజలను అణచివేయుటకై చియాంగ్-కై-షేక్ యొక్క అభివృద్ధి నిరోధక రాజ్యాంగ యంత్రం సామ్రాజ్య వాదులచే బలపరచబడింది. కాని, అతడి ప్రధాన సైన్యాలన్నీ నగరాలలో మాత్రమే వుంచబడ్డాయ్. తత్ఫలితంగా నగరాలలో వున్న ప్రజలకు తమ పోరాటాలను త్వరగా అభివృద్ధి జేసుకొనే అవకాశం లేకపోయింది. ఏమైనప్పటికినీ అతి విస్తారమైన గ్రామీణ జిల్లాలలో దేశమంతటా చియాంగ్-కై-షేక్‌కు శక్తిమంతమైన అభివృద్ధి నిరోధక పరిపాలనను నెలకొల్పుటకు అవకాశముంది.

కోమింటాంగ్ యుద్ధస్వాములలోని వివిధముఠాలు ఒకదానిపై మరియొకటి విడవకుండా యుద్ధంచేయుటచే, చియాంగ్ కష్టాలు వృద్ధియ్యాయి; తన్మూలంగా అతడు భావించినట్లుగా ప్రతిచోటా తన అభివృద్ధినిరోధక పరిపాలన స్థాపించలేకపోయాడు. అందులో ప్రత్యేకంగా విప్లవ ప్రభావం

ప్రసరించిన గ్రామీణ జిల్లాలలోని రైతాంగప్రజలు త్వరగా భూమికావాలని కోరుతున్నారు; భూస్వామికవర్గంతో పోరాడుటకై తమసంఘటితపరచుకొనుటలో అనుభవంగలవారీ రైతాంగప్రజలు. ఈ పరిస్థితి విప్లవానికి అనుకూలంగానూ, విప్లవప్రతీఘాతుకత్వానికి ప్రతికూలంగానూవుంది. వ్యవసాయసమస్య సవ్యంగా పరిష్కరించుటకై రైతాంగ ప్రజలను నడుపలేకపోవటంవలన దానిఫలితంగా ప్రథమ విప్లవాత్మక అంతర్యుద్ధం అపజయాన్ని పొందింది; అయితే యీనాడు విప్లవోద్యమాన్ని పునరుద్ధరించే అవకాశం యీనాటి నూతన పరిస్థితులలో భూమికొరకై రైతాంగ పోరాటాలను సరిగా నడుపుటలోనే వుందని వ్యక్తమవుతూ వుంది.

విప్లవం అపజయాన్ని పొందినస్థితిలో చియాంగ్-కై-షేక్ పరిపూర్ణంగా అభివృద్ధివిరోధకమైన పరిపాలనను స్థాపించుకున్న పరిస్థితులలో విప్లవాత్మకపోరాటాన్ని కొనసాగించవలసిన ఆవశ్యకతనుగురించి ప్రజలకు స్పష్టంచేయటం, వారిని పోరాట పునరుద్ధరణ సత్యమార్గాన నడపటం, యనేవి పార్టీయొక్క కర్తవ్యమైవుంది.

ఆ విధంగా చేయుటకుగాను పార్టీ ప్రథమవిప్లవాత్మక అంతర్యుద్ధానుభవాలను సమీక్షించుకోవాల్సివుంది. పార్టీ నాయకత్వం చేసిన పొరపాట్లను సరిదిద్దుకోవాల్సివుంది. క్రమబద్ధమైన తిరోగమనాన్ని సంఘటితపరచుటకు శత్రువు విజృంభణను సాగిస్తున్నప్పుడు ఆత్మరక్షణ చేసుకొనుటకు విప్లవాత్మక శక్తులనన్నింటిని సత్వరంగా ఒకచోట సమావేశపరచవలసి

వుంది. ఆచరణలో విప్లవ ప్రతిఘాతుక శక్తులు బలహీనంగా వున్న గ్రామీణజిల్లాలకు వ్యవసాయ సంస్కరణోద్యమాన్ని సాగించుటలో రైతాంగాన్ని నడుపుటకై గెరిల్లాయుద్ధాన్ని సాగించుటకై సాపేక్షంగా విప్లవం బాగా పాతుకొనియున్న జిల్లాలకు కొన్ని పార్టీసంఘాలను తరలించవలసిన అవసర ముంది. పార్టీసంఘాలలో కొన్ని నగరాలలోనే వుండిపోయి అజ్ఞాతజీవితాన్ని గడుపుతూ, కార్యకర్తలను, పార్టీసంఘాలను రక్షించుకొనుటకుగాను ప్రజానీకంయొక్క విప్లవాత్మక శక్తులను రక్షించుకొనుటకు, నిర్మించుకొనుటకు ప్రచ్ఛన్నంగా పని సాగించవలసిన అవసరం పార్టీసంఘాలలో మరియొకభాగానికి వుంది. దీని తర్వాత యీ రెండు సేనాదళాలు తమ పోరాటాలను సమాకరింపజేసుకోవాలి. శత్రువుయొక్క ఆంతరంగిక వైరుధ్యాలను, బలహీనతలను వినియోగించుకొని విప్లవోద్యమంయొక్క పునరుద్ధారణకొరకు పోరాడవలసిన అగత్యముంది.

వూహాన్‌లో కొమింటాంగ్ 1927 జూలైలో, కమ్యూనిస్టుపార్టీకి ఎదురుతిరిగిన వెంటనే పార్టీ ఆగస్టు 7వ తారీఖున ఒక సత్వరసమావేశానికి పిలుపిచ్చింది. ఈ కాన్ఫరెన్సు చెన్ - తూ - హిస్యూ యొక్క లొంగుబాటు తత్వాన్ని పూర్తిగా సరిదిద్దింది. అతిణ్ణి నాయకత్వంనుండి తొలగించివేసింది. 1928, జూలైమాసంలో జరుపబడిన ఆరవపార్టీ కాంగ్రెసులో చెన్-తూ-హిస్యూయొక్క తప్పిదాలను బాగా పరీక్షించింది. కాని, చెన్-తూ-హిస్యూ, తన తప్పిదాలను వప్పుకోలేదు. అతడు అతనిని బలపరచెవారు బూర్జువా

విజయంతో చైనా బూర్జువా ప్రజాతంత్రవిప్లవం పూర్తి అయ్యిందనీ, బూర్జువావర్గం అప్పుడే తనపరిపాలనను స్థాపించుకొన్నదనీ, బూర్జువావర్గం తన పరిపాలనను దృఢతరం చేసుకొంటుందనీ అందువలన చైనా శ్రామికవర్గం విప్లవాత్మక పోరాటాన్ని విడచివేసి బహిరంగ కార్యకలాపాలకు వచ్చి వేయాలనీ భవిష్యత్తులో సోషలిస్టువిప్లవాన్ని ప్రారంభించుటకై వేచియుండాలనీ, వాదించారు. అప్పటినుండి చెన్ - తూ-హిస్యూ, అతని అనుచరులు పార్టీవ్యతిరేక - కార్యకలాపాలను సాగించుటలో ట్రాట్స్కీయిష్టులతో సహకరించుతో, విప్లవవ్యతిరేకమార్గాన్ని అనుసరించారు. అందువలన 1929 సంవత్సరంలో పార్టీ వారిని బహిష్కరించింది.

విప్లవాన్ని రక్షించుటకుగాను మనపార్టీ తన ఆగస్టు 7 వ కాన్ఫరెన్సులో (1927, శరత్కాలపంటల తిరుగుబాటును చేయవలసిందిగా రైతాంగప్రజలకు పిలుపు యిచ్చింది. కాన్ఫరెన్సు అయినతరువాత కా|| మేడ్ మావోసేటూంగ్ పశ్చిమ కియంగ్సీరాష్ట్రంలోని వివిధప్రదేశాలకు తూర్పు హూనాన్ రాష్ట్రంలోని వివిధప్రదేశములకు వెళ్ళాడు. ఆ ప్రదేశాలలో కార్మికకర్షకులను, ఉత్తరదేశదండయాత్రసైన్యంలోనిఒకభాగం చేతను తిరుగుబాటు చేయించాడు. హూనాన్, కియాంగ్సీ. రాష్ట్రాలసరిహద్దులలో కార్మిక కర్షకుల విప్లవసైన్యాన్ని స్థాపించాడు. శత్రువునకు వ్యతిరేకంగా పోరాడాడు.

వీటితోపాటు 1927 సంవత్సరం శరత్కాలము, వర్షాకాలమునుండి 1928 సంవత్సరం వసంతఋతువువరకు మనపార్టీ తూర్పు హూపీరాష్ట్రములోను హూనాన్ రాష్ట్ర

ము లోని తూర్పు దక్షిణభాగములోను, కాంటన్ మహానగరములలోను, తూర్పు క్వాంగ్‌టంగ్ రాష్ట్రంలోను, హైనాన్ ద్వీపకల్పములోను, పశ్చిమ క్వాంగ్‌సీరాష్ట్రంలోను, తదితర ప్రాంతాలలోను సాయుధ రుణబాటులను సంఘటితపరచింది. దక్షిణహూనాన్ రాష్ట్రంలో జరిగిన తిరుగుబాట్లకు కామ్రేడ్సు ఛూటేచన్, యీలింపియానో మరియు యితరులు నాయకత్వం వహించారు. వీరు నాన్‌చాంగ్ తిరుగుబాట్లలో పాల్గొన్న కొన్ని సైన్యాలకు అంటే క్వాంటుంగ్‌లో అపజయాన్ని పొందిన తరువాత రక్షించుకొన్న కొన్ని సైన్యాలను—దక్షిణహూనాన్‌లోనికి నడిపించారు. అటుతరువాత, వెంటనే కర్షక సైన్యంతో పాటు – అంటే, తిరుగుబాట్లలో ఏర్పాటుచేయబడిన కర్షక సైన్యంతోపాటు – తమ సైన్యాలను కలుపుకొని కామ్రేడ్ మావోసీయాంగ్ నాయకత్వాన నడచుచున్న సైన్యాలతో కలియుటకుగాను ముందుకు సాగారు. తిరుగుబాట్ల కాలంలో సృష్టించబడిన యితర ప్రదేశాల సాయుధ సైన్యాలలో కొంతభాగంకూడ చెక్కుచెదరకుండా వుంచబడింది. ఈ సాయుధ సైన్యాలు సవ్యంగా నడుపబడిన తావులలో విప్లవాత్మక సాయుధపోరాటం అభివృద్ధిచెందింది. దీనితరువాత రెండవ విప్లవాత్మక అంతర్యుద్ధం ప్రారంభమయ్యింది. ఈ సైన్యాలే చైనా కార్మిక కర్షక ఎఱ్ఱసైన్యానికి – అంటే, ప్రస్తుత చైనా ప్రజావిముక్తి సైన్యానికి మూలం.

అయితే, విప్లవం అపజయాన్ని పొందిన పరిస్థితులలో మొత్తంమీద పార్టీసంఘాల కర్తవ్యం ఏమంటే విజృంభణను సాగించుటకు బదులుగా సవ్యమైన తిరోగమనాన్ని సాగించ

వలసివుంది. స్థానికసాయుధ పోరాటాలు, తాత్కాలికంగా ఆత్మరక్షణపోరాటవిధానాన్ని అవలంబించాలిగాని అంతకన్న మరేమీచేయరాదు. విప్లవం వుచ్ఛస్థాయిలో నున్నట్లుగా తప్పుడు అంచనా వేయబడింది. విప్లవం అపజయాన్ని పొందిందన్న విషయం నిరాకరించబడింది. తత్ఫలితంగా మనపార్టీ కామేడ్ 'చూచియూపాయ్' నాయకత్వాన 1927 వర్షాకాలంనుండి 1928 వసంతఋతువు వరకు విప్లవాన్ని గురించి తప్పుడు అంచనావేసి 'అతివాద' కుట్రతత్వంలో పడిపోయి, తిరోగమనాన్ని వ్యతిరేకించింది. విజృంభణను సాగించాలని కోరింది. ఆ విధంగా మిగిలియున్న విప్లవాత్మకశక్తులకు అనేక కష్టాలు కలిగేటట్లు చేసింది. 1928 జులైలో జరుపబడిన 6 వ పార్టీ కాంగ్రెసు చెన్-తూ-హిస్యూ యొక్క లొంగుపాటు తత్వాన్ని రద్దుచేసింది. అదేకాలంలో అతివాదకుట్రతత్వం యొక్క పొరపాట్లనుకూడ విమర్శించింది. యీ 6 వ పార్టీ కాంగ్రెసు చైనావిప్లవం స్వభావంలో ఒక ప్రజాతంత్రవిప్లవమనీ అందువలన సామ్రాజ్యవ్యతిరేకమైన, జమీందారీవ్యతిరేకమైన కార్మిక కర్షక ప్రజాతంత్ర నియంతృత్వాన్ని స్థాపించుట సాధారణ కర్తవ్యమని మరల గట్టిగాచెప్పింది. అంతేగాక, యీ కాంగ్రెస్సు కార్మిక కర్షక ప్రజాతంత్రనియంతృత్వం కొరకు కార్యక్రమంయొక్క వివిధవైఖరులను కూడ రూపొందించింది. ఎర్రసైన్యాన్ని స్థాపించవలసిన కర్తవ్యాన్ని గ్రామీణప్రాంతాలలో విప్లవస్థావరాలను స్థాపించవలసిందనీ, భూసంస్కరణ విధానాన్ని స్థాపించవలసిందనీ యీ కాంగ్రెస్సు ఉద్ఘాటించింది. విప్లవసంచలనం తప్పక రాగలదనీ, అయితే

ఆనాటి రాజకీయపరిస్థితి రెండు విప్లవాత్మకసంచలనాల లేక, తిరుగుబాట్లకాలానికి మధ్యకాలానికి జెందినదిగా వున్నదనీ; అందువలన ఆ కాలంలో, ప్రతిప్రదేశంలోనూ, విజృంభణ సాగించుటగానీ, తిరుగుబాట్లను తెచ్చుటగాని పార్టీకర్తవ్యం గాదనీ, ప్రజలను తమవైపునకు త్రిప్పుకొనుటయే పార్టీయొక్క అప్పటి సాధారణ కర్తవ్యమనీ పార్టీ కాంగ్రెసు వివరించింది. ఆరవపార్టీ కాంగ్రెసు వివరించిన విషయాలివి. ఇక యీ ఆరవపార్టీ కాంగ్రెసు లోట్లు యేమంటే: ప్రజాతంత్ర విప్లవం యొక్క దీర్ఘకాలిక స్వభావాన్నిగురించి సవ్యమైన అంచనా వేయలేకపోయింది. మధ్యమతరగతుల పాత్రనుగురించి, అభివృద్ధి నిరోధకశక్తులలోని అంతర్గత వైరుధ్యాలనుగురించి సవ్యమైన అంచనా వేయలేకపోయింది. వ్యూహాత్మకంగా పార్టీ, తిరోగమనాన్ని సాగించవలసిన ఆవశ్యకతనుగురించి మనపార్టీ సవ్యంగా అర్థం జేసుకోలేకపోయింది. అందులో ప్రత్యేకంగా, పార్టీ బలంతో పోల్చిచూస్తే నగరాలలో శత్రువుయొక్క బలం అధికంగా వుంది. పల్లెలలో శత్రువు యొక్క బలం చాలా హీనంగా వుంది. అందువలన పార్టీ, తన కార్యకలాపాల కేంద్రాన్ని నగరాలనుండి తరలించి, పల్లెప్రాంతాలకు మరలించవలసిన ఆవశ్యకతనుగురించి సవ్యంగా అర్థం జేసుకొనలేకపోయింది ఆనాటి ఆరవపార్టీ కాంగ్రెసు. ఇంత ప్రధానమైనసమస్యను ఆరవపార్టీ కాంగ్రెసు అర్థం జేసుకొనలేకపోయింది.

దీనికి కారణమేమంటే, పార్టీయొక్క నాయకత్వం యింకనూ, "అదివాద" శక్తుల హస్తాలలో వుంది. ఆరవపార్టీ

కాంగ్రెసుయొక్క యీ లోట్లు పార్టిలోనున్న "అతివాద" పెడమార్గాలను సరిదిద్దనీయకుండా అడ్డుతగిలాయి.

ఆరవపార్టి కాంగ్రెసునకు, కామ్రేడ్ మావోసేటుంగ్ హాజరు కాలేదు. ఆయనను పార్టి కాంగ్రెసు, కేంద్రసభ్యుడుగా ఎన్నుకొంది.

ఆరవపార్టి కాంగ్రెసు సరిగా పరిష్కరించక విడచివు చ్చినసమస్యలను తరువాతకాలంలో కామ్రేడ్ మావోసేటుంగ్ ఆచరణలోనూ, సిద్ధాంతరీత్యాను పరిష్కరించాడు. 1927, అక్టోబరు మాసంలో, కామ్రేడ్ మావోసేటుంగ్, తాను కొత్తగా స్థాపించిన కార్మిక, కర్షక విప్లవసైన్యాన్ని, కియాంగ్సి. హూనాన్ రాష్ట్రాల సరిహద్దులలోనూ ఛింగ్ కియాంగ్ పర్వతప్రదేశానికి, తిరోగమమింప జేసాడు. అక్కడ హూనాన్ - కియాంగ్సి సరిహద్దుప్రాంత కార్మిక, కర్షక ప్రభుత్వాన్ని స్థాపించాడు. శత్రువుచేసిన దాడులను త్రిప్పి కొట్టాడు, భూసంస్కరణ విధానానికై రైతాంగప్రజలను నడుపసాగాడు.

కామ్రేడ్ ఛూతే నాయకత్వాన కామ్రేడ్ పెంగ్ టే - హువా నాయకత్వాన నడుపబడుచున్న సైన్యాలు ఒకదానితర్వాత మరియొకటి, కామ్రేడ్ మావోసేటుంగ్ నాయకత్వాననున్న సైన్యాలతో చేరగానే, ఛింగ్ కాంగ్ పర్వతాలను కేంద్రంగా జేసుకొని, విప్లవస్థావరాలు క్రమేణా విస్తరించాయి. యీ కాలంలో, పార్టి నాయకత్వంక్రింద భూమికోరకై రైతాంగప్రజల గెరిల్లా యుద్ధతంత్రం, పోరాటాలుకూడా, కియాంగ్సి, హూనాన్, హూపే, క్వాంగ్సి

మరియు యితరరాష్ట్రాలలో అభివృద్ధి చెందాయి. ఎర్రసైన్యం యొక్క అనేక సేనాదళాలు అనేక విప్లవస్థావరాలు, ఒకదాని తర్వాత మరియొకటిగా యేర్పడ్డాయి. 1929, సంవత్సరములో కామేడ్స్ మావోసీటూంగ్, ఛూతేల నాయకత్వానవున్న ఎర్రసైన్యం, కియాంగ్సీరాష్ట్రముయొక్క దక్షిణభాగానికి, ఫూకీన్ రాష్ట్రముయొక్క పశ్చిమభాగానికి, పురోగమించింది. కియాంగ్సీ రాష్ట్రములోని జ్యూచిన్‌ను తను కేంద్రంగా జేసుకొని కేంద్ర విప్లవ స్థావరాలను స్థాపించింది.

ప్రప్రథమంగా కామ్రేడ్ మావోసీటూంగ్ 1927 సంవత్సరం వర్షాకాలంలో స్థాపించిన విప్లవస్థావరాలు, ఆయన నడిపిన విప్లవయుద్ధమూ, యితర కామ్రేడ్సు యితర ప్రదేశాలలో స్థాపించిన విప్లవస్థావరాలు, వారు నడిపిన విప్లవయుద్ధాలు నూతన కాలంలోని చైనా విప్లవాత్మక పోరాటంయొక్క ప్రధాన విషయాలయ్యాయి. జాతియొక్క రాజకీయ జీవితంలో ప్రధానాంగాలుగా తయారయ్యాయి. చియాంగ్ యొక్క అభివృద్ధినిరోధక పరిపాలనకు బెడదగా, భయోత్పాదకాలుగా తయారయ్యాయి. యావద్దేశములోని శ్రామిక ప్రజలకు అఖండ ఆశాజ్యోతులుగా తయారయ్యాయ్.

ఎర్రసైన్య యుద్ధ తంత్రాభివృద్ధి గ్రామీణ విప్లవ స్థావరాలు సృష్టించబడుటకు ఎలా సాధ్యముయ్యింది? ఆనాటి చైనా విప్లవ పోరటానికి అవి ప్రధాన విషయాలుగా ఎలా అవగలిగేయ్?

ఈ ప్రశ్నలకు సైద్ధాంతిక జవాబులను, కామ్రేడ్ మావోసీటూంగ్ తన రెండు వ్యాసాలలో యిచ్చేరు. అంటే

1928 అక్టోబరు మాసంలో ఆయన "చైనాయొక్క ఎర్ర రాజ్యాంగాధికారం అస్తిత్వంలో వుండుటకు సాధ్యమవుతుంది ఎందుకని ?" అని వ్రాసిన వ్యాసంలోనూ 1930 జనవరిలో "ఒక్క రవ్వ, పెద్దమంటను రేపెట్టుతుంది" అని ఆయన వ్రాసిన వ్యాసంలోనూ, పై ప్రశ్నలకు సైద్ధాంతిక జవాబులున్నాయ్. మొదటి వ్యాసంలో కా|మేడ్ మాసీయాంగ్ ఆ కాలంలో ఎర్ర ప్రభుత్వాధికారం అస్తిత్వంలో వుండుటకు సాధ్యగున్న విషయానికి సంబంధించిన అయిదు పాయింట్లను ఎత్తిచూపేడు.

(1) చైనా వ్యవసాయక ఆర్థికవిధానం పరిమితించబడుటచేతనూ, దాంతోపాటు సామ్రాజ్యవాదులు, చైనా దేశాన్ని ముక్కలు ముక్కలుగా జేసి తమ దోపిడి విధానాన్ని సాగించుచుండుటచేతనూ, సామ్రాజ్యవాదులు, చైనా దేశంలో తమలో తాము తమ పలుకుబడి ప్రాంతాలను సృష్టించుకొనుటకు యత్నించు చుండుట చేతనూ, తత్ఫలితంగా అభివృద్ధిక పరిపాలనలో గండ్లను సృష్టించారు. విప్లవశక్తులు, దానినుండి ప్రయోజనాన్ని పొందవచ్చును.

(2) చైనా దేశంలోని అనేక ప్రాంతాలలో ప్రథమ విప్లవాత్మక అంతర్యుద్ధంయొక్క ప్రభావం ప్రజలలో మిగిలి వుంది.

(3) దేశమంతటిలోని విప్లవ పరిస్థితియొక్క అభివృద్ధి సాగుతూవుంది.

(4) ఎర్ర ప్రభుత్వాధికారాన్ని సపోర్టు చేయుటకు ఎర్రసైన్యం అస్తిత్వంలోవుంది.

(5) ఎర్ర ప్రభుత్వాధికారాన్ని నడుపుటకు, నిర్మాణాత్మకంగా శక్తివంతమైన కమ్యూనిస్టుపార్టీ వుంది. దానికి సవ్యమైన పాలసీ వుంది.

రెండవ వ్యాసంలో కామ్రేడ్ మాసీయాంగ్, చైనా ఎర్రసైన్యంచే చేయబడుతున్న యుద్ధంయొక్క ప్రాధాన్యతను గురించి వివరంగా అంచనావేసి చెప్పేడు.

ఎర్రసైన్య యుద్ధతంత్రం, విప్లవ స్థావరాలనేవి, "అర్థవలస దేశంలో రైతుపోరాటాలు అవలంబించ వలసిన అత్యుత్తమమైన అత్యంత అవశ్యకమైన రూపమనీ, రానున్న యావజ్జాతీయ విప్లవాత్మక తిరుగుబాట్లను పెంపొందించుటకు అత్యంత ప్రధానమైన విషయాలనీ" కామ్రేడ్ మాసీయాంగ్ వుద్ఘాటించేడు. ఎర్రసైన్యం నడిపేయుద్ధం వ్యవసాయిక విప్లవం, విప్లవాత్మక ప్రభుత్వ నిర్మాణం, అతివిస్తారంగా, వీలైనంత ఎక్కువస్థాయిలో అభివృద్ధి చేయబడాలనీ, కామ్రేడ్ మాసీయాంగ్ అభిప్రాయపడ్డాడు.

"ఆవిధంగా చేయుటద్వారానే, సోవియట్ యూనియన్ ప్రపంచంయొక్క విశ్వాసాన్ని, గౌరవాన్ని, చూరగొన్నట్లుగానే యావత్తు చైనాదేశంలోని అసంఖ్యాక విప్లవాత్మక ప్రజానీకంయొక్క విశ్వాసాన్ని, గౌరవాన్ని మనం పొందగలుగుతాం. ఆవిధంగా చేయుటవల్లనే పాలకవర్గాలకు అంతులేని కష్టాలను కల్పించగలుగుతాం. వారి పునాదులను వూపివేయ గలుగుతాం. వారిలో విచ్ఛిత్తిని త్వరితం చేయగలుగుతాం, ఆవిధంగా చేయుటవల్లనే రానున్న మహావిప్లవంలో ప్రధానాయుధాలలో ఒకటిగా నుండగలిగే ఒక ఎర్ర

సైన్యాన్ని యదార్థంగా సృష్టించ గలుగుతాం. క్లుప్తంగా చెప్పాలంటే రానున్న విప్లవ ప్రవాహాన్ని మరింతగా పెంపొందించ గలుగుతాం.'' ఆవిధంగా కామ్రేడ్ మాసీయాంగ్ శక్తిమంతమైన శత్రువులచే నగరాలలో చైనా విప్లవం ఓడింపబడిన పరిస్థితిలో నగరాలలో విప్లవం ప్రస్తుతం విజయాన్ని సాధించే అవకాశం లేని పరిస్థితిలో చైనా విప్లవాభివృద్ధికి సవ్యమైన ఏకైక సూత్రాన్ని కనిపెట్టేను. సాయుధమైన విప్లకాత్మకమైన గ్రామీణ జిల్లాల సహాయంతో విప్లవ ప్రతీఘాతుకులు ఆక్రమించుకొన్న నగరాలను చక్రబంధంలో బిగించి స్వాధీనం చేసుకొనుటకై ఏర్పాటుచబడిన సూత్రమిది. అటుతర్వాత గడిచిన యిరువై సంవత్సరాలలోనూ చైనా విప్లవాభివృద్ధి కామ్రేడ్ మాసీయాంగ్ యొక్క దూరదృష్టిని పూర్తిగా ధృవపరచింది.

ఈ కాలంలో కామ్రేడ్ మాసీయాంగ్ పార్టీకి రెండవ విప్లవాత్మక యుద్ధకాలంలోని విప్లవాభివృద్ధియొక్క సాధారణ క్రమాన్ని రూపొందించి యిచ్చుటయేగాక వ్యవసాయక విప్లవానికి సంబంధించిన పాలసీలను, మధ్యమతెరగతులకు సంబంధించిన పాలసీలను బలాధికమైన శత్రుసైన్యాలను ఓడించుటకు కావలసిన వ్యూహం ఎత్తుగడలను, సైన్యాలలో పనిజేసే విధానాన్ని గ్రామీణ జిల్లాలలో పార్టీ నిర్మాణానికి సంబంధించిన విషయాలను, యుద్ధపరిస్థితులలో పనిచేయువలసిన విధానాలను చక్కగా వివరించి, తన సృజనాత్మకశక్తిని చాటినాడు.

గ్రామీణజిల్లాలలో బీదరైతులు, వ్యవసాయకూలీలు అమోఘ విప్లవాత్మకశక్తులన్నది యదార్థమే. విప్లవాన్ని

గట్టిగా బలపరచుచున్నది మధ్యమతరగతి రైతులు ఒక ప్రధానశక్తియన్నది నిజమే. అయితే బూర్జువా ప్రజాతంత్ర విప్లవదశలు ధనికరైతు ఆర్థికవిధానం రక్షింపబడవలసిన అవసరం యింకా వుంది. మధ్యరకానికి చెందిన మరియు చిన్నఎత్తు పరిశ్రమలు, వ్యాపారం రక్షింపబడవలసిన అభివృద్ధి చెందించబడవలసిన అవసరం యింకను వుంది. కామ్రేడ్ మావోసేటుంగ్, వ్యవసాయక విప్లవంలో సవ్యమైన పంథాను నిర్వచించుటయేగాక గట్టిగా దానిని అనుసరించాను కూడ. అంటే, అతడు వ్యవసాయక విప్లవంలో బీదరైతులు వ్యవసాయకూలీలపై ఆధారపడి మధ్యమతరగతికి చెందిన రైతులలో సమైక్యమవుతూ, ధనికరైతులను మధ్యమరకపు చిన్నఎత్తు పరిశ్రమదారులను, వ్యాపారస్థులను పరిమితించుచూ భూస్వామికవర్గాన్నిమాత్రమే రద్దుచేయుచు పనిచేయసాగారు. చైనా విప్లవంలో యుద్ధమనేది పోరాటంయొక్క ప్రధానరూపం. సైన్యమనేది నిర్మాణంయొక్క ప్రధానరూపం. మరియు ఆ కాలంలో విప్లవాత్మక యుద్ధంయొక్క స్వభావమేమంటే మనం బలహీనంగా యున్నప్పుడు శత్రువు బలంగా యున్నాడు; శత్రువునకు పెద్ద సైన్యాలు వుంటే మనకు చిన్నసైన్యాలు వున్నాయి; శత్రువు ప్రజలనుండి దూరమయ్యాడు, మనం ప్రజలతో అత్యంతసన్నిహితంగా సమైక్య మయ్యాము. ఎర్రసైన్యం పార్టీ పనిలో ప్రచారకులుగా ఆర్గనైజర్లుగా తయారుగావాలనీ; ప్రజాప్రభుత్వాధికారంలోను వ్యవసాయికసంస్కరణల కార్యక్రమంలోను తదితర స్థానిక కార్యక్రమా లన్నింటిలోను ఎర్రసైన్యం ప్రచారకులుగాను, ఆర్గనైజర్లుగాను వుండాలని;

ఎర్రసైన్యం తన సైనికులలో బలవత్తరమైన రాజకీయ కార్యక్రమాన్ని అభివృద్ధిపరచాలని సుశిక్షితమైన సామూహిక క్రమశిక్షణను అవలంబించాలని; ఎర్రసైన్యంచే చేయబడే యుద్ధం ప్రజానీకంపై ఆధారపడిన ప్రజాయుద్ధంగా యుండాలని; అది గెరిల్లాయుద్ధతంత్రాన్ని అనుసరించాలని; ఆ కాలంలో గెరిల్లాయుద్ధతంత్రస్వభావాన్ని ప్రధానపోరాటరూపంగా కల్గియున్న చంచలమాన (మొబైల్ వార్‌ఫేర్) యుద్ధతంత్రాన్ని అవలంబించాలని; వ్యూహాత్మకంగా అది దీర్ఘకాలికయుద్ధాన్ని కొనసాగించాలని ఎత్తుగడల రీత్యా త్వరితగతి ఫలితాలనిచ్చే యుద్ధాలను చేయాలని; సాధారణసమయాలలో ప్రజలను సమీకరించుటకు సైన్యాలను పంపాలనీ, యుద్ధసమయంలో శత్రువును చుట్టుముట్టి నాశనం చేయుటకుగాను బలాధికమైన సైన్యాలను కేంద్రీకరించాలని యిలాంటి ప్రధాన సూత్రాలను కామ్రేడ్ మావోసేటుంగ్ రచించేడు. ఈమూలసూత్రాలు కొన్ని యితర సైనిక సూత్రాలు కలసి చైనా విప్లవ యుద్ధ యొక్క సైనిక పంథాగా ఏర్పడ్డాయి. యివన్నీ యిల్లావుండగా చైనా విప్లవంయొక్క యీ కష్టకాలంలో చైనా విప్లవాన్ని విజయంవైపుకు గొనిపోవుటకు కావలసిన ప్రధానమైన పునాదులను కామ్రేడ్ మావోసేటుంగ్ రచించాడు.

1930 సంవత్సరంలో దేశం మొత్తంమీద ఎర్రసైన్యం 60,000 మందికి పెరిగింది. అందులో కియాంగ్సీ రాష్ట్రంలోని మధ్యప్రాంతంలో 30,000 మంది వున్నారు. 1930 సంవత్సరంలోనూ, అటుతర్వాత కొద్దికాలం గడచిన తర్వాత విప్లవ

స్థావరాలు, ఫూకీన్, అన్హ్వాయ్, హోనాన్, షెన్సి, కాన్సూ, యితర రాష్ట్రాలకు అంతేగాక హైనాన్ ద్వీపకల్పానికి, క్వాంగ్ టంగ్ రాష్ట్రాలకు విస్తరించినాయ్. ఎర్రసైన్యంయొక్క సత్వ రాభివృద్ధివలన చియాంగ్-కై-షేక్‌కు పెద్ద "షాక్" కొట్టిన ట్లయ్యింది. 1930 సంవత్సరాంతానికి చియాంగ్-కై-షేక్ ఒక లక్షమంది సైనికులతో కూడిన యేడు డివిజన్ల సైన్యాన్ని మధ్యప్రాంతంలోనున్న ఎర్రసైన్యాన్ని చక్రబంధంలో బిగించి నాశనం జేయుటకు పంపేడు. చియాంగ్ సైన్యాలలోని ఒకటి న్నర డివిజన్ల సైన్యాన్ని ఎర్రసైన్య హతమార్చింది. చియాంగ్ యొక్క సేనల కమాండరును ఖైదీగా పట్టుకొంది. 1931 సం వత్సరంలో చియాంగ్ రెండు లక్షల సైనికులను మధ్యప్రాం తంలోనున్న ఎర్రసైన్యం పైకిపంపేడు. చియాంగ్ సైన్యా లకు ఈమారు కమాండరు హోయింగ్‌చిన్ అనేవాడు. చియాంగ్ సేనలు ఎర్రసైన్యంపై చక్రబంధం ప్రారంభించేయ్. కాని మరల చియాంగ్‌సైన్యాలను తుక్కుతుక్కుగాకొట్టి వేసింది ఎర్రసైన్యం. ఈ యుద్ధంలో ఎర్రసైన్యం, చియాంగ్ సైనికులను 30,000 మందిని ఖైదీలుగా పట్టుకొంది; 20,000 చిన్నఆయుధాలను పట్టుకొంది. అదేసంవత్సరం జులై మాసంలో చియాంగ్ మూడవదండయాత్ర ప్రారంభించేడు. ఈమారు తానే స్వయంగా సేనలకు నాయకత్వంవహించేడు. ఈమారు మూడులక్షమంది సైనికులతో వచ్చేడు. ఈసారి బ్రిటిష్, జపాను, జర్మనీ సైనికసలహాదార్లను సహాయంగా తెచ్చుకొన్నాడు. మధ్యప్రాంతంలోనికి మూడుపైపులనుండి లోతుగా ఎర్రసైన్య స్థావరాలలోనికి చొరబడ్డారు. కాని,

ఎర్రసైన్యం చియాంగుకు మరల బుద్ధిచెప్పింది. చియాంగ్ దండయాత్ర మరల విఫలమయ్యింది. అదేకాలంలో మొదట్లో హూపే - హోనాన్ - అన్వాయ్ స్థావరంలో నిల్వవుంచబడి తర్వాత, ఉత్తరషేజుహన్ స్థావరానికి మార్చబడిన కామ్రేడ్ హినూ-సియాంగ్-చియన్ నాయకత్వంక్రిందవున్న సైన్యమూ, కామ్రేడ్ హోలంగ్ నాయకత్వంక్రింద పశ్చిమహోనాన్ పశ్చిమ-హోపేస్థావరాలలో నున్న సైన్యాలు, అనేక ఘన విజయాలను సాధించాయ్.

ఎర్రసైన్యాన్ని ఎదిరించిపోరాడుటకు పంపబడిన కోమింటాంగ్ 26 వ సైనికదళంలోని పదివేలమంది సైనికులు, ఎర్రసేనలు చేపట్టుతున్న విజయపరంపరలచే ప్రభావితులై, కియాంగ్సీరాష్ట్రంలోని నింగతూ అనే తావులో కామ్రేడ్లు చావో-పో-షెంగ్, తుంగ్‌చెన్‌తాంగ్, యితరకామ్రేడ్ల నాయకత్వంక్రింద 1931 డిసెంబరుమాసంలో కోమింటాంగ్ సేనలకు వ్యతిరేకంగా తిరుగుబాటుచేసి, ఎర్రసైన్యంలో జేరిపోయారు. అలాంటి విజయాలద్వారా, ఎర్రసైన్యం యొక్క బలం పెరుగజొచ్చింది. నూతన విప్లవాత్మక పరిస్థితి క్రమేణా ఫలవంతం కాజొచ్చింది.

సరిగా యిదే సమయంలో 1931 సెప్టెంబరు 18 వ తారీఖున జపాను సామ్రాజ్యవాదులు ఈశాన్య చైనాలో దురాక్రమణ సాగించేరు. 1894 సంవత్సరంలో జరిగిన చైనా జపాను యుద్ధకాలంనుండి చైనాపై దురాక్రమణ సాగించుటకు కృతనిశ్చయులైయున్న జపాను సామ్రాజ్యవాదులు, 1929 సంవత్సరంలో వచ్చిన ఆర్థిక సంక్షోభమువలన పెట్టు

బకీదారీ ప్రపంచం దెబ్బతిన్న మూలంగా బ్రిటను అమెరికా, తదితర దేశాలు తమ స్వంత దేశ వ్యవహారాలలో నిమగ్నమై యుండుటను జూచి, చైనాదేశాన్ని మ్రింగుటలో తమతో పోటీ పడవని భావించారు. అంతేగాక బ్రిటిష్, అమెరికను సామ్రాజ్యవాదుల సహాయంపై ఆధారపడుతూవున్న చియాంగ్-కై-షేక్ ప్రభుత్వం ఆ సామ్రాజ్య వాదులకు లొంగిపోవుటనూ, విప్లవ ప్రతిఘాతుకులు తమలో తాము కలహించుకొనుటకు సామ్రాజ్యవాదుల సహాయంపై ఆధారపడి యుండుటనూ, కార్మిక, కర్షకుల ఎర్రసైన్యానికి వ్యతిరేకంగా యుద్ధం చేయుటలో చియాంగ్ ప్రభుత్వం నిమగ్నమై యుండుటను జూచి, చియాంగ్ ప్రభుత్వం తన్ను ఎదిరించే స్థితిలో లేదుకదా యున్న ధైర్యంతో జపాను సామ్రాజ్యవాదులు చైనాలో దురాక్రమణ యుద్ధాన్ని ప్రారంభించేరు.

ఈశాన్య చైనాలో దురాక్రమణను సాగించి క్రమేణా తమ దురాక్రమణను చైనాయంతటా సాగించాలని జపాను సామ్రాజ్య వాదులు నిశ్చయించుకున్నారు చియాంగ్ ప్రభుత్వం జపాను సామ్రాజ్య వాదులను ప్రతిఘటించుటకు యేమాత్రంగానూ యత్నించకుండా, "కమ్యూనిస్టులను అణచివేయుటలో" నిమగ్నమయ్యింది. భయంకర ఫాసిస్టువిధానాన్ని మరింతగా అమలుజరుపసాగింది. తత్ఫలితంగా 1931 లో, చైనా ఈశాన్య ప్రాంతాన్ని జపాను సామ్రాజ్యవాదులు త్వరితంగా కబళించగలిగారు. 1932 జనవరిలో, వారు షాంఘై నగరాన్ని ఆక్రమించుకున్నారు. 1933 సంవత్సరంలో జెహోలు రాష్ట్రాన్ని,చాహార్ రాష్ట్రంలోని వుత్తరప్రాంతాన్ని ఆక్రమిం

చుకున్నారు. 1933 సంవత్సరంలో, హోనై రాష్ట్రంలోని తూర్పు భాగాన్ని ఆక్రమించుకున్నారు.

జపాను సామ్రాజ్యవాదుల దురాక్రమణ, చైనాదేశపు రాజకీయపరిస్థితిలో ప్రధానమైనమార్పును గొనివచ్చింది. జపాను దురాక్రమణను ప్రతిఘటించుటయనేది సర్వోపరి కర్తవ్యమయ్యింది. యావత్ చైనా ప్రజల సార్వజనిక కోర్కె అయింది. జపాను సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా కార్మికులు, కర్షకులు విద్యార్థులు నడిపినవుద్యమాలకు, దేశమంతటా బలమేర్పడింది. 1927 సంవత్సరంలో విప్లవంనుండి మరలిపోయిన పెట్టీ - బూర్జువావర్గంలోని పైవర్గమూ, జాతీయ బూర్జువావర్గమూ, అనాడు, తమ రాజకీయవైఖరిని మార్చుకొన్నాయ్; రాజకీయంగా చురుకుగా పనిచేయ ప్రారంభించేయ్; చియాంగ్ యొక్క ప్రభుత్వం తన వైఖరిని మార్చుకోవాలని డిమాండు చేసేయ్. రాజకీయవిచ్ఛిన్నం, కొమింటాంగ్ అనుయాయులలోనూ, కొమింటాంగ్ సైన్యాలలోనూ కూడా ప్రారంభమయ్యింది. 1932 జనవరి మాసంలో షాంఘైప్రజల జపాను - వ్యతిరేకవుద్యమంచే ప్రాభావితమైన కొమింటాంగ్ 19 వ రూట్ సైన్యం షాంఘైనగరంపై దురాక్రమణను సాగించిన జపానుసైన్యాలను నిలబెట్టి వీరోచితంగా పోరింది. 1933 నవంబరుమాసంలో యీ సైన్యంయొక్క నాయకులు, ఫూకిన్ రాష్ట్రంలో చియాంగ్‌ను వ్యతిరేకించుతూ ప్రజాప్రభుత్వాన్ని స్థాపించారు; కమ్యూనిస్టులతో ఐక్యతకై యత్నించేరు. 1933 మే నెలలో, ఫెంగ్-యూ-హిసియాంగ్, కమ్యూనిస్టుల సహా

కారంతో చాహార్ రాష్ట్రంలోని కాలగాన్ వద్ద జపాను-వ్యతిరేక-ప్రజా-మిత్ర-సైన్యాన్ని సంఘటితపరచేడు.

జాపాను దురాక్రమణదారులు, చైనాపై దురాక్రమణ సాగించగానే వారిని ప్రతిఘటించవలసినదిగా పిలుపిచ్చిన వారిలో చైనాకమ్యూనిస్టుపార్టీ మొట్టమొదటిది, జపాను వ్యతిరేక యావజ్జాతియ ప్రజావుద్యమాన్ని చైనాకమ్యూనిస్టు పార్టీ నడిపింది; దానిలో చురుకుగా పాల్గొంది. ఈశాన్య ప్రాంతప్రజలు నడుపుచున్న జపాను వ్యతిరేక గెరిల్లాయుద్ధాన్ని చైనాకమ్యూనిస్టుపార్టీ నడిపింది; దానిలో చురుకుగా పాల్గొంది. 1933 జనవరిలో చైనా కార్మిక, కర్షకుల ఎర్రసైన్యం మూడుషరతులను ప్రకటించింది; అవేవంటే ఎర్రసైన్యంపై దాడులను ఆపివేయాలి. ప్రజల ప్రజాతంత్రహక్కులను రక్షించాలి. ప్రజలను సాయుధంజేయాలి; యిలాచేస్తే తనకు వ్యతిరేకంగా పోరాడుతున్న దేశంలోని అన్నిసైన్యాలకు వ్యతిరేకమైనపోరాటాన్ని ఆపివేయుటకు, సంధిజేసుకొనుటకు, జపానుదురాక్రమణను ప్రతిఘటించుటకై చేతులు కలుపుటకు తాను సిద్ధంగావున్నానని ఎర్రసైన్యం ప్రకటించింది.

కాని, యిదంతా యిలా చేసినప్పటికి 1931-1934 సంవత్సరాల మధ్యకాలంలో పార్టీనాయకత్వం తీవ్రమైన, అతివాదమైన "కొత్త తప్పిదాలను జేసింది. తత్ఫలితంగా ఎర్రసైన్య విజయాలచే సృష్టింపబడిన అనుకూలపరిస్థితులలో జపాను వ్యతిరేక, చియాంగ్ వ్యతిరేక ప్రజాపోరాటం వుద్గమవుతున్న అనుకూల పరిస్థితులలో విప్లవం పురోగమించుటకు బదులుగా కొత్త అపజయాలను పొందింది."

ప్రథమ విప్లవాత్మక అంతర్యుద్ధ యొక్క పరాజయం నేర్పిన గుణపాఠాలున్నప్పటికి, దాని తర్వాత సంభవించిన సంఘటనలు కొన్ని గుణపాఠాలను నేర్పినప్పటికి ఆరవపార్టీ కాంగ్రెసు జరిగినతర్వాతకూడా పార్టీయొక్క నాయకత్వ సంఘాలు, విప్లవప్రతీఘాతుక శక్తులకు కేంద్రమైన షాంఘై నగరంలోనే వుండిపోయాయి. పార్టీ నాయకత్వం యింకనూ తమ దృష్టిని రెడ్ ఆర్మీ యుద్ధతంత్రంపై కేంద్రీకరించ లేదు. కామ్రేడ్ మాసేటూంగ్‌ను తమ కేంద్రంగా చేసుకోలేదు. పెట్టీ - బూర్జువావర్గ దుందుడుకుతనంతో నిండియుండుటచేతనూ, రెడ్ ఆర్మీ యుద్ధతంత్రంయొక్క ప్రాధాన్యతను గుర్తించకపోవుటచేతనూ, రెడ్ ఆర్మీ యుద్ధతంత్ర సూత్రాలను అవగాహన చేసుకొనలేకపోవుటచేతనూ, "వామపక్ష" అవకాశవాదులు విప్లవ ప్రతీఘాతుక భయంకర పరిపాలన పరిస్థితుల క్రింద నగరాలలో తిరుగుబాట్లను సంఘటితపరచగలమనే భ్రమలలోనున్న "వామపక్ష" అవకాశవాదులు పార్టీ కేంద్ర సంఘాలలోని నాయకత్వస్థానాలలో వుండసాగేరు.

1930 జూన్ నుండి అక్టోబరువరకూ పార్టీ కేంద్రకమిటీ కామ్రేడ్ లీలీసాన్ నాయకత్వాన ప్రధాననగరాలలో తిరుగుబాట్లను సాగించాలనీ, ప్రధాననగరాలపై ఎర్రసైన్యాలన్నీ విజృంభణయుద్ధాన్ని సాగించాలనీ, డిమాండు జేయసాగింది. ఈ తప్పుడుప్లానువలన కొమింటాంగ్ ఆధీనప్రాంతాలలో, ప్రచ్ఛన్నజీవితాన్ని గడుపుచున్న పార్టీసంఘాలకు తీవ్రమైన నష్టాలు వాటిల్లినాయ్; కాని కామ్రేడ్ మాసేటూంగ్ గట్టిగా పైప్లానును వ్యతిరేకించిన తావులలో ఎర్రసైన్యంపై

గూండుగూరుపంథా ఎక్కువ ప్రభావాన్ని వేయలేకపోయింది. 1930 అక్టోబరుమాసంలో ఆరవపార్టీ కాంగ్రెసుచే ఎన్నుకోబడిన కేంద్రకమిటీ మూడవ విస్తృతసమావేశంలో కామ్రేడ్ లీలీసాన్ యొక్క పొరపాట్లు సరిదిద్దబడ్డాయ్. ఏమైనప్పటికినీ 1931 జనవరిమాసంలో కామ్రేడ్స్ వాంగ్ మింగ్ (చెన్ షావోయూ), పో-కూ (చిన్-పాంగ్-హిసియన్) నాయకత్వాన మరియొక నూతన "వామపక్ష" ముఠా ఉద్భవించింది. ఈ "వామపక్ష" ముఠా సైద్ధాంతికతత్వ (పిడివాదం) స్వభావాన్ని కలిగియున్న యీ ముఠా, మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాల ముసుగువేసుకొని "వామపక్ష" వేదికనుండి మూడవ విస్తృతసమావేశాన్ని దుయ్యబట్టసాగింది. ఈముఠా మెంబర్ల అభిప్రాయులేనంటే, కామ్రేడ్ లీలీసాన్ చేసిన ప్రధానమైనతప్పిదం, ఆ సమయంలో చైనాకమ్యూనిస్టు పార్టీలోనున్న ప్రధానప్రమాదం, మితవాదపెడమార్గాలేగాని, "అతివాద" పెడమార్గాలుగాదని, "లీలీసాన్ పంథా క్రమంగా అనుసరించిన మితవాద-అవకాశవాదసిద్ధాంతాన్ని ఆచరణను బట్టబయలుచేయలేదనీ, దుయ్యబట్టలేదనీ" మూడవవిస్తృత సమావేశాన్ని యీముఠావారు దుయ్యబట్టసాగారు. చిట్టచివరకు యీ ముఠావారు, ఆరవపార్టీకాంగ్రెసుచే ఎన్నుకోబడిన కేంద్రకమిటీయొక్క నాల్గవవిస్తృత సమావేశంలో, కేంద్రసంఘాలలోని నాయకత్వ హోదాలను పొందారు వాంగ్ మింగ్, పోకూల నాయకత్వాన నడుస్తున్న యీ నూతన "వామపక్ష" ముఠా, చైనా దేశీయ రాజకీయపరిస్థితులలో జపానుసామ్రాజ్యవాదులదురాక్రమణగానివచ్చినమార్పులనుగుర్తించ పూర్తిగా

నిరాకరించారు. కొమింటాంగ్ పార్టీలోనున్న వివిధ ముఠాలను, మధ్యస్థ గ్రూపులను, కొమింగ్‌టాంగ్ నాయకులతో సమానంగా విప్లవ ప్రతీఘాతుకమైనవిగా వాదించజొచ్చారు. అందువలన, ఎలాంటిభేదాలనూ పాటించకుండా వారందరికీ వ్యతిరేకంగా, పార్టీ జీవన్మరణపోరాటాన్ని నడుపాలని డిమాండుచేసారు.

ఇక, రెడ్ ఆర్మీయుద్ధతంత్రానికి సంబంధించిన సమస్యలో, యీ "వామపక్ష" ముఠావారు, గెరిల్లాయుద్ధ తంత్రం, చంచలమానయుద్ధ (మొబైల్ వార్‌ఫేర్) తంత్రాలను సంబంధించిన కామ్రేడ్ మావోసీటూంగ్ భావాలను వ్యతిరేకించారు. ఎర్రసైన్యం; ప్రధాననగరాలన్నింటినీ పట్టుకోవాలని పలుమార్లు డిమాండు చేయసాగారు. ఇక, కొమి టాంగ్ ఆధీనములోనున్న నగరాలలో పార్టీ పనివిషయం తీసుకుంటే, కామ్రేడ్ లీషావ్‌చీ, పార్టీబహిరంగ అవకాశాలన్నింటినీ వినియోగించుకోవాలనీ, విప్లవబలాన్ని చేకూర్చుకోవాలనీ, గట్టిగా వాదిస్తూవుంటే, దానికి వ్యతిరేకంగా, యీముఠావారు అలాచేయరాదని వాదించసాగారు. అంతేగాక, సాహసిక విధానాలను సాగించజొచ్చారు. తత్ఫలితంగా వీరు, అత్యధిక ప్రజానీకంనుండి వేరైపోయారు. ఈ తప్పుడు నాయకత్వంక్రింద కొమింటాంగ్ ఆధీనప్రాంతాలలోని పార్టీసంఘాలన్నీ నాశనమయ్యాయి. "వామపక్ష" శక్తులచే రూపొందించబడిన తాత్కాలిక కేంద్రనాయకత్వసంఘాల శాఖలన్నీ, 1933 సంవత్సరములో కేంద్రరెడార్మీ స్థావరాలకు మార్చబడ్డాయి. రెడార్మీస్థావరాలకు వచ్చివేసిన తర్వాత, తాత్కాలిక కేంద్ర నాయకత్వసంఘాలు, కేంద్రకమిటీసభ్యులతో కలిసాయి.

అంటే, రెడార్మీలోనూ, విప్లవాత్మక స్థావరాగలోనూ పని చేస్తూవున్న కామ్రేడ్ మాసేటుంగ్, యితర కామ్రేడ్సును కలుసు న్నారు. అటుతర్వాత, నియమానుసారంగా యేర్ప రచబడిన, అధికారిక (అఫీషియల్) కేంద్రనాయకత్వసం ఘాలుగా తయారయ్యాయి. కాని యివి, కామ్రేడ్ మాసీటుంగ్ నాయకత్వాన్ని, అందులో ప్రత్యేకంగా, ఎర్రసైన్యంపై అతని నాయకత్వాన్ని తొలగించాయి. ఆ విధంగా, ఎర్రసైన్య విజయాలచే ప్రదర్శించబడిన విప్లవం యొక్క పునరుద్ధారణ, కొమింటాంగ్ ఆధీనంలోనున్న ప్రాంతాలలోని ప్రజావుద్యమ విజృంభణాలు, బలహీనపరచ బడ్డాయి.

1932 జూన్ నుండి 1933 ఫిబ్రవరి నూసంవరకూగల కాలంలో షాంఘైనగరంలో ప్రతిఘటనయుద్ధాన్ని, జపాను సామ్రాజ్యవాదులకు అమ్మివేసినతర్వాత, చియాంగ్ వెంటనే చైనా కార్మిక, కర్షక ఎర్రసైన్యాన్ని నాశనం చేయాలన్న తలంపుతో, ఐదు లక్షలమంది సైనికులతో కూడిన 90 డివిజన్ల సైన్యముతో, నాల్గవ పరిపూర్ణ చక్రబంధయుద్ధాన్ని, ఎర్ర సైన్యంపై ప్రారంభించాడు. కామ్రేడ్ మాసీటుంగ్, వ్యూహరచనావిధానాలచే నడుపబడిన ఎర్రసైన్యం, చియాంగ్ సైన్యాలపై చక్రబంధాన్ని ప్రయోగించుటద్వారా ఘనవిజ యాలను సాధించింది. కాని, మరల, 1933 అక్టోబరులో, ఎర్రసైన్యానికి వ్యతిరేకంగా ఐదవచక్రబంధ దండయాత్రను ప్రారంభించేడు. ఈసారిపదిలక్షలసైన్యాన్ని తీసుకొనివచ్చాడు. అందులో ఐదులక్షలసైన్యాన్ని, కేంద్రఎర్రసైన్యాన్ని ముట్ట

డించాటకై వినియోగించారు. ఈ పాదయాత్రలో శత్రువు యొక్క చక్రబంధాన్ని ఎర్రసైన్యం భగ్నంగావించలేక పోయింది. పార్టీ కేంద్రనాయకత్వసంఘాలు పూర్తిగా ఆత్మ రక్షణ విధానము అవలంభించాలని, పూర్తిగా తప్పుడు సైనికపంధాను అవలంబించటం, అంతేగాక తదితర తప్పుడు విధానాలను అమలుజరుపటం అనేవే ఈ భంగపాటుకు కారణాలు.

1934 అక్టోబరులో కేంద్రఎర్రసైన్యం, కియాంగ్సీ రాష్ట్రంలోని స్థావరాలనుండి తన సైనికులను వెనుకకు పిలిచింది; ప్రపంచచరిత్రలో అద్వితీయమైన దీర్ఘయాత్రను ప్రారంభించింది. ఈ సమయంలో "వామపక్ష"శక్తుల హస్తాలలో దేశమంతటిలోని యితరవిప్లవస్థావరాలు, ఎర్రసైన్యశక్తులు, పైనుదహరించబడిన నష్టాలలాంటివాటినే పొందాయి. ఉత్తర షెన్సీరాష్ట్రంలో కామ్రేడ్స్ లియూసేతాన్, కావోకాంగ్, తదితరులు నాయకత్వ క్రిందనున్న ఎర్రసైన్యయూనిట్లకు, మినహాయిస్తే, వివిధప్రదేశాలలోనున్న ఎర్రసైన్యం యూనిట్లు ఒకటితర్వాత మరియొకటిగా తమ మూలస్థావరాలను విడచి, దీర్ఘయాత్రలో వచ్చిచేరాయి.

కేంద్ర ఎర్రసైన్యంయొక్క దీర్ఘయాత్రలో, పార్టీ కేంద్రనాయకత్వ సంఘాలు, సైనికతంత్ర తప్పిదాలను చేయసాగాయి. దీనివలన అనేకసార్లు ఎర్రసైన్యం ప్రమాదకరమైనపరిస్థితులకు గురికావలసివచ్చింది. అంతేగాక, ఎర్రసైన్యం యొక్క ముందుమార్గాన్ని శత్రువు అడ్డగించటం, వెనుకనుండి పైనబడటం, దానిమూలమున ఎర్రసైన్యం అధికనష్టాలకు

గురికావటం సంభవించింది. చిక్కులలోపడిన ఎర్రసైన్యాన్ని రక్షించుటకు, చైనావిప్లవ ఆశయాల్ని రక్షించుటకు, కామ్రేడ్ మాసీటూంగు, మరియు యితర కామ్రేడ్సు కలసి, గట్టిగా పోరాడి, 1935 జనవరి మాసంలో, క్వీచౌ రాష్ట్రంలో, త్సునయీ అనే ప్రదేశంవద్ద పార్టీ కేంద్రకమిటీ పొలిటికల్ బూరో (రాజకీయసంఘం) విస్తృత సమావేశాన్ని జరిపేటట్లుగా యేర్పాట్లు చేసారు. సమస్యలనుగురించి కామ్రేడ్సు చాలా మంది అర్థం చేసుకున్నారు. వారి సపోర్టుతో, త్సునయ్ కాన్ఫరెన్సు, పార్టీ నాయకత్వంనుండి "వామపక్ష" శక్తులను తొలగించింది. కేంద్రసంఘంలోనూ, యావత్తుపార్టీలోనూ, కామ్రేడ్ మాసీటూంగునకు ప్రధానస్థానాన్ని యిచ్చింది. అప్పటినుండి, చైనా కమ్యూనిస్టుపార్టీ, చైనా విప్లవమూ, విడవకుండా, పరిపూర్ణంగా విశ్వసనీయుడైన మహావ్యక్తియైన, కామ్రేడ్ మాసీటూంగ్ యొక్క మార్క్సిస్టు - లెనినిస్టు నాయకత్వంక్రింద నడుస్తూ వచ్చాయి. విప్లవవిజయానికి అత్యంత ప్రధానమైన హామీ యిది.

అసంఖ్యాకమైన సైనిక, రాజకీయకష్టాలను, వాటితో పాటు, ప్రాకృతికమైన అవరోధాలను అధిగమించి, అసామాన్యమైన పట్టుదలతో, 25000 "లీ"ల (8000 మైళ్ళు) దీర్ఘయాత్రను, పూర్తిచేసిన తర్వాత, దుర్గమమైన మంచుకొండలను దాటి, స్టెప్పీలను (చిట్టడవులను) దాటి, దీర్ఘయాత్రను సాగించిన ఒక సంవత్సరం తర్వాత, 1935 అక్టోబరులో, కేంద్ర ఎర్రసైన్యం, ఉత్తర షెన్సీ ప్రాంతాన్ని చేరుకొని, వుత్తరషెన్సీ రాష్ట్రంలోనున్న ఎర్రసైన్యం యొక్క యూనిట్లతో చేతులు

కలిపింది. కా మేడ్స్ జెన్‌పీషి, హోలంగ్ నాయకత్వానవున్న ఎర్రసైన్య యూనిట్లు కా మేడ్ హిసూ-హిషి-యాంగ్ చియున్ నాయకత్వానవున్న ఎర్రసైన్య యూనిట్లు 936 అక్టోబరు మాసంలో, షెన్సీ-కాన్సూ యేరియాలో, కేంద్ర ఎర్రసైన్యంతో చేతులు కలిపినాయి, కామ్రేడ్ హిసూ - హిసియాంగ్ - చియున్ నాయకత్వం క్రిందనున్న ఎర్రసైన్యంలో పనిజేస్తూవచ్చిన చాంగ్ కువో - తావోకు విప్లవంయొక్క భవిష్యత్తులో విశ్వాసంపోయి, అతడు పార్టిలో చీలికలు గొనివచ్చే కార్యకలాపాలలో పార్టీకి ద్రోహం చేసే కార్యాకలాపాలలో దిగబడ్డాడు. కేంద్ర ఎర్రసైన్యంతో పాటు, నైరుతి షేజువాన్ రాష్ట్రంనుండి వుత్తరదిశగా పయనించ నిరాకరించి, కొన్ని సైనికదళాలను వత్తిడిచేసి, సికియాంగ్ రాష్ట్రంలోనికి వాటిని తిరోగమింపజేసి, అశాస్త్రీయంగా, మరియొక కేంద్ర నాయకత్వ సంఘాన్ని సృష్టించాడు, కామ్రేడ్ మూసీయూంగ్ అవలంభించినపార్టి - ఆంతరంగిక - పోరాట సవ్యవిధానానికి అభివందనాలు. పార్టినిలబెట్టుటకై కామ్రేడ్స ఘూంటే, జెన్‌పీషి, హోలంగ్, కువాన్ హిసియాంగ్ - యింగ్, తదితరులు చేసినకృషికి ధన్యవాదాలు; పై కామ్రేడ్సు అందరి కృషిఫలితంగా, అవలంబించిన సవ్యవిధానాల ఫలితంగా పార్టీద్రోహి చాంగ్-కువో - తావో కుట్రలన్నీ త్వరితంగా, పరిపూర్ణంగా భగ్నమయ్యాయి; కాని, వీరి కుట్రలమూలకంగా ఎర్రసైన్యం నష్టాలపాలు కాకుండా వుండలేదు, కొమింటాంగ్ తిన ఐదవ చక్రబంధయుద్ధాన్ని ప్రారంభించుటకు పూర్వం, ఎర్రసైన్యంయొక్క సైనికబలం మూడు లక్షలకు

జేరుకుంది; పార్టీలోని తప్పుడు నాయకత్వం అవలంబించిన తప్పుడువిధానాల ఫలితంగా కలిగిన అపజయాలమూలంగా, దీర్ఘయాత్రను పూర్తిచేసి ఉత్తర షెన్సీ రాష్ట్రం చేరుకునే సరికి, ఎర్రసైన్యంయొక్క సైనికబలం ముప్ఫువేలకు దిగి పోయింది. ఈ సైనికులు, ఎర్రసైన్యం పార్టీల అమూల్య రత్నాలు.

చైనా కార్మిక, కర్షక ఎర్రసైన్యంయొక్క విజయవంత మైన దీర్ఘయాత్ర. చైనా విప్లవ పురోగమనాన్ని ప్రమాద పరిస్థితినుండి భద్రతవైపునకు మరలించింది, విప్లవంయొక్క భవిష్యత్తుపట్లనూ, జపాను వ్యతిరేక జాతీయవిముక్తి ఉద్యమం యొక్క భవిష్యత్తుపట్లనూ, చైనాప్రజలకు ఆశాజ్యోతిని వెలిగించింది చైనా కమ్యూనిస్టుపార్టీ, చైనా ఎర్రసైన్యాల బలం అజేయమని, చైనాదేశాన్ని యావత్ప్రపంచాన్ని ఒప్పించింది. చైనాదేశాన్ని మింగాలనే దురాశతోనున్న జపాను సామ్రాజ్యవాదులను నోడించాలంటే చైనాదేశం చైనా కమ్యూనిస్టుపార్టీపై ఆధారపడాలనీ, కమ్యూనిస్టులకు వ్యతి రేకంగా జరుగుతున్న అంతర్యుద్ధాన్ని అంతమొందించి తీరాలనీ, ధృవపరిచింది.

1935, నవంబరులో సైన్యాలు వచ్చి జేరినవెంటనే కేంద్ర ఎర్రసైన్యమూ, ఉత్తర షెన్సీరాష్ట్రంలోనున్న ఎర్ర సైన్యదళాలు, హూపే, హోనాన్ ఆన్హ్వాయ్ రాష్ట్రాలనుండి ఉత్తరదిశగా పయనించిన ఎర్రసైనిక దళాలూ కలిసి ఉత్తర షెన్సీరాష్ట్రంలోనున్న విప్లవాత్మక స్థావరాలకు వ్యతిరేకంగా కొమింటాంగ్ సేనలు సాగించిన మూడవ చక్రబంధ దండ

యాత్రను భిన్నం గావించాయి. ఆవిధంగా యీ విప్లవస్థావరాలు, మహోదాత్తంగా దృఢతరం జేయబడ్డాయ్. ఎర్ర సైన్య యొక్క గౌరవం పెరిగింది. అటుతర్వాత జపాను సామ్రాజ్యవాదులు ఉత్తరచైనాపై మరింతగా దాడులు జేసారు. దీనికి వ్యతిరేకంగా 1935 డిసెంబరు 9 తారీఖున పెకింగ్ నగరంలో విద్యార్థులు "చైనాను రక్షించండి! జపాను సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించండి!" అన్న ప్రదర్శనాన్ని జేసేరు. ఇదే "డిసెంబరు తొమ్మిది వుద్యమం." ఈ ఉద్యమం దేశమంతటకీ వ్యాప్తమయ్యింది. చైనా కమ్యూనిస్టుపార్టీ సూచించిన విధంగా యీ వుద్యమంలో అసంఖ్యాక ప్రజానీకం "అంతర్యుద్ధాన్ని ఆపండి! జపానును ప్రతిఘటించటానికి ఐక్యమవ్వండి!" అని నినాదించారు. విప్లవసముద్రం మరల పొంగసాగింది. ఈకాలంలో చైనాలో జపాను దురాక్రమణ సాగినది లగాయతు చైనా ఆంతరంగిక పరిస్థితిని గురించి సక్రమంగా అంచనా వేయవలసిన గురుతర కర్తవ్యం - సత్వర కర్తవ్యం పార్టీపై వుంది; అంతేగాక పార్టీ తన పాలసీని నిర్ణయించుకోవాల్సివుంది; అంతేగాక పార్టీలోనున్న "వామపక్ష", "కవాటబంధకత్వం" లాంటి ధోరణులను సరిదిద్దుకోవాల్సివుంది. ఈ కార్యక్రమాన్ని 1931 34 మధ్య కాలంలో, పార్టీ కేంద్రనాయకత్వసంఘాలు పూర్తి జేయజాలక పోయాయి. 1935 సంవత్సరంలో కామ్రేడ్ మాసీయాంగ్ దీర్ఘయాత్రలో పూర్తి జేయజాలకపోయాడు. కమ్యూనిస్టు అంతర్జాతీయసంస్థ ఈ అవసరాన్ని పూర్తిజేసింది; అంటే ఫాసిజానికి వ్యతిరేకంగా సంయుక్తసంఘటన యన్న నవ్య

విధానాన్ని కమ్యూనిస్టు అంతర్జాతీయసంస్థ ప్రకటించుట ద్వారా, పైనచెప్పబడిన అవసరం పూర్తి జేయబడింది. 1935, ఆగష్టు 15 తారీఖున చైనాకమ్యూనిస్టుపార్టీ విశాల సంయుక్తసంఘటనకు పిలుపునిచ్చింది. డిసెంబరు 25 తారీఖున పార్టీకేంద్రకమిటీయొక్క పొలిటికల్ బ్యూరో, ఆనాటి రాజకీయపరిస్థితులపైననూ, పార్టీకర్తవ్యాలపైననూ తీర్మానాలు చేసింది. డిసెంబరు 27 తారీఖున పార్టీకార్యకర్తల సమావేశంలో కామ్రేడ్ మాసేటూంగ్, జపానుసామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా అవలంబించవలసినపోరాటవిధానంపై వుపన్యసించాడు.

కామ్రేడ్ మాసేటూంగ్ తన వుపన్యాసంలో జపాను సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడుటకై జాతీయ సంయుక్తసంఘటన సమస్యనుగురించి క్రమబద్ధంగావివరించాడు. జపానుసామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటంలో జాతీయ బూర్జువా వర్గంలోని వామపక్షం కలసివచ్చుటకు అవకాశాలుగలవనీ, మిగిలిన జాతీయబూర్జువావర్గం వూగిసలాటనుండి తటస్థవిధానానికిపోయే అవకాశాలు గలవనీ, కొమింటాంగులో చీలికలు వచ్చే అవకాశాలు గలవనీ, కొమింటాంగులోని ఆంగ్లో-అమెరికను అనుకూలదళారీవర్గాలు, కొన్ని నిర్ణీతపరిస్థితులలో తప్పనిసరిగా జపాను వ్యతిరేకపోరాటంలో పాల్గొనవచ్చుననీ వివరించాడు. దీర్ఘయాత్రయొక్క ప్రాముఖ్యాన్ని గురించి వివరించిన తర్వాత, కామ్రేడ్ మాసియూంగ్ పార్టీయొక్క కర్తవ్యాలను గురించి, యీ క్రిందివిధంగా సంక్షిప్తరూపంలో చెప్పేడు:

"పార్టీ ముందున్న కర్తవ్యాలేమంటే, ఎర్రసైన్యం యొక్క కార్యకలాపాలను, కార్మికులు, కర్షకులు, విద్యార్థులు, పెట్టీ-బూర్జువావర్గం యీ దేశం యొక్క జాతీయ బూర్జువా వర్గాల కార్యకలాపాలతో సమ్మేళన మొనరించటం, యీ సమ్మేళనను సంయుక్త జాతీయ విప్లవాత్మక సంఘటనగా రూపొందించటం అనేవి."

సంయుక్త సంఘటనకు వ్యతిరేకంగా, పార్టీలోని "వామపక్ష" శక్తులు చేసే వాదాలన్నింటినీ, కామ్రేడ్ మాసీ యాంగ్ ఖండించేడు. కార్మిక, కర్షకుల రిపబ్లికుకు బదులుగా కామ్రేడ్ మాసీయూంగ్ ప్రజారిపబ్లికును స్థాపించాలన్న నినాదాన్ని యిచ్చేరు. జాతీయ బూర్జువావర్గంపట్ల రాజకీయం గానూ, ఆర్థికంగానూ వహించవలసిన సరియైన పంథాను యేర్పరచాడు. బూర్జువా ప్రజాతంత్ర విప్లవకాలంలో, ప్రజారిపబ్లికు, సామ్రాజ్యవాదులను, వారి బంట్లను సపోర్టు చేయని జాతీయ బూర్జువావర్గం వారినందరినీ రక్షించ గలదనీ, వారి పరిశ్రమలను, వ్యాపారాన్నికూడా రక్షించగల దనీ, అంతేగాక, కార్మిక, కర్షకులను పునాదిగాగలిగిన ప్రజా రిపబ్లికు, సామ్రాజ్యవాదాన్ని, జమీందారీ విధానాన్ని వ్యతి రేకించినట్టి అన్నివర్గాల ప్రజల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తుందని కామ్రేడ్ మాసీయూంగ్ వివరించేడు.

"1924 నుండి 1927 వరకూగల కాలంలోని జాతీయ సంయుక్త సంఘటనకు, ప్రస్తుత కాలంలోని జాతీయ సంయుక్తసంఘటనకుగల వ్యత్యాసమేమంటే యీ జాతీయ సంయుక్తసంఘటనలో, సుదీర్ఘాత్మకమైన శక్తిమంతమైన

కమ్యూనిస్టుపార్టి విప్లవసైన్యాలూ, పాల్గొంటున్నాయి. అని రెండుకాలాల జాతీయసంయుక్త సంఘటనలకు గల వ్యత్యాసాన్ని కామ్రేడ్ మావోసీయాంగ్ ఎత్తి జూపాడు. ఈ రెండు కాలాలకు గలభేదాన్ని పోల్చిచెపుతూ, కామ్రేడ్ మావోసీయాంగ్ యిలా చెప్పాడు.

"ఈనాడు పరిస్థితి మారింది. ఈనాడు, సుదీర్ఘాత్మక మైన శక్తిమంతమైన కమ్యూనిస్టుపార్టి, బలోపేతమైన ఎర్రసైన్యా లుండుటయేగాక, ఎర్రసైన్యానికి విప్లవస్థావరాలు కూడా వున్నాయి. ఇవి, జపాను వ్యతిరేక జాతీయసంయుక్త సంఘటనకు ప్రోత్సాహకులేగాక భవిష్యత్తులో యేర్పడనున్న జపాను వ్యతిరేక ప్రభుత్వాం సైన్యాలకు పూతమిచ్చే గట్టి స్తంభాలుగా కూడా వుండగలవు. ఆవిధంగా అవి, జపాను సామ్రాజ్యవాదుల కుట్రనూ, జాతీయసంయుక్తసంఘటనను విచ్ఛిన్నం చేయుటకు, మనలో అపజయతత్వాన్ని వ్యాపింప చేయుటకు, చియాంగు - కైషేక్ చేసే కుట్రలను, భగ్నము గావించగలవు."

ఆవిధంగా, కామ్రేడ్ మావోసీయాంగ్ యిచ్చిన వుపన్యాసం, ఆనాటి పార్టిపాలసీని నిర్వచించుటయేగాక, చైనారాజకీయ పరిస్థితియొక్క భవిష్యాభివృద్ధిని గురించి ముందుగా చెప్పటయేగాక రెండు విప్లవకాలాల ప్రాథమికానుభవాలను సంక్షిప్తంజేసి చెప్పింది. ప్రజాతంత్ర విప్లవంలో పార్టీయొక్క ప్రధానపంథాను వర్ణించింది.

చైనా కమ్యూనిస్టుపార్టీ అనుసరించిన సవ్యమైన రాజకీయపంథావలన సత్వరంగా గొప్ప ఫలితాలు యేర్పడ్డాయ్

జపాను దురాక్రమణకు వ్యతిరేకంగా ప్రతిఘటనయుద్ధం త్వరగా ప్రారంభమయ్యింది. 1936 ఫిబ్రవరి మాసంలో షేన్సీ రాష్ట్రంలోనికి తూర్పుదిశగా పురోగమిస్తూ ఎర్రసైన్యం అనేక విజయాలను చూరగొన్నది. విజయాలను చూరగొన్న ఎర్రసైన్యం మేనెలలో విరోధాలను కట్టిపెట్టి శాంతిరాయ బారాలకు రావలసినదిగానూ, జపాను సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా కలసి పోరాడుటకై కలసి రావలసిందిగాను, కొమింటాంగ్‌కు బహిరంగసూచనలు జేసింది. ప్రప్రథమంగా ఎర్రసైన్యం షేన్సీరాష్ట్రంలోని చాంగ్ - సూహే-లియాంగ్, యాంగ్‌హూఛెంగ్ మరియు తదితరులతో సంధిచేసుకొంది. కొమింటాంగ్ పాలిత ప్రాంతాలలో క్రామేడ్ లీషావ్‌చీ యొక్క సవ్యనాయకత్వాన పార్టీపని మరియు జపానుకు వ్యతిరేకంగా అన్నివర్గాల ప్రజలచే సాగింపబడుచున్న జాతీయ విముక్తి ఉద్యమాలు అదేవిధంగా తమపనిని ప్రారంభించాయి. దేశమంతటా వ్యాప్తమవుతున్నాయ్. కాని చియాంగ్ మాత్రం చైనా కమ్యూనిస్టుపార్టీని, చైనా ప్రజలను వ్యతిరేకించే కార్యక్రమాన్ని వదలుకోలేదు. ఎర్రసైన్యంమీద తన దాడులను సాగించుతూనే వున్నాడు. 1936 డిసెంబరు 12 వ తారీఖున చైనా కమ్యూనిస్టుపార్టీతో ఐక్యతను సాధించాలని డిమాండు చేస్తున్న చాంగ్-సూహే - లియాంగ్, యాంగ్ హూ ఛెంగులు చియాంగ్‌ను సియాన్‌లో ఖైదీ చేసి, జాతిని నాశనంచేస్తున్న కమ్యూనిస్టు వ్యతిరేక అంతర్యుద్ధాన్ని అంత మొందించవలసినదిగా అతణ్ణి వత్తిడి జేసేరు. ఇలాంటి పరిస్థితిలో జపాను సామ్రాజ్యవాదుల దురాక్రమణను అరికట్టుటకు

సియాన్ సంఘటనను శాంతియుతంగా పరిష్కరించటం అవసరమని చైనా కమ్యూనిస్టుపార్టీ భావించింది. అందువలన, ఛియాంగ్ విడుదల చేయబడ్డాడు. ఆంతరంగిక శాంతి సాధించబడింది.

సియాన్ సంఘటనను శాంతియుతంగా పరిష్కరించిన తర్వాత, ఆంతరంగిక శాంతిని కాపాడుటకై సహాయపడుటకు, జపాను సామ్రాజ్యవాదాన్ని సంయుక్తంగా ప్రతిఘటించుటలో భూస్వామికవర్గాన్ని కూడా కలుపుకొని వచ్చుటకు, భూస్వాముల భూమిని లాక్కొని, పంచిపెట్టే విధానాన్ని తాత్కాలికంగా ఆపుటకు చైనా కమ్యూనిస్టు పార్టీ నిశ్చయించింది. ఆంతరంగిక శాంతి సాధింపబడినందుకు ధన్యవాదాలు. 1937, జులై 7వ తారీఖున, లుకొచియావో (మార్కోపోలో బ్రిడ్జి) సంఘటనను, చైనాపై నూతనదాడిని ప్రారంభించుటకై జపాను సామ్రాజ్యవాదులు సాకుగా తీసుకొన్నప్పుడు, చైనా సైన్యాలు, చియాంగ్ సైన్యంతో సహా, జపాను దురాక్రమణను ప్రతిఘటించాయి; జాతీయ ప్రతిఘటన యుద్ధం ప్రారంభమయ్యింది. సియాన్ సంఘటనలోనూ, దాని తర్వాతకాలంలోనూ చైనా కమ్యూనిస్టుపార్టీ అవలంబించిన సరియైన దృక్పథాలు, కార్యక్రమాల ఫలితంగా, సాధించబడిన ఆంతరంగిక శాంతి, ప్రతిఘటన యుద్ధాలు, దేశమంతటిలో అసంఖ్యాక ప్రజానీకంలో, చైనా కమ్యూనిస్టు పార్టీయొక్క ప్రతిష్ఠ ఘనంగా పెరిగింది.

1937 మే నెలలో, కేంద్రకమిటీ, పార్టీ కాన్ఫరెన్సును జరిపింది; దానిలో 1935 నుండి పార్టీ అనుసరించిన

రాజకీయ పంథాను చర్చించి, బలపరచింది; ప్రతిఘటన యుద్ధాన్ని నడుపుటకై రాజకీయ నిర్మాణాత్మక యత్నాలను జేసింది.

విప్లవం, ప్రమాదపరిస్థితులనుండి బయటపడి నూతన దశను జేరుకుటున్న సంవత్సరాలలో, కామ్రేడ్ మావోసేటూంగ్ అనుభవాలసారాంశమును తెల్పుటకు కార్యకర్తలను తర్ఫీదుచేయుటకు సైద్ధాంతికరచనలను సాగించేడు. 1936 శరత్కాలంలో "చైనావిప్లవయుద్ధాల వ్యూహాత్మక సమస్యలు" అన్న పుస్తకాన్ని కామ్రేడ్ మావోసేటూంగ్ వ్రాసేడు. యీ పుస్తకంలో 1927 – 1936 సంవత్సరాల మధ్య జరిగిన విప్లవాత్మకయుద్ధాల అనుభవాల సారాంశాన్ని చక్కగా ఎత్తిచూపాడు; అంతేగాక, చైనావిప్లవాత్మక యుద్ధాల స్వభావాలను చక్కగా వివరించాడు; మితవాదుల, అతివాదుల సైనికపంథాల పొరపాట్లను క్రమబద్ధంగా విమర్శించేడు. సైనికశాస్త్రంపై ప్రపంచకమ్యూనిస్టు ఉద్యమం యొక్క అత్యుత్తమ, అత్యద్భుతమైన మార్క్సిస్టుగ్రంథాలలో ఇదిఒకటి. అంతేగాక, యీ పుస్తకం అత్యంతప్రధానమయిన రాజకీయ తాత్విక గ్రంథం; ఎందువల్లనంటే ఇది మొత్తంమీద చైనావిప్లవంయొక్క సూత్రాలనూ, యుద్ధంలో జయాపజయకారణాలకు సంబంధించిన సూత్రాలనూ, యుద్ధసూత్రాలను,యుద్ధసూత్రాలను అర్థంచేసుకునేక్రమాన్ని గాఢంగా వివరించి చెప్పింది.

1937 వేసవిలో "ఆచరణ" అనే ప్రఖ్యాత తాత్విక గ్రంథాన్ని, కామ్రేడ్ మావోసేటూంగ్ రచించాడు. యీపుస్త

కంలో కా|మేడ్ మాసేటుంగ్ మార్క్సిస్టు-లెనినిస్టు జ్ఞాన సిద్ధాంతాన్ని చక్కగాను, పరిపూర్ణంగానూ, అందరికి అర్థమయ్యేలాగున వ్రాశాడు. యీ పుస్తకం చైనాసిద్ధాంత చరిత్రలోనూ, పార్టీ సైద్ధాంతిక కార్యక్రమంలోనూ, అత్యంత ప్రధానమయింది, అమూల్యమైనదై వున్నది. ప్రజలు సవ్యంగా యెలా ఆలోచించాలో, యెలా పనిచేయాలో, యెలా అధ్యయనంచేయాలో, బోధించుటకు ఇది పాఠ్యగ్రంథం. రెండవ విప్లవాత్మక అంతర్యుద్ధకాలంలోని, పార్టీ ఆంతరంగిక - వివాదాల తాత్వికస్వభావాన్ని వివరించింది; అతివాదుల, మితవాదుల జ్ఞానసిద్ధాంతంలోని పిడివాదపొరపాట్లను, అనుభవవాద పొరపాట్లను, గతతాత్విక భౌతికవాద సూత్రాలద్వారా బట్టబయలు చేసింది. మార్క్సిజం - లెనినిజంతో చైనాకమ్యూనిస్టుపార్టీ అధ్యయనానికి కావలసిన పునాదివేయుటయేకాక, మార్క్సిజం - లెనినిజంయొక్క ప్రపంచ తాత్విక భాండాగారానికి ఒక అమూల్యరత్నాన్ని సమర్పించింది.

రెండవవిప్లవాత్మక అంతర్యుద్ధకాలమంటే అత్యంత క్లిష్టపరిస్థితులలో, చైనాకమ్యూనిస్టుపార్టీ, రాజకీయపరిపక్వతను చేరుకున్న కాలమది; అంతేకాక, విప్లవాన్ని, నూతన సోపానాలకు పురోగమింపజేసిన కాలమది. యీ కాలంలో ప్రధానంగా కా|మేడ్ మాసేటుంగ్ కృషిమూలంగా, మనపార్టీ సైనిక కార్యక్రమం, గ్రామీణకార్యక్రమాల ప్రాధాన్యతను గురించి, గట్టిగా గుర్తించింది. గ్రామీణ ప్రాంతాలలో విప్లవాత్మక సైన్యాన్ని, విప్లవస్థావరాలనూ, సృష్టించింది. విప్లవయుద్ధాన్ని యెలానడపాలో నేర్చుకుంది;

తన ప్రభుత్వాల్లో, భూసంస్కరణవిధానమూ, వివిధ రకాల కార్యక్రమాలనూ, యెలానడపాలో నేర్చుకుంది. యీ కాలంలో, చైనా కమ్యూనిస్టుపార్టీ తనయొదార్థ మార్క్సిస్టు-లెనినిస్టు నాయకుడుగా, కామ్రేడ్ మాసీయూంగును గుర్తించింది. అంతేకాక వివిధరకాల 'అతివాద' పెటీ బూర్జువావర్గ సిద్ధాంతాలవలనకలిగే ప్రమాదాన్ని చెఱప్పనూ గుర్తించింది.

వివిధరకాలపెట్టి బూర్జువావర్గ తప్పుడు సిద్ధాంతాలకు వ్యతిరేకంగా జరిపిన పోరాటాల్లో పార్టీ కామ్రేడ్ మాసీయూంగ్నాయకత్వాన తన నాయకత్వాన్ని. స్థాపించింది. ప్రథమ విప్లవాత్మక అంతర్యుద్ధకాలంలోని కొమింటాంగ్ - కమ్యూనిస్టుల మైత్రికాలంలో, మితవాదతత్వం హానిచేసినట్లుగానే యీ కాలంలో, పార్టీ నాయకత్వంయొక్క ప్రధానతప్పిదం యేమంటే, అతివాద పెడమార్గాలను అనుసరించడం, అతివాద తప్పిదాలవలన పార్టీ ఎర్రసైన్యమూ, తీవ్ర అపజయాలకు గురిఅయింది, తన్మూలంగా విప్లవం నూతన సోపాలకు పురోగమించలేకపోయింది. యేమయినప్పటికి అనేక కఠిన పరీక్షలనుండి బయటపడిన పార్టీ మరియూ సైన్యమూ ఉత్తమ అనుభవాన్ని గడించుకున్నాయి. అంతేగాక ప్రధాన శక్తిగా తయారై ప్రతిఘటన యుద్ధాన్ని మరియూ ప్రజా విముక్తియుద్ధాన్ని నడిపాయి. యీవిషయాలు యిలాఉండగా రెండవవిప్లవాత్మక అంతర్యుద్ధకాలంలోనే యీనాటి చైనా విప్లవ విజయంకొరకై కావలసిన అత్యంత ప్రధానమయిన రాజకీయయత్నాలూ, కార్యకర్తల పెంపకం జరిగాయని చెప్పవచ్చును.

1927 - 1937 మధ్యకాలంలో పార్టీ అత్యంత అభివృద్ధి నిరోధక దశను అధిగమించింది. యీకాలంలో ఒకవైపున శత్రువు మనపార్టీని పూర్తిగా నాశనంచేయుటకు యత్నించాడు. కానీ, శత్రువునకు వ్యతిరేకంగా మనపార్టీ, అత్యంత క్లిష్టమయినా, దృఢమయినా, ధీరోదాత్తమయిన పోరాటాలను నడిపింది. మరియొకవైపున చన్ తూహిస్యూయొక్క మితవాద అవకాశతత్వాన్ని అధిగమించగానే మన పార్టీకి అత్యంత ఘనప్రమాదాన్ని తెచ్చిపెట్టిన "అతివాద" అవకాశవాదాన్ని మన పార్టీ అనేకసార్లు యెదుర్కొనవలసి వచ్చింది. కానీ, కామ్రేడ్ మావోసీయాంగ్ యొక్క సవ్యమయిన సృజనాత్మక, మార్క్సిస్టు అండ్ లెనినిస్టు నాయకత్వంవల్లనూ, అతని సాధారణ, సహనమువల్లనూ, క్రమశిక్షణను అమలుజరడంలో అతడుచూపిన పట్టుదలవల్లనూ, చిట్టచివరకు మనపార్టీ అవకాశవాద, పొరపాట్లను అధిగమించడంలోనూ, సంతుష్టికరమయిన ఫలితాలను సాధించడంలోనూ, అత్యంత ప్రమాదకరమయిన పరిస్థితినుండి తనను తాను బయటపడేసుకోడంలోనూ, అఖండవిజయాన్ని సాధించింది. ఆవిధంగా, అభివృద్ధి నిరోధకకాలమయిన 10 సంవత్సరాలలోనూ, లోపలనుండే బయటనుండే, శత్రువులు ఎన్ని యెదుర్కొన్నప్పటికీ, విప్లవాత్మక తత్వంలో యావద్దేశంలోని అసంఖ్యాక ప్రజానీకానికి శిక్షణ యివ్వగలిగింది. అసంఖ్యాక ప్రజానీకంలో, పార్టీయొక్క విప్లవధ్వజాన్ని నిలపగలిగింది; యర్రసైన్యంయొక్క ప్రధానశక్తినీ, విప్లవ స్థావరాలలో, కొన్నింటని నిలుపుకోన కలిగింది; అనేకమంది

ప్రముఖ కార్యకర్తలను నిలుపుకోగలిగింది. లక్షలాది సభ్యులను, నిలుపుగో కలిగింది. నూతన విప్లవ ప్రవాహాన్ని, అనుగమించుటకు యావజ్జాతీయ దేశభక్తి ప్రతిఘటన యుద్ధాన్ని నడుపుటకు, కొమింటాంగ్ మరియు చైనా కమ్యూనిస్టు పార్టీలమధ్య నూతన సహకారాన్ని, పెంపొందించుకొనుటకు విప్లవాత్మక అనుభవాన్ని అమితంగా అందులో ప్రత్యేకంగా యుద్ధతంత్రానికి, విప్లవస్థావరాలకూ సంబంధించిన విప్లవాత్మక అనుభవాన్ని పోగుజేసుకో గలిగింది.



మూడవ అధ్యాయం

# జపాను దురాక్రమణ : ప్రతిఘటన యుద్ధం

1937 జులై 7 వ తారీఖున లుకౌచియావో వద్దనున్న (పెకింగ్ నగరానికి దక్షిణంగానున్న మార్కోపోలో బ్రిడ్జి) చైనా స్థానిక సైన్యాలను జపాను దురాక్రమణదారులు సైన్యాల ముట్టడించాయ్. ఈ ముట్టడిని స్థానిక సైన్యాలు వీరోచితంగా ప్రతిఘటించాయ్. ఆగష్టు 13 వ తారీఖున జపాను దురాక్రమణ దారుల సైన్యం మరల షాంఘైనగరాన్ని ముట్టడించింది. షాంఘైస్థానిక సైన్యాలు కూడా యీ ముట్టడిని ప్రతిఘటించాయ్. అంతట యావజ్జాతీ, జపాను దురాక్రమణకు వ్యతిరేకమైన ప్రతిఘటన యుద్ధంలోనికి దిగింది. కొమింటాంగ్ ప్రభుత్వంతో వొడంబడికను కుదుర్చుకొన్న తర్వాత, చైనా ఎర్రసైన్యం, దక్షిణచైనాలోని వివిధ రాష్ట్రాలలో అది వుంచిన గెరిల్లా దళాలతో అష్టమ మార్గ సైన్యం, నూతన నాల్గవ సైన్యాలుగా యేర్పరచబడ్డాయ్. ఈ రెండు సైన్యాలు ప్రతిఘటన యుద్ధంలో పాల్గొనుటకు, ఉత్తర చైనా, తూర్పు చైనా రంగాలకు తరలి పోయాయి.

ఆ కాలంలో ప్రతిఘటన యుద్ధానికి సంబంధించిన ప్రధాన రాజకీయ పరిస్థితులు యీ క్రింది విధంగా వున్నాయ్.

ప్రపంచంలో మూడు విభిన్న శక్తులున్నాయి. అవి జపాను, సోవియట్ యూనియన్, బ్రిటన్, మరియు అమెరికా, జపాను సామ్రాజ్యవాదం, భయంకర దురాక్రమణస్వభావాన్ని

కలిగియున్నది. చైనాదేశాన్నియావత్తునూ జయించాలన్న జపాను సామ్రాజ్యవాదులవిధానం, చైనాదేశభక్తులందరి లోనూ ప్రతిఘటనాశ్వేచ్ఛను రేకెత్తించింది. జపాను సామ్రాజ్య వాదులు చైనాపై దండయాత్రసాగుతుండగాక సోవియట్ యూనియన్పై హఠాత్తుదాడి... అనేకసార్లు సోవియెట్ యూనియన్ను రెచ్చగొట్టాగేరు.

బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదశక్తులు సోవియట్ వ్యతిరేక విధానాన్ని అవలంభిస్తున్నారు. ఈ సామ్రాజ్యవాద శక్తులనుండి కొన్నిసౌకర్యాలను పొందుటకై జపాను సామ్రా జ్యవాదులు అలాంటి వైఖరులు అవలంభిస్తూ వుండేవారు. కాని చైనాలో జపాను దురాక్రమణ సాగించిన ఫలితంగా చైనాలో బ్రిటిష్, అమెరికను సామ్రాజ్యవాదుల సామ్రాజ్య వాదప్రయోజనాలు దెబ్బతిన్నాయ్. అంతేగాక వారి సామ్రాజ్య వాద ప్రయోజనాలు యావత్ ఆగ్నేయఆసియాలోనూ, పసిఫిక్ ప్రాంతంలోను ప్రమాదకర పరిస్థితులలోపడ్డాయ్. అందు వలన జపాను, బ్రిటను, అమెరికను సామ్రాజ్యవాదులమధ్య వైరుధ్యాలు అస్థిత్వంలోనికి వచ్చేయ్. ఈ వైరుధ్యాలే 1941 డిశంబరు మాసంలో పసిఫిక్ యుద్ధ ప్రారంభానికి దారితీసి నాయ్. ఈ యుద్ధకాలంలో జపానుప్రజల విప్లవాత్మకశక్తులు, జపాను సామ్రాజ్యవాదులను ఎదిరించి చైనాప్రజలకు తోడ్ప డ్డారు. కాని జపానుప్రజల విప్లవాత్మకశక్తుల బలం చాలినం తగా లేకపోవుటచే వారు జపాను సామ్రాజ్యవాదులను తీవ్ర ముగా ఎదిరించలేకపోయారు.

జపాను సామ్రాజ్యవాదుల దురాక్రమణను ప్రతిఘ

టించుటలో చైనా ప్రజలను బలపరచే విధానాన్ని సోవియట్ యూనియన్ గట్టిగా అవలంబించింది. 1937 ఆగస్టులో చైనా దేశంతో సోవియట్ యూనియన్ నిర్యాక్రమణ సంధిని చేసుకొంది. అంతేగాక, ఆర్థిక సైనికసహాయాన్నికూడా చేసింది. అంతేగాక, "పులులు పోట్లాడుకుంటూవుంటే సురక్షిత స్థానం నుండి చూద్దాం" అని బ్రిటిష్, అమెరికనుసామ్రాజ్యవాదులు పొంచి కూర్చున్నారు; వలలుపన్ని, పొంచి కూర్చున్నారు, సోవియట్ యూనియన్ యీ వుచ్చులనుండి జాగ్రత్తగా తప్పించుకొనుటయేగాక, శాంతియుతవిధానాన్ని అనుసరించింది. 1945, సంవత్సరంలో, హిట్లరు-జర్మనీని వోడించిన వెంటనే, సోవియట్ యూనియన్ యెట్టి ఆలస్యం చేయకుండా, జపానుపై యుద్ధాన్ని ప్రకటించింది. సోవియట్ యూనియన్ అనుసరించినవిధానం పరిపూర్ణంగా సవ్యమని విషయాలు ఋజువు జేసేయ్. ఎందువలనంటే, సోవియట్ యూనియన్ అనుసరించిన విధానంవలన, సోవియట్ ప్రయోజనాలు మాత్రమే కాపాడబడుటయేగాక, చైనా ప్రజల, ప్రపంచప్రజల ప్రయోజనాలతో అది యేకీభవించింది.

ఆ కాలంలో, బ్రిటను, అమెరికను సామ్రాజ్యవాదులకు, వొక్క జపాను సామ్రాజ్యవాదులతోనే అభిప్రాయ భేదాలుండుటయేగాక, వాటి సోవియట్ యూనియన్‌తో కూడా బేధించసాగారు. తూర్పు దేశాలలో తమ ప్రయోజనాలను, జపాను సామ్రాజ్యవాదులు కాజేయటం, బ్రిటిష్ అమెరికను సామ్రాజ్యవాదులకు యిష్టమే, కాని, యుద్ధాన్ని సోవియట్ యూనియన్ వైకి మరల్చి, "పులుల పోట్లాటను

సురక్షిత స్థానంనుండి చూడాలని" బ్రిటిష్, అమెరికను సామ్రాజ్య వాదులు ఆశించారు. ఇది మొదటివిషయం. ఇక రెండవవిషయ మేమంటే, చైనా ప్రజలబలం పెరుగుటవలన, తమ ప్రయోజనాలకు భంగం వాటిల్లగలదని, బ్రిటిష్, అమెరికను సామ్రాజ్య వాదులు భయపడ్డారు. ఇక మూడవ విషయమేమంటే, పాశ్చాత్య దేశాలలో హిట్లరు, విషమపరిస్థితులు తెచ్చిపెట్టేడు. ఆ పరిస్థితులకు అనుగుణ్యంగా తాముకూడా తయారవుటలో అమెరికను, బ్రిటిష్, సామ్రాజ్యవాదులు నిమగ్నమైవున్నారు. జపాను సామ్రాజ్యవాదులు, తమపై ఎక్కడ పడుతారో అన్నభయంతో, తమకు జపాను సామ్రాజ్యవాదులకు మధ్య తూర్పు దేశాలలోగల సంఘర్షణను మెత్తపరచుటకు యత్నించారు. తత్ఫలితంగా, 1941 సంవత్సరంలో, పసిఫిక్ యుద్ధం ప్రారంభమవునంతవరకు, బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులు, జపాను సామ్రాజ్యవాదులతో రాజీపడుతూవచ్చారు. అంతేగాక చైనాకు, జపానుకు జరుగుతున్న యుద్ధంలో, యీ రెండుదేశాలు నాశనమై పోగలవని ఆశపడుతూ వచ్చారు. పసిఫిక్ యుద్ధం ప్రారంభమైన తర్వాత అందులో ప్రత్యేకంగా పసిఫిక్ ప్రాంతములో విజయాన్ని చేజిక్కించుకొన్న కాలంలో, జపానుకు వ్యతిరేకంగా చైనా దేశన్ని తీవ్రవిజృంభణ యుద్ధాన్ని సాగించవలసిందిగా, అమెరికను సామ్రాజ్యవాదులు డిమాండు జేసారు. దీని అంతరార్థమేమంటే, యీ పరిస్థితిని వినియోగించుకొని చైనా దేశాన్ని అమెరికను వలస రాజ్యంగా చేసుకొనుటకై చైనాదేశంపై గుత్తాధికారాన్ని చేపట్టాలనీ, చైనాప్రజల

విప్లవశక్తులను అణచివేయాలనీ, అమెరికను సామ్రాజ్య వాదులు ఎత్తు ఎత్తేరన్నమాట. బ్రిటిష్, అమెరికను సామ్రాజ్యవాదుల విప్లవప్రతీఘాతక, ద్విముఖ విధానంవలన వారిపట్ల చైనాప్రజలు, విప్లవాత్మక ద్వివిధ విధానాన్ని అవలబించవలసి వచ్చింది - అంటే, జపాను దురాక్రమణను అరికట్టుటకై బ్రిటిష్, అమెరికను సామ్రాజ్యవాదులతో ఐక్యమవ్వటం మొదటిది. చైనాప్రజలకు వ్యతిరేకంగా బ్రిటిష్. అమెరికను సామ్రాజ్యవాదులు జేసేకుట్రలనుండి తమ్మున్తాము కాపాడుకోవటం, వ్యతిరేకించటం, అనేది రెండవది. ఈ రకంగా చైనాప్రజలు, విప్లవాత్మకమైన రెండు విధానాలను బ్రిటిష్, అమెరికను సామ్రాజ్యవాదులతో వ్యవహరించేటప్పుడు, అమలు జరుపాల్సి వచ్చింది.

చైనాదేశంలోనే మూడురకాల శక్తులున్నాయి. ప్రజలు కొమింటాంగూ, దేశద్రోహులునేవి. జపాను సామ్రా వాదాన్ని ప్రజలు గట్టిగా వ్యతిరేకిస్తున్నారు. ప్రతిఘటన యుద్ధంలో, కార్మికవర్గం నాయకత్వాన్ని వహించింది. రైతాంగం ప్రధానశక్తిగా వుంది. పట్టణపెట్టీ బూర్జువా వర్గమూ, జాతీయ బూర్జువావర్గమూ, భూస్వామికవర్గంలోని కొన్ని సెక్షన్లుకూడా, అందులో ప్రత్యేకంగా భూస్వామిక వర్గంలోనుంచి వచ్చిన వికాసంపొందిన పెద్దలు, జపాను సామ్రాజ్యవాదులను ప్రతిఘటించుటలో చేతులు కలిపారు. అందువలన జపాను సామ్రాజ్యవాదులకు వ్యతిరేకమైన ప్రజా ఐక్య - సంఘటన, అత్యంతవిశాలంగా తయారైంది. దేశద్రోహులుమాత్రం. జపాను సామ్రాజ్యవాదులను గట్టిగా

అంటిపెట్టుకొని వున్నారు. చైనాదేశంలో జపాను సామ్రాజ్యవాదులు దండయాత్ర సాగించుటకు తోడ్పడ్డారు. చైనా ప్రజలను అణచివేయుటకు సాయపడ్డారు. పెద్దభూస్వాములలో అత్యంత అభివృద్ధినిరోధకులైనవారినీ బడా బూర్జువావర్గాన్నీ, తదితర తొత్తులను, దేశద్రోహులుగా కొనివేయాలని జపాను సామ్రాజ్యవాదులు గొప్పగా యత్నించారు. కొమింటాంగ్ యొక్క దీర్ఘకాలిక అభివృద్ధి నిరోధకవిధానం కూడా దేశద్రోహుల కార్యకలాపాలను ప్రోత్సహించింది. ప్రతిఘటన యుద్ధం ప్రారంభమైన కొద్దికాలానికే మింటాంగ్‌లోని వాంగ్ - చింగ్ - వైముఠా జపాను సామ్రాజ్యవాదులతో జేరిపోయింది. కాని, ఎంత యత్నించినా దేశద్రోహుల సంఖ్య చాలా అల్పంగానే వుండిపోయింది. యావద్దేశములోని ప్రజలు దేశద్రోహులపట్ల వ్యతిరేకతను జూపేరు. కొమింటాంగ్ అభివృద్ధి నిరోధకులుకూడా దేశద్రోహులపట్ల మాటలలోనైనా వ్యతిరేకతను చూపాల్సివచ్చింది.

అసలు సమస్య కొమింటాంగ్ విషయం పెద్ద భూస్వాములకు బడాబూర్జువా వర్గానికి, ప్రాతినిధ్యం వహిస్తున్న ప్రధాన కొమింటాంగ్ ముఠా చియాంగ్ ముఠా ఇది ప్రధానంగా, బ్రిటిష్ అమెరికను సామ్రాజ్యవాదులకు దళారీవర్గం- ఇది, తన అభివృద్ధి నిరోధక పరిపాలనలోని అనేక సంవత్సరాలలో, ప్రజలను తీవ్రంగా వ్యతిరేకించింది. జపాను వ్యతిరేక పోరాటాన్ని వ్యతిరేకించింది. కమ్యూనిస్టుపార్టీని నాశనం జేయుటకై తన శక్తుల నన్నింటినీ కేంద్రీకరించింది.

చియాంగ్ యీ క్రింది కారణాలవలన జపాను సామ్రాజ్యవాదులను ప్రతిఘటించాడు. ప్రధమ కారణమేమంటే, చైనా ప్రజల వత్తిడివలన అతడు, జపానును ప్రతిఘటించక తప్పిందికాదు. అంతకన్న మార్గాంతరం అతనికి లేదు. అతడు ప్రతిఘటించకపోతే దేశంలోని యావన్మంది ప్రజలు, సుసంఘటితమైన జపాను - వ్యతిరేక శక్తులనేకం, తమంతట మేతా జపానును ప్రతిఘటించేటట్లున్నారు. అలా వారు ప్రతిఘటిస్తే చియాంగ్ తన పరిపాలనను సాగించటం కష్టంగదా! ఇక రెండవకారణ మేమంటే చైనాదేశంలో జపాను సామ్రాజ్యవాదుల దురాక్రమణ మూలంగా చియాంగ్ పరిపాలనకు అతని భూస్వామికవర్గం యొక్క ఆస్తికి బూర్జువావర్గానికి సూటిగా ప్రమాదమేర్పడింది. ఆవిధంగా ఛియాంగ్‌నకు, జపానుసామ్రాజ్యవాదులకు మధ్యగల వైరుధ్యాలు, రాజీ రహితమైనవిగా తయారయ్యాయి. మూడవకారణ మేమంటే, ఆంగ్లో-అమెరికను సామ్రాజ్యవాదులకు, జపాను సామ్రాజ్యవాదులకు మధ్య వైరుధ్యాలున్నాయ్. ఆ సమయంలో బ్రిటిష్, అమెరికను సామ్రాజ్యవాదులు, జపాను సామ్రాజ్యవాదులకు తమంతటతాము కోపం తెప్పించాలని కోరకపోయినా జపానుసామ్రాజ్యవాదులను నొక్కివేయుటకు, వారికి వ్యతిరేకంగా చైనాపోరాడుతే చూడాలని వాంఛించసాగేరు. ప్రతిఘటనయుద్ధంలో చియాంగ్‌ముఠా, తన విప్లవ ప్రతీఘాతక, ద్విముఖస్వభావాన్ని ప్రదర్శించుటకుగల కారణాలివి. ఒకవైపున జపానుకు వ్యతిరేకంగా తాను పోరాడాలనీ, యితరశక్తులుకూడా జపానుకు వ్యతిరేకంగా చురుకుగా

పోరాడలనీ చియాంగుకో లేదు. యుద్ధంయొక్క ప్రథమ కాలంలో జపానువ్యతిరేకయుద్ధంలో ఉత్సాహాన్ని చూపేడు; త్వరగా విజయాన్ని సాధించగలనని ఆశించాడు. మరియొక వైపున అతడు ప్రజలను వ్యతిరేకించాడు. అతడు ప్రజలను అణచసాగేడు. ప్రజల తమంత తాము లేచి జపానుకు వ్యతిరేకంగా పోరాడుటను వ్యతిరేకించాడు; ప్రజలు తమంత తాము లేచి, జపానుకు వ్యతిరేకంగా పోరాడటం అతనికి యిష్టంలేదు; అందులో ప్రత్యేకంగా జపానుకువ్యతిరేకంగా ప్రజలను సమీకరించి, జపానువ్యతిరేక-యుద్ధాన్ని, కమ్యూనిస్టుపార్టీ, తదితర శక్తులు, నడుపుటకు అవకాశాన్ని యివ్వటం, చియాంగునకు యిష్టంలేదు. ప్రతిఘటన యుద్ధాన్ని నడుపుటలో నాయకత్వం తన కొక్కడికే వుండాలని యత్నించాడు. జపాను వ్యతిరేక యుద్ధాన్ని సాగించుటకు కావలసిన వాస్తవిక ప్రజాతంత్ర సంస్కరణలను, అమలు జరుపుటకు నిరాకరించాడు. ప్రజాబలాభివృద్ధిని కత్తిరించుటకు, అందులో ప్రత్యేకంగా, కమ్యూనిస్టుపార్టీ బలాభివృద్ధిని అరికట్టుట యత్నించాడు. తన బలాన్ని యథాతథంగా వుంచివేసుకోటానికి, ప్రతిఘటన యుద్ధంలో, జపాను సైనికతత్వవాదుల హస్తాలులో అష్టమమార్గమ సైన్యం, నూతన నాల్గవసైన్యాలు, తదితర జపాను వ్యతిరేకసైన్యాలు, హతమారిపోవుటకు రహస్యంగా కుట్రలు సాగించాడు. ఈ దుర్బుద్ధితో, యుద్ధరంగాలలోనూ, శత్రువుల వెనుక భాగంలోనూ, తీవ్రయుద్ధంలో అష్టమ సైన్యము, నూతన నాల్గవసైన్యం పాల్గొనే యేర్పాట్లు చేసాడు.

ప్రతిఘటన యుద్ధంలో విజయాన్ని సాధించుటకై చైనా, తనస్వంత బలంపైననే ఆధారపడవచ్చునన్నదానిలో అతనికి విశ్వాసం లేకపోయింది. అందువలన అతడు, చైనా ప్రజాబలంపై ఆధారపడుటకు యిష్టపడలేదు. యిష్టంలేదు కూడాను, అంతేగాక, అతడు, విదేశసహాయంపై ఆధారపడ్డాడు, జపానుకు వ్యతిరేకంగా, బ్రిటను, అమెరికను సామ్రాజ్యవాదులు పోరాడేటట్లు చేయగలనని విశ్వసించాడు. అందులో ప్రత్యేకంగా, అమెరికను సామ్రాజ్యవాదులు, తన తరఫున జపాను సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా పోరాడగలరని ఆశించాడు. కాని, తర్వాత జరిగిన సంఘటనలను జపాను సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా బ్రిటను అమెరికాలు, చాలా నిమ్మదిగా నడువసాగేయ్. అంతేగాక, అనేక సార్లు జపాను సామ్రాజ్యవాదులతో రాజీపడ్డాయ్.

శత్రువుల వెనుక భాగంలో చొచ్చుకొని పోయిన తర్వాత అష్టమసైన్యం నూతన నాల్గవ సైన్యాలు, జపాను సామ్రాజ్యవాదుల చేతులలో హతమారిపోవుటకు బదులుగా, విశాల ప్రజానీకంతో కలసిపోయి శత్రువుల వెనుక భాగంలో విజయం తర్వాత విజయాన్ని చేపట్ట సాగినాయ్. ప్రజా సైన్యాలబలం అమోఘంగా పెరుగజొచ్చింది. చియాంగ్ నియమించిన హద్దులను బ్రద్ధలు జేసుకొని యావత్ ప్రజల సైన్యాలు, అమోఘంగా అభివృద్ధి అయ్యేయి. ఇక చియాంగ్ విషయం తీసుకుంటే, ప్రతిఘటన యుద్ధంలో చియాంగ్ సైన్యాలు విపరీతంగా దెబ్బతిన్నాయ్. అంతేగాక అతని ప్రతిష్ట త్వరితంగా గంగపాలు గాజొచ్చింది. దీనివలన అతనికి కసి

జాస్తి అయ్యింది. అటుతర్వాత అతడు జపానుకు వ్యతిరేకంగా మందకొడిగా ప్రతిఘటన సాగించాడు. చైనా కమ్యూనిస్టు పార్టీ చైనా ప్రజలకు వ్యతిరేకంగా చురుకుగా ప్రతిఘటన సాగించాడు. యుద్ధాలు చేయకుండా తప్పించుకొనసాగేడు, ఇతరులు జపానుకు పోరాడుతూవుంటే, చూస్తూ వూరుకొన్నాడు. తాను ఆయుధ సంపత్తినీ, సైనిక సంపత్తినీ పోగుజేసుకొంటూ నిల్వ జేసుకొన సాగేడు. జపానువాళ్ళను యితరులు జయించినతర్వాత దాని ఫలితాన్ని పొందుటకై తయారవసాగేడు. తాను నిల్వచేసుకొంటున్న ఆయుధ సంపత్తినీ, సైనికసంపత్తినీ, చైనా కమ్యూనిస్టుపార్టీ శక్తులను, చైనా ప్రజాశక్తులను నాశనంజేయుటకై తయారు కాసాగాడు.

ప్రతిఘటనయుద్ధంలో చియాంగ్ అనుసరించిన ప్రధాన పంథా పైవిధాలివి. ఈ రెండింటినీ ప్రతిఘటనయుద్ధంయొక్క కడపటి ఘట్టాలలో అమెరికను ప్రజలు దీనిని వ్యతిరేకించినప్పటికినీ బ్రిటిష్, అమెరికను సామ్రాజ్యవాదులు చియాంగ్ అనుసరించిన పై రెండింటినీ ఆమోదించారు. ఆవిధంగా చియాంగ్ దేశద్రోహులను మాత్రమే వ్యతిరేకించుటయేగాక జపానుకు వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజలనుకూడా వ్యతిరేకించాడు. జపానుసామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా పోరాడుతున్న యావద్దేశములోని శక్తులన్నింటినీ ఐక్యపరచాలనీ, ప్రప్రథమంగా ప్రతిఘటనయుద్ధాన్ని నడుపుటకై ప్రజాశక్తులను సమీకరించాలనీ, జపానుకు వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజలు డిమాండుచేయసాగేరు. అందువలన చియాంగ్ అధ్వర్యానవున్న సైన్యాలు, జపానుకు వ్యతిరేకంగా పోరాడు

నట్లు చేయుటకై ఒకవైపున చియాంగ్‌తో ఐక్యతమవ్వటం కొంతవరకు అవసరమయ్యింది; వారియొక్క వైపున ప్రజాశక్తులు బలహీనపడకుండుటకుగాను, విజయాన్ని ప్రజాశక్తులు చేపట్టుటకై ప్రజాశక్తులను సమీకరించుటకు, వారి బలాన్ని నిల్వచేయుటకు వారిని చియాంగ్ తన కుట్రలతో ముంచెత్తి వేయకుండుటకుగాను, వారే చియాంగ్ కుట్రలను ముంచి వేయుట తగినంతబలం కలిగియుండుటకుగాను, అంతేగాక చియాంగ్‌నకు అమెరికనుసామ్రాజ్యవాదుల కుట్రలను ప్రజాశక్తులు భగ్నంచేయగలిగియుండుటకుగాను, చియాంగుయొక్క అభివృద్ధినిరోధకవిధానానికి వ్యతిరేకంగా దీర్ఘాయుతమైన పోరాటాన్ని నడుపాల్సివచ్చింది అందువలన జపానుకు వ్యతిరేకంగా పోరాడుతున్న చైనాప్రజల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న చైనా కమ్యూనిస్టు పార్టీ కొమింటాంగుతో ఐక్యమయ్యేటప్పుడు తాను స్వతంత్రంగా వుండాలనీ, తన చొరవపై తాను ఆధారపడుటకు అవకాశం వుండాలనీ, నొక్కి వక్కాణించింది.

కామ్రేడ్ మావోసీటుంగ్, ప్రతిఘటన యుద్ధంలోని క్లిష్ట రాజకీయ పరిస్థితినిగురించి సవ్యమైన అంచనా వేసాడు. ప్రతిఘటన యుద్ధాన్ని ప్రారంభమైన తర్వాత దానిలో పాల్గొనుచున్న కమ్యూనిస్టుపార్టీ కొమింటాంగుల మధ్యనున్న తగాదాలు, శ్రామికవర్గం పెద్ద భూస్వామికవర్గం, బడా బూర్జువా వర్గాల చియాంగ్ ముఠా మధ్యనున్న తగాదాలు, యెంతమాత్రమూ ప్రతిఘటన యుద్ధాన్ని సాగించాలా వద్దాయున్న విషయంపై గాదనీ, ఎలా విజయాన్ని సాధించాలనే విషయం

పైననే యని కామ్రేడ్ మాసీయాంగ్ ఎత్తిజూపాడు. ప్రతిఘటన యుద్ధంలో రెండు వ్యతిరేక పంథాలున్నాయని— చియాంగ్ ప్రాతినిధ్యం వహిస్తున్న పెద్ద భూస్వామిక వర్గం బడా బూర్జువావర్గాల పంథా యొకటి, చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రాతినిధ్యం వహిస్తున్న శ్రామికవర్గం, యావత్ చైనా ప్రజల పంథా మరియొకటి యని కామ్రేడ్ మాసీయాంగ్ ఎత్తిజూపేడు చియాంగ్‌యొక్క కొమింటాంగ్ అనుసరించే "పాక్షిక యుద్ధ" విధానాన్ని అనుసరిస్తే— అంటే, ప్రతిఘటన యుద్ధంలో కొమింటాంగ్ ప్రభుత్వం ఒక్కటిమాత్రమే పాల్గొనాలి. యావత్ చైనా ప్రజలు పాల్గొన్నరాదన్న "పాక్షికయుద్ధ" విధానాన్ని అనుసరిస్తే యీ ప్రతిఘటన యుద్ధం తప్పక దెబ్బతినగలదని కామ్రేడ్ మాసీయాంగ్ ఎత్తిజూపేడు. ప్రజా యుద్ధ పంథాను అనుసరించుటద్వారా మాత్రమే కాక, "పరిపూర్ణయుద్ధాన్ని" సాగించుటద్వారా మాత్రమే విజయం సాధించబడగలదని కామ్రేడ్ మాసీయాంగ్ ఎత్తిచూపాడు.

1937 ఆగస్టులో, లోచువాన్ అన్న ప్రదేశంలో జరుపబడిన కాన్ఫరెన్సులో, కామ్రేడ్ మాసీయాంగ్ ప్రతిపాదన ననుసరించి, చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ, ప్రఖ్యాతమైన "జాతీయవిముక్తి, జపాను నెదుర్కొనుటకు, పదిసూత్రాల కార్యక్రమాన్ని" ప్రతిఘటన యుద్ధంలో విజయంకొరకు పోరాడుటకై, మనదేశంలోని ప్రజలను నడుపుటకై చియాంగ్‌యొక్క అభివృద్ధి నిరోధక వంచనాపూరిత విధానాన్ని వ్యతిరేకించుటకు, తనదిక్కూచిగా

ఆమోదించింది. శత్రువుయొక్క వెనుకభాగంలో వీలైనంత విస్తారముగా, స్వతంత్రంగా గెరిల్లాయుద్ధతంత్రాన్ని అమలుజరిపించాలనీ, ముందుభాగంలోని యుద్ధరంగాలవ్యూహాత్మక కర్తవ్యాలతో గెరిల్లాయుద్ధతంత్రం, సహకరించాలనీ, అంటే, శత్రువుల వెనుకభాగంలో యుద్ధరంగాలను సృష్టించుచూ, జపాను వ్యతిరేకస్థావరాలను శత్రువుల వెనుకభాగంలో స్థాపించుచూ, గెరిల్లా యుద్ధతంత్రం, ఆ విధంగా ముందుభాగంలోని యుద్ధరంగాలలో వ్యూహాత్మకకర్తవ్యాలతో సహకరించాలనీ, కొమింటాంగ్ పాలితప్రాంతాలలో, పరిపూర్ణంగా వీలైనంత విస్తారముగా జపాను వ్యతిరేక ప్రజావుద్యమాన్ని నిర్మించాలనీ, లోచువాన్ కాన్ఫరెన్సు తీర్మానించింది. ప్రతిఘటన యుదంలో, యావద్దేశములోనూ, యావన్మంది ప్రజలను సమీకరించుటకు సౌలభ్యాలేర్పడుటకై, ప్రజల రాజకీయ ఆర్థిక హక్కులకై పోరాడుటకు లోచువాన్ కాన్ఫరెన్సు తీర్మానించింది. అంతేగాక ప్రతిఘటనయుద్ధం కాలంలో రైతాంగసమస్యను పరిష్కరించుటలో కాలురేట్లను వడ్డీరేట్లను తగ్గించాలనీ ఆందోళనచేయుట వాటిని సాధించుటయే ప్రదానవిధానమని తీర్మానించింది.

ప్రతిఘటనయుద్ధంలో రెండుపంథాలపై వివాదం. పార్టీలోకూడా తీవ్రంగా ప్రతిబింబించింది. రెండవవిప్లవాత్మక అంతర్యుద్ధకాలంలో తీవ్రమైన "అతివాద" పొరపాట్లనుజేసిన వాంగ్‌మింగ్ (చెన్‌షావూ) పంథాకు ప్రతినిధులుగానున్న కొంతమంది కామ్రేడ్సు యీనాడు పార్టీపంథాను మితవాద-అవకాశవాదపైఖరిద్వారా విమర్శించసాగేరు; వ్యతిరేకించ

సాగేరు. అంతేగాక వారు మరింత ముందుకుపోయి, పార్టీ క్రమశిక్షణను భగ్నంజేస్తూ, పనిలో మితవాద - అవకాశ వాదపంథాను నిరంకుశంగా అవలంబించసాగారు; దీనికి వారే బాధ్యులు. కమ్యూనిస్టుపార్టి, దాని సైనికశక్తులు తాత్కాలికంగా బలహీనంగా వుండుటచూచి కొమింటాంగ్ అమితంగా బలంగా వుండటంజూచి ప్రతిఘటనయుద్ధంలో జయమనేది కొమింటాంగ్‌పై ఆధారపడియుండాలనీ, అది తప్పకుండా కొమింటాంగ్‌నకే విజయం కాగలదనీ, అది ప్రజలకు విజయంగా యేమాత్రమూ వుండజాలదనీ, కొమింగ్ టాంగ్ ప్రతిఘటన యుద్ధానికి నాయకుడు కాగలదనీ, కమ్యూనిస్టుపార్టీ ప్రతిఘటనయుద్ధాని కేమాత్రమూ నాయకుడు కాజాలడనీ, - యీ విధమైన తప్పుడు నిర్ణయాలకు పైన చెప్పబడిన వాంగ్‌మింగ్ క్రమేపి వచ్చారు. ప్రతిఘటన యుద్ధంలో కమ్యూనిస్టునాయకత్వాన నడచుచున్న గెరిల్లా యుద్ధతంత్రాన్ని తేలికగా చూడసాగేరు; కొమింటాంగ్ సైన్యంపై ఆధారపడుటద్వారా సత్వర విజయాన్ని చేపట్ట గలమన్న భ్రమలను తమలో పోషించుకొనసాగారు. వారు ఐక్యసంఘటనలో పార్టీ తన స్వతంత్రతాన్ని నిలబెట్టుకోవాలన్న విప్లవాత్మక సూత్రాన్ని రద్దుచేసేరు. "పోరాటంతో పాటు ఐక్యత, పోరాటంద్వారా ఐక్యత" అన్న విప్లవాత్మక సూత్రాన్ని రద్దుజేసేరు. ప్రతిఘటన యుద్ధంలో, కమ్యూనిస్టు పార్టీకినీ, కొమింటాంగ్‌నకునూ మధ్యగల సూత్రంలోని భేదాన్ని మరచేరు. త్రోసిపుచ్చేరు. చియాంగ్ యొక్క కొమింటాంగ్ నిర్ణయించిన సరిహద్దులకే తమ కార్యకలాపాలను పరిమి

తించుకొని సాగించుకుంటూ, కొమింటాంగ్ కోరే అభివృద్ధి నిరోధకమైన గొంతెమ్మ కోర్కెలకు కమ్యూనిస్టులు లొంగి పోవాలని వారు డిమాండు చేసేరు. "సైనిక నాయకత్వం ఐక్యతను సాధించుటకు నిర్మాణంలోనూ, వస్తుసామగ్రి విషయంలోనూ, క్రమశిక్షణ విషయంలోనూ, ప్లానింగులోనూ, సైనిక చర్యలలోనూ, ఐక్యతను సాధించుటకై" అష్టమ సైన్యాన్ని నూతన నాల్గవ సైన్యాన్ని కొమింటాంగు సైన్యం తో పూర్తిగా కలిపివేయాలని డిమాండు జేసేరు.

పోరాటంలో ప్రజలందరినీ పరిపూర్ణంగా సమీకరించుటను, వారు వ్యతిరేకించారు, విముక్త ప్రాంతాల విస్తరణను వ్యతిరేకించారు. జపాను ఆక్రమిత ప్రాంతాలలో ప్రజా సాయుధ సైన్యాల యేర్పాటును వ్యతిరేకించారు. జపానుకు వ్యతిరేకమైన ఐక్యసంఘటననుండి చియాంగ్ యొక్క కొమింటాంగును, అలాంటి కార్యకలాపాలు "భయపెట్టి" పారిపోవునట్లు చేయగలవని వీరు భయపడ్డారు. కేంద్రకమిటీ ఆమోదం లేనిదే తప్పుడు అభిప్రాయాలతో కూడిన ప్రకటనలను చేసేరు, నిర్ణయాలు జేసేరు వ్యాసాలు వ్రాసేరు. కేంద్రకమిటీయిచ్చిన సరియైనసూచనలను విసర్జించారు. ఈతప్పుడుభావాలు, కార్యకలాపాలు, పార్టీ పనిపై తమప్రభావాన్ని వేసేయ్; 1938 సంవత్సరంలో వూహాన్‌లో కామ్రేడ్ వాంగ్‌మింగ్ వీటికి బాధ్యుడు. 1941 జనవరిలో జరిగిన "దక్షిణఅన్హ్వాయ్‌సంఘటనకు" పూర్వం నూతన నాల్గవసైన్యంలో కామ్రేడ్ హిసియాంగ్‌యింగ్ యొక్క పని పైదానికి బాధ్యురాలు. తత్ఫలితంగా వీరు యాంగ్సీనదిప్రాంతంలోని ప్రజల ప్రతిఘటనయుద్ధాభివృద్ధిని

ఆటంకపరచేరు; "దక్షిణఅన్హ్వాయ్‌సంఘటన"లో నూతన నాల్గవసైన్యం అపజయంపొందుటకు దారితీసేరు. పార్టీలోని మితవాదశక్తులు, చియాంగ్ ప్రయోజనాలకు అనుగుణ్యమైన విగా వున్నాయనీ, జపానుకు వ్యతిరేకంగా పోరాడుతున్న శ్రామికవర్గం ప్రజానీకాల ప్రయోజనాలపై దెబ్బతీశాయనుట సుస్పష్టం. దీనికర్థ మేమంటే ప్రథమ అంతర్యుద్ధకాలంలోని చెన్-తూ-హిస్యూయొక్క మితవాద - అవకాశవాదం నూతనపరిస్థితిలో మరల తలయెత్తిందన్నమాట. కామ్రేడ్ మాసీటుంగ్ యిలాంటి తప్పుడు అభిప్రాయాలకు వ్యతిరేకంగా గట్టిగా పోరాడాడు; తత్ఫలితంగా వాస్తవిక ఆచరణలో యీతప్పుడుఅభిప్రాయాలవలన ఎక్కువహాని జరుగకపూర్వమే యివి అధిగమించబడ్డాయ్.

ప్రతిఘటనయుద్ధానికి సంబంధించినవిషయాలలో పార్టీ లోపలను, వెలుపలనుగల తప్పుడుఅభిప్రాయాలను బట్టబయలు జేసి సవ్యమైనమార్గాన్ని సూచించుటకై కామ్రేడ్ మాసీటుంగ్ 1938 సంవత్సరంలో "దీర్ఘకాలికయుద్ధం" అన్న ఒక గ్రంథాన్ని రచించాడు. ఈ పుస్తకంలో, కామ్రేడ్ మాసీటుంగ్ చైనా, జపాను దేశాలలోని రాజకీయ సైనిక పరిస్థితులనుగురించి చక్కగా వివరించేడు. ప్రతిఘటన యుద్ధంలో చైనాదేశానిదే అంతిమ విజయమని నొక్కి వక్కాణించాడు. అంతేగాక యీ ప్రతిఘటన యుద్ధం ఒక దీర్ఘకాలిక యుద్ధమనీ, సత్వర విజయమంటూ వుండదనీ యుద్ధాన్ని జయించాలంటే ప్రజాయుద్ధ విధానాన్ని అవలంబించాలనీ కామ్రేడ్ మాసీటుంగ్ వివరించాడు.

1938 అక్టోబరులో హేనాన్ నగరంలో ఆరవపార్టీ కాంగ్రెసుచే ఎన్నుకోబడిన కేంద్రకమిటీయొక్క ఆరవ విస్తృత సమావేశం జరుపబడింది. మాసీయాంగ్ నాయకత్వానవున్న కేంద్ర రాజకీయ సంఘంయొక్క (సెంట్రల్ పొలిటికల్ బ్యూరో) ప్రతిఘటన యుద్ధానికి సంబంధించిన పంథాను జపాను వ్యతిరేక జాతీయ ఐక్యతాసంఘటనకు సంబంధించిన పంథాను విస్తృత సమావేశం బలపరచింది.

ఐక్యతాసంఘటన సమస్యపై సాంత్వనతత్వపు తప్పుడు పంథాను యీ విస్తృత సమావేశం విమర్శించింది; ఎట్టి మినహాయింపులు లేకుండా స్వతంత్రంగా జపానుకు వ్యతిరేకంగా సాయుధ ప్రజాపోరాటాన్ని పార్టీ సంఘటితపరచాలని నిర్ణయించింది. యుద్ధ ప్రాంతాలలోనూ, శత్రువుల వెనుకభాగంలోనూ పార్టీ ప్రధానంగా పనిచేయాలని తీర్మానించింది. ప్రతిఘటనయుద్ధంలో విజయంకొరకై కొమింటాంగ్ సైన్యముపై ఆధారపడే తప్పుడు అభిప్రాయాలను, ఆశలను ఖండించింది. అభివృద్ధినిరోధక పాలనక్రిందనున్న బహిరంగ వుద్యమానికి ప్రజల భవిష్యత్తుపై నిర్ణయాని వదలివేయాలన్న తప్పుడుభావాలను భ్రమలను ఖండించింది.

ప్రతిఘటన యుద్ధంయొక్క వాస్తవికాభివృద్ధి, కామ్రేడ్ మాసీయాంగ్ మరియు చైనా కమ్యూనిస్టుపార్టి కేంద్రకమిటీ చెప్పినది సత్యమైనదని రుజువుజేసింది. ప్రతిఘటన యుద్ధంయొక్క మొదటిదశలో చియాంగ్ సైన్యాలు జపాను సామ్రాజ్యవాదులను ప్రతిఘటించినప్పటికీ, చియాంగ్ చేసిన రాజకీయ సైనిక పొరపాట్లవలన అతని సైన్యాలు త్వరగా అపజ

యాన్ని పొందాయ్. 1938 అక్టోబరు నాటికి కాంటన్ వూహాన్ నగరాలనుండి తన సైన్యాలను తరలించుట తప్ప చియాంగ్‌నకు మరియొక మార్గం లేకపోయింది అప్పటినుండి చియాంగ్ జపాను సైన్యంతో పోరాటాన్ని తప్పించుకోటానికి ఛుంకింగ్, సియాన్ నగరాలను కేంద్రంగా జేసుకొని చైనా దేశపు వాయువ్యదిశలోనూ, ఈశాన్య దిశలోనూ, తన ప్రధాన సైన్యాలను కేంద్రీకరించాడు. చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన వున్న అష్టమసైన్యం నూతన నాల్గవ సైన్యాలు చైనాదేశపు ఉత్తర దక్షిణ తూర్పు దిశలలోనున్న చైనా మధ్యభాగంలో నున్న ప్రజలను సాయుధులనుగాజేసి జపానుకు వ్యతిరేకంగా శక్తిమంతమైన గెరిల్లా యుద్ధ తంత్రాన్ని అభివృద్ధి జేసాయ్. అనేక జపాను వ్యతిరేక ప్రజాతంత్ర స్థావరాలను స్థాపించాయ్.

1940 సంవత్సరంలో జరుపబడిన ప్రతిఘటన యుద్ధం యొక్క మూడవ వార్షికోత్సవం నాటికి, చైనా కమ్యూనిస్టు నాయకత్వాన జపాను సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగాపోరాడుతున్న ప్రజాసైన్యంయొక్క బలం ఐదు లక్షలకు పెరిగింది; ఇంతకుపూర్వంజూస్తే దీనిబలం నలభై వేలుమాత్రమే వుండేది. ఈ ప్రజాసైన్యం, చైనాదేశంలోనున్న జపానుసామ్రాజ్యవాదుల సైన్యాలలో సగంసైన్యాలతో నిలబడిపోరుతూవుంది. ఈమూడుపోరాట సంవత్సరాలలోనూ, జపానుసామ్రాజ్యవాదులనుండి 150 పట్నాలను విముక్తిజెందించింది. విముక్త ప్రాంతాల, గెరిల్లాప్రాంతాల జనాభా రమారమి పదికోట్లకు పెరిగింది. మూడుసంవత్సరాలకుపూర్వం కమ్యూనిస్టుపార్టీ

సభ్యత్వం నలభైవేలువుండేది; యీ మూడుసంవత్సరాలు గడచినతర్వాత (1940 లో) కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వం ఎనిమిదిలక్షలకు పెరిగింది. లియూవోసింగ్ మొదలుకొని జెహోల్, ఛాహార్ వరకు, సూయువాన్ మొదలుకొని క్వాంటంగ్, హైనాన్‌ద్వీపకల్పంవరకు కమ్యూనిస్టుపార్టీ సభ్యులచే నడుపబడుచున్న జపాను – వ్యతిరేక– సాయుధప్రజా సైన్యాలు వున్నాయ్. ప్రతిఘటనయుద్ధం, ఘనమైన, యదార్థమైన ఒక జాతీయవిప్లవంగా తయారయ్యింది.

జపాను దురాక్రమణదారులు, వూహాన్, కాంటన్ నగరాలను ఆక్రమించుకొన్నతర్వాత శత్రువుల వెనుక భాగంలో గెరిల్లాయుద్ధం అత్యద్భుతంగా అభివృద్ధిజెందింది; తత్ఫలితంగా యుద్ధం స్తబ్దతలో పడింది; జపానుదురాక్రమణదారులు యిక ముందడుగువేయలేకపోయారు. ఎందువల్లనంటే వారి వెనుకభాగంలో శక్తిమంతమైన గెరిల్లాసైన్యాలు దెబ్బతీయసాగేయ్; గెరిల్లాలతో యుద్ధంచేయుటకై జపాను దురాక్రమణదారులు వెనుకకు తిరగాల్సివచ్చింది. జపాను దురాక్రమణదారులు తమ ప్రధాన శక్తిని తమ వెనుక భాగంపై కేంద్రీకరించ నిశ్చయించుకున్నారు. వారు తమ ముందుభాగంలో వ్యూహాత్మక విజృంభణను కట్టిపెట్టి లొంగిపోవలసినదిగా చియాంగ్-కై-షేకును ఒప్పించటానికి రాజకీయ సాధనలను ప్రయోగించసాగేరు. ఈ సమయంలో చైనా కమ్యూనిస్టుపార్టీ యీ క్రింది నినాదాల నిచ్చింది. "ప్రతిఘటనయుద్ధాన్ని సాగించాలి, లొంగుబాటును వ్యతిరేకించాలి, ఐక్యతను సాధించాలి, చీలికలను వ్యతిరేకిం

చాలి, అభ్యుదయాన్ని సాధించాలి, అభివృద్ధినిరోధకత్వాన్ని వ్యతిరేకించాలి"; యీ విధంగా చైనా కమ్యూనిస్టుపార్టీ చియాంగ్ యొక్క కొమింటాంగ్ అభివృద్ధినిరోధక ధోరణులను వ్యతిరేకంగా దేశమంతటా సినదించి, యావన్మంది ప్రజలను నడిపింది. ఫాసిస్టు జర్మనీ, బ్రిటన్, ఫ్రాన్సు దేశాలమధ్య యుద్ధం, 1939 సెప్టెంబరులో ప్రారంభంకాగానే చియాంగ్ యొక్క లొంగుబాటుతత్వం ఉచ్ఛదశకు జేరుకొంది. ఆ కాలములో బ్రిటన్, అమెరికాలను వ్యతిరేకించుటలో జపాను హిట్లరుతో చేతులుకలుపకుండా వుండుటకుగాను జపాను సామ్రాజ్యవాదులతో రాజీచేసుకొనుటకు చైనాను బలిపెట్టుటకై బ్రిటిషు, అమెరికను సామ్రాజ్యవాదులు తహతహలాడుతూవున్నారు. చైనాను లొంగదీయుటకుగాను తీవ్రంగా ప్రతిఘటనయుద్ధాన్ని నడుపుతున్న చైనా కమ్యూనిస్టుపార్టీపై తీవ్ర ప్రతిఘటన వారు సాగించాల్సివచ్చింది.

ఈ సమయంలోనే, బ్రిటిష్, అమెరికను సామ్రాజ్యవాదుల యిచ్ఛానుసారంగా, 1939 సంవత్సరాంతంనుండి 1940 సంవత్సరారంభంవరకూ చియాంగ్‌ని కొమింటాంగు ప్రథమ కమ్యూనిస్టు వ్యతిరేకోద్యమాన్ని ప్రారంభించింది. చైనా కమ్యూనిస్టుపార్టీ అధ్వర్యానవున్న షెన్సీ - కాన్సూ-నింగ్షియా సరిహద్దు ప్రాంతంపై కొమింటాంగు అభివృద్ధినిరోధక సైన్యాలు పడ్డాయి. అయిదు పట్నాలను పట్టుకున్నాయి. పశ్చిమ షెన్సీ రాష్ట్రంలో కమ్యూనిస్టులచే నడుపబడుచున్న జపాను వ్యతిరేక "ధీరోదాత్త" దళాలపై పడ్డాయి. వాయువ్య షెన్సీ రాష్ట్రంలో కమ్యూనిస్టుపార్టీ అధ్వర్యాన

నడుచుచున్న అష్టమ సైన్యాన్ని ముట్టడించేయ్. ఇదేకాలం లో జపాను సామ్రాజ్య వాదుల సైన్యాలు తన్ను ముట్టడిస్తున్నప్పటికినీ, వాటిని ఎదుర్కొంటూ మరియొక మూల కొమింటాంగు సేనలదాడిని అష్టమసైన్యం గట్టిగా త్రిప్పి కొట్టింది.

చైనా కమ్యూనిస్టుపార్టీని చైనా ప్రజలను తీవ్ర పోరాటాలు ఎదుర్కొన్నాయ్. జపాను సామ్రాజ్యవాదుల దురాక్రమణకు చైనాదేశం బలియవుతున్న దన్న విషయం ప్రతిఘటన యుద్ధాలలో ఎవరు విజయాన్ని సాధిస్తే వారు జాతియంతటా విజయాన్ని చేపట్టగలరన్న విషయం సుస్పష్టమైపోయింది. జపాను వ్యతిరేకమైన ప్రతిఘటన యుద్ధంలో తాను యథార్థ నాయకుడుగా చైనా కమ్యూనిస్టుపార్టీ రుజువు జేసుకొంది. కాబట్టి కొమింటాంగు అభివృద్ధి నిరోధకులు, వారి అనుయాయులు నైతికంగా పూర్తిగా నిరాయుధులుగా జేయుటకు చైనా కార్మికవర్గాన్ని చైనా విప్లవాత్మకప్రజలను నైతికముగా సాయుధులుగా తయారుజేయుటకు చైనా కమ్యూనిస్టుపార్టీ చైనా విప్లవానికి నూతన చైనా నిర్మాణానికి సంబంధించిన తన అభిప్రాయాలను యావన్మంది ప్రజలకు వివరించాల్సివచ్చింది. ఈ కర్తవ్య నిర్వహణ కామ్రేడ్ మాసీయూంగ్‌పై పెట్టబడింది. 1940 సంవత్సరంలో ప్రకటింపబడిన "నూతన ప్రజాతంత్రం" అన్న పుస్తకరూపంలో కామ్రేడ్ మాసీయాంగ్ తన కర్తవ్యాన్ని నిర్వహించాడు. చైనాచరిత్ర ప్రపంచ చరిత్రలతో ప్రారంభించి కామ్రేడ్ మాసీయూంగ్ "నూతన ప్రజాతంత్రం" అన్న యీ పుస్తకంలో రష్యాలో సంభవించిన అక్టోబరు సోషలిస్టు

విప్లవాన్ని అనుసరిస్తూ చైనావిప్లవంలో నాయకత్వం చైనా కార్మికవర్గానికే తప్పక జెందాలనీ, చైనా విప్లవాన్ని రెండు దశలుగా విభజించాలనీ అంటే నూతన ప్రజాతంత్రదశ, సోషలిస్టుదశలుగా విభజించాలనీ, కార్మికవర్గ నాయకత్వంక్రింద నూతన ప్రజాతంత్రంయొక్క భవిష్యత్తు తప్పకుండా సోషలిజమేయనీ నూతన ప్రజాతంత్ర విప్లవకాలంలో మనపార్టీ పెట్టుబడిదారీ విధానంనుండి సోషలిస్టు విధానంనుండి విభిన్నమైన నూతన ప్రజాతంత్ర రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక కార్యక్రమాలను అనుసరించాలనీ వివరించాడు. "నూతన ప్రజాతంత్రాన్ని" ప్రకటించటంతో పార్టీయొక్క సైద్ధాంతిక ఐక్యత చైనా దేశపు యావన్మంది విప్లవాత్మక ప్రజలఐక్యత, అమోఘంగా పురోగమించింది. ప్రజావిముక్త ప్రాంతాల విధానాలను సమైక్యంచేయుటకు అదెంతో తోడ్పడింది. అందువలన అది చైనావిప్లవాన్ని అమోఘంగా బలపరచింది.

మనపార్టీ మితవాద పెడమార్గాలను అధిగమించిన తర్వాత జపాను - వ్యతిరేక - జాతీయ ఐక్యతాసంఘటనను మరింతగా విస్తరింపజేయుటకు దృఢతరంజేయుటకుగాను, చైనాకమ్యూనిస్టుపార్టీ చైనాప్రజలపైన కొమింటాంగ్ చేసిన దాడులకు వ్యతిరేకంగా పోరాడుతున్నకాలంలో జనించిన కొన్ని "అతివాద" పెడమార్గాలను సరిదిద్దుటకు అనేకచర్యలను తీసుకొంది. ప్రతిఘటనయుద్ధకాలంలో మనజాతియొక్క శత్రువు మనదేశంలో బాగా చొచ్చుకొనిపోయినాడుకాబట్టి యీ రెండుజాతులమధ్య వైరుధ్యాలు (చైనా, జపానుజాతుల) ప్రధానమైనవిగా మనపార్టీ భావించింది. కొమింటాంగ్

జపానుదురాక్రమణదారులకు లొంగిపోనంతకాలం కొమిం టాంగుతో విడిపోకుండావుండటం అవసరమనీ, సాధ్యమని కూడా భావించింది; పెద్దరభస లేకుండా పరిమితపరిధులలో కొమింటాంగ్ అభివృద్ధినిరోధకులకు వ్యతిరేకంగా పోరాటాన్ని సాగించటం అవసరమనీ, సాధ్యమనీ భావించింది. మధ్యమ తరగతికి చెందిన బూర్జువావర్గం వికాసాన్ని పొందిన అభిజాత్య వర్గాలతో ఐక్యతను సాధించుటకై దృష్టిని కేంద్రీకరించాలని మనపార్టీ అభిప్రాయపడింది. అందువలన మనపార్టీ "అభ్యు దయశక్తులను అభివృద్ధిజేయుటకు మధ్యస్థశక్తులను మనవైపు నకు త్రిప్పుకొనుటకు, కరుడుగట్టిన మితివాదులను వేరు చేయుటకు" ఒక సాధారణ కార్యక్రమాన్ని రచించింది. కొమింటాంగ్ అభివృద్ధి నిరోధకులకు వ్యతిరేకంగా పోరా టాన్ని నడుపునట్టి దిక్సూచక సూత్రం". న్యాయబద్ధమైనది గానూ, లాభకారిగానూ, వివేకవంతమైనదిగానూ వుండాలని సూచించింది. అంతేగాక, "ముగ్గురేసి ప్రతినిధుల విధానం" అంటే కార్మికవర్గానికి, బీదరైతులకు ప్రాతినిధ్యం వహిస్తున్న కమ్యూనిస్టు ప్రతినిధులు ముగ్గురు, పెట్టీ బూర్జువా వర్గానికి ప్రాతినిధ్యం వహించే అభ్యుదయ శక్తులు ముగ్గురు, మధ్యమ తరగతి బూర్జువా వర్గానికి వికాసంపొందిన అభిజాత్య వర్గా నికి ప్రాతినిధ్యం వహించే మధ్యస్థ శక్తులు ముగ్గురు పైమూడు రకాల శక్తులకు ముగ్గురేసి చొప్పున ప్రభుత్వశాఖలలో స్థానాలు యివ్వబడ్డాయి. యీ "ముగ్గురేసి ప్రతినిధుల విధా నం" విముక్త ప్రాంతాలన్నింటిలోని ప్రభుత్వ పరిపాలనలో ప్రవేశ పెట్టబడింది.

కమ్యూనిస్టు పార్టీయొక్క సైనిక శక్తులను బలహీన పరచుటకై 1941 జనవరిలో చియాంగ్-కై-షేకు, రెండవ కమ్యూనిస్టు వ్యతిరేక దండయాత్రను ప్రారంభించాడు. అతడు నిరంకుశంగా నూతన నాల్గవ సైన్యంయొక్క ప్రధాన కేంద్రానీన్ని, దక్షిణ ఆన్హ్వాయి రాష్ట్రంలో స్థావరమున్న ఆ సైన్యంలోని పదివేలమంది సైనికులు గలిగిన భాగాన్ని యాంగ్సీనది వుత్తర తటానికి తరలిపోవలసిందిగా ఆజ్ఞాపించేడు.

అతడు చెప్పినట్లుగా జనవరి 7వ తారీఖున నూతన నాల్గవ సైన్యం తరలిపోతూవుండగా చియాంగ్ ఘాతుకుడు ఎనభైవేల సైనికులతోవచ్చి నూతన నాల్గవ సైన్యాన్ని చుట్టుముట్టేడు. అనేక నష్టాలను కలిగించాడు. నూతన నాల్గవ సైన్యంయొక్క కమాండరైన యేతింగ్ ఖైదీగా పట్టుకొన బడ్డాడు. దాని ఉపసేనాధిపతియైన హిసియాయింగ్ యుద్ధంలో మృతిజెందేడు. ఈ కుట్రను విజయవంతంగా సాగించిన తర్వాత చియాంగ్ వెంటనే నూతన నాల్గవ సైన్యంయొక్క పేరును రద్దుజేసి నూతన నాల్గవ సైన్యంలోని యితర సెక్షన్లను ముట్టడించవలసిందిగా చియాంగ్ ఘాతుకుడు తన సైన్యాలను ఆజ్ఞాపించాడు. ఈ సంఘటననే దక్షిణ ఆన్హ్వాయి సంఘటన యని పిలుస్తారు. చైనా కమ్యూనిస్టుపార్టీ నూతన నాల్గవ సైన్యాన్ని రద్దుజేయ వలసిందిగా యిచ్చిన చియాంగ్‌యొక్క "ఆజ్ఞను" తీవ్రంగా వ్యతిరేకించింది కొమింటాంగ్‌యొక్క విజృంభణలను తుడిచిపెట్టింది. అంతేగాక యీ సంఘటన జరుగ పూర్వంకన్న మరింత దృఢంగా నూతన నాల్గవసైన్యం

యొక్క ప్రధానభాగం తయారైంది. తూర్పు చైనా ప్రాంతాలలో యీ సైన్యం మరింత బలంగా అభివృద్ధి జెందింది.

ఈ సంఘటనకు పూర్వం అటుతర్వాత చైనా కమ్యూనిస్టుపార్టీ ఐక్యత సంఘటనలో చేసిన అద్భుతకృషికి ధన్యవాదాలు. అదిచేసిన అద్భుతకృషి ఫలితంగా చైనాకమ్యూనిస్టుపార్టీ నిఏకాకిగా జేయాలని చియాంగ్ చేసిన యత్నాలుఫలించక పోవుటయేగాక తద్భిన్నంగా చియాంగ్ నుగురించి భ్రమలు కలిగినవారి భ్రమలు తొలగించుటకు, వారిని మేల్కొలుపుటకు ఆవిధంగా చియాంగును వారినుండి వేరుచేయుచూ, ఐక్యతను సాధించుటకు చైనాకమ్యూనిస్టుపార్టీ సేవజేసింది.

ఏమైనప్పటికినీ దక్షిణఆన్వాయ్‌సంఘటనతో చైనా ప్రజల కష్టాలు ప్రారంభమయ్యాయి. 1941 సంవత్సరారంభంలోనే తమ వెనకభాగంలోనున్న విముక్తప్రాంతాలలోని రంగాలలో ఆ విముక్తప్రాంతాలను నాశనంజేయాలన్న తలంపుతో జపానుసామ్రాజ్యవాదులు తమసైన్యంలో నూటికి అరవైవంతుల సైన్యాన్ని కేంద్రీకరించారు; "అంతనూ తగులబెట్టు, అందరినీచంపు, అంతనూ దోచెయ్యి" అన్న విధానాన్ని అమలుజరుపుతూ విముక్తప్రాంతాలకు వ్యతిరేకంగా "సర్వనాశన" యుద్ధాన్ని పెద్దపెట్టున సాగించారు. జపాను సామ్రాజ్యవాదుల సైనికశ్రేణులకు వెనుకభాగంలోనున్న కొమింటాంగ్ సైన్యాలలోని అధికభాగం జపానుసామ్రాజ్యవాదులకు లొంగిపోయి, వారి కీలుబొమ్మసైన్యాలుగా తయారయ్యాయి. ఈ కీలుబొమ్మసైన్యాలలోని నూటికి తొంభైవంతులు జపానుదురాక్రమణదారుల సేనానుల నాయకత్వాన

విముక్తప్రాంతాలను ముట్టడించుటకు వినియోగించబడ్డాయ్
జపాను దురాక్రమణదారులకు లొంగిపోవాల్సిందిగాను,
అటుతర్వాత జపాను దురాక్రమణదారుల నాయకత్వాన
అష్టమసైన్యం నూతన నాల్గవసైన్యాలకు వ్యతిరేకంగా
పోరాడవలసిందిగా చియాంగ్ తనసేనలకు రహస్యంగా ఆజ్ఞలు
జారీ చేసాడు.

1941 జూన్‌లో ఫాసిస్టుజర్మనీ సోవియట్ యూనియ
నుపై బడింది. అదే సంవత్సరం వర్షాకాలంలో జపాను సామ్రా
జ్యవాదులు పసిఫిక్ మహాసముద్రంలోని బ్రిటిష్ అమెరికను
స్థావరాలపై ముట్టడిసాగించారు. ఫాసిస్టుముఠా యుద్ధంయొక్క
ప్రథమదశలలో సాధించిన విజయాలను జూచి కొమింటాంగ్
అభివృద్ధినిరోధకులకు మరింతవుత్సాహం కలిగింది. శత్రువునకు
లొంగిపోవుటకు, శత్రువుతో సహకరించుటకు, విముక్తప్రాం
తాలను చక్రబంధంలో బిగించుటకు, కమ్యూనిస్టులను, చైనా
ప్రజలను ముట్టడించుటకు, కుటిల యత్నాలు జేయసాగారు.

అదే సమయంలో, చైనా కమ్యూనిస్టుపార్టీ చైనా
ప్రజల బలాన్ని బలహీనపరచుటకు, కొమింటాంగ్ అభివృద్ధి
నిరోధకులు,అన్నిరకాలా యత్నించారు. అలాంటిపరిస్థితులలో
తమ ప్రజలు, సైన్యాలతోపాటు విముక్తప్రాంతాలసంఖ్య
క్షీణించసాగింది. అంతేగాక, అనేక ఆర్థిక కష్టాలను ఎదుర్కో
వాల్సివచ్చింది. అలాంటి కష్టాలను అధిగమించుటకు, మన
పార్టీ మరింత అధికంగా కృషి జేయవలసివచ్చింది. ప్రజల
భారాన్ని తగ్గించుటకుగాను, మనపార్టీ విముక్తప్రాంతాలలోని
ప్రభుత్వ ఆఫీసులు, పాఠశాలలు, సైన్యాలు, వుత్పత్తిలో

పాల్గొనుటద్వారా స్వయంపోషకంగా తయారయ్యేలాగున యత్నించింది. సైన్యాలసంఖ్యను తగ్గించి, పోరాటశక్తి అభివృద్ధిపరచే కార్యక్రమాన్ని, ప్రభుత్వ పరిపాలనను సూక్ష్మీకరించు కార్యక్రమాన్ని అమలు జరిపింది. అదే సమయంలో ప్రాకృతికమైన దుస్సంఘటనలు సంభవించినచో, వాటిని నివారించుకొనుటకై వ్యవసాయకోత్పత్తిని అభివృద్ధి జేసుకోటానికి తమంతతాము సంఘటిత పడుటకై ప్రజలను నడిపింది. వ్యవసాయకోత్పత్తి అభివృద్ధి జేయాలన్న ఉద్యమంతోపాటు కౌలు రేట్లను వడ్డీరేట్లను తగ్గించాలన్న వుద్యమాన్ని పెద్దపెట్టున సాగించుటకై మనపార్టీ రైతాంగ ప్రజలను నడిపింది. నూతన పరిస్థితిలో శత్రువునకు వ్యతిరేకంగా పోరాడుటకై విముక్త ప్రాంతాలలో ప్రజాసైన్యాన్ని అమోఘంగా అభివృద్ధి జేసింది. "సర్వనాశన యుద్ధానికి వ్యతిరేక" పోరాటాలను నడుపుటతో విముక్త ప్రాంతాల ప్రజలు, సైన్యమూ, విముక్త ప్రాంతాలను విస్తరింప జేయుటకు, పునరుద్ధరించుటకొరకు పోరాటాలను నడుపుటకై శత్రువులవెనుక భాగంలో చొచ్చుకొనిపోవుటకై సాయుధమైన వర్కి టీములను (సాయుధమైన పనివాళ్ల దళాలను) పంపిరాయ్. అలాంటి కృషిఫలితంగా కష్టాలన్నింటినీ దాటగలిగేం. విముక్త ప్రాంతాలు మరింతగా దృఢతర మయ్యాయి. 1943 సంవత్సరం నుండి క్రమంగా విముక్త ప్రాంతాలు మరింతగా విస్తరించసాగేయ్.

పరిస్థితిలో స్వల్ప మార్పున్న యీ కాలంలో పార్టీ యావత్తులోనూ మార్క్సిస్టు - లెనినిస్టు అధ్యయనాన్ని

నడుపుటకై తన కాలాన్ని మనపార్టీ వినియోగించింది. యుద్ధము విప్లవమూ సత్వరంగా అభివృద్ధి జెందుతున్నప్పుడు లేక త్వరితంగా మార్పులు కలుగుతున్నప్పుడు అలాంటి అధ్యయనాన్ని సాగించటం కొన్ని సమయాలలో చాలా కష్టమయ్యింది. పార్టీలో మార్క్సిజం - లెనినిజం ముసుగుక్రింద దాగొని అమలులోనున్న పెట్టీ బూర్జువావర్గ అభిప్రాయాలను పసికట్టుటకు అధిగమించుటకు అందులో ప్రత్యేకంగా స్వీయప్రభావతత్వధోరణులను(Subjectivism - సబ్జెక్టివిజం) పాక్షికతత్వధోరణులను (సెక్టేరియన్) వాటి వ్యక్తీకరణరూపం ఒకేరకంగా పార్టీపదజాలాన్ని ప్రయోగించేతత్వానికి సంబంధించిన ధోరణులను పసికట్టుటకు, అధిగమించుటకు పార్టీ పనిలో తప్పుడుధోరణులను అధ్యయనాలలోనూ, వ్రాతలలోనూవున్న తప్పుడుధోరణులను పనివిధానాలలో తప్పుడు ధోరణులను సరిదిద్దుటకై కార్యకర్తలు, పార్టీ మెంబర్లను మనపార్టీ నడిపింది. ఈ అధ్యయనవుద్యమంలో కామ్రేడ్ మాసీయూంగ్ యిచ్చిన వుపన్యాసాలు—"మన అధ్యయానలను సంస్కరించండి; మనపార్టీయొక్క పనివిధానాల దిద్దుబాటు; పరివర్తనారహితమైన పార్టీ పదజాల ప్రయోగాన్ని వ్యతిరేకించండి; కళలు, సారస్వతంపై యేనాన్‌లోజరిగిన సమావేశంలో యిచ్చిన వుపన్యాసాలు:"—అనేవీ, కామ్రేడ్ లీషావ్‌చీ యిచ్చిన వుపన్యాసాలైన— మంచికమ్యూనిస్టుగావుండేదెలా?; పార్టీఆంతరంగికపోరాటం; అన్నవి యెంతో ప్రముఖపాత్రను వహించాయ్; 1931 సంవత్సరంనుండి పార్టీలో పలుకుబడికలిగియున్న సైద్ధాంతికతత్వాన్ని (డాక్ట్రినైరిజం)

యీ అధ్యయనవుద్యమదశ తుడిచివైచింది. పెట్టీ-బూర్జువా మేధావి వర్గమూలాన్ని కలిగియున్ననూ తన పార్టి మెంబర్లు అనేకమంది తమ పూర్వపు పెట్టీ-బూర్జువావర్గవైఖరిని విసర్జించుటకు శ్రామికవర్గ దృక్పథాన్ని చేపట్టుటకు చేయూత నిచ్చింది. తత్ఫలితంగా పార్టి సైద్ధాంతికంగా అమోఘంగా పురోగమించుటకు, పూర్వంకన్న సమైక్యమవుటకు దోహద మిచ్చినది. కఠినమైనకష్టాలు, పోరాటాలద్వారా చైనాకమ్యూ నిస్టుపార్టి ఆవిధంగా పురోగమిస్తూవుంటే కొమింటాంగ్ పరిపాలన నానాటికి లంచగొండితనపు వూబిలోదిగపడిపోవాల్సివచ్చింది. కొమింటాంగ్ తన రాజకీయపరిస్థితినుండి లాభంపొందుతూ, అందులో ప్రత్యేకంగా, ప్రతిఘటనయుద్ధాలనుండి లాభం పొందుతూ, ద్రవ్యోల్బణం, (ఇన్ ఫ్లేషన్) యిలాంటివాటినుండి లాభం పొందుతూ, అంతులేని ధనాన్ని కూడబెట్టుకొంది. చైనా ఆర్థిక విధానంపైననూ, వ్యాపారంపైననూ, పరిశ్రమల పైననూ, వ్యవసాయంపైననూ అధికారాన్ని వహించింది. నాలుగు కుటుంబాల నాయకత్వాన అంటే, చియాంగు కై-షేక్; టి. వి. సూంగ్, హెచ్. హెచ్. కుంగు, చెన్-లీఫూ, నాయకత్వాన జమీందారీవిధాన, దళారీ విధాన, సైనికవిధానాల గుత్తాధికార పెట్టుబడిదారీ విధానాన్ని అంటే "నిరంకుశపెట్టుబడిదారీ విధానాన్ని" త్వరితంగా అభివృద్ధి జేసింది.

కొమింటాంగుయొక్క యీ నిరంకుశపెట్టుబడిదారీ విధానం, కార్మికవర్గ ప్రయోజనాలతోనూ, రైతాంగప్రజల ప్రయోజనాలతోనూ, పట్టణపెట్టీ - బూర్జువావర్గ ప్రయోజ

నాలతోనూ జాతీయ బూర్జువావర్గ ప్రయోజనాలతోనూ - కొమింగుటాంగు పాలిత ప్రాంతాలలోని యావన్మంది ప్రజల ప్రయోజనాలతో తీవ్రంగా సంఘర్షించింది. జపాను వ్యతిరేక యుద్ధకాలంలో ప్రజలు, తీవ్రదుర్భర పరిస్థితులలో తమ జీవితాలను వెళ్ళబుచ్చవలసి వచ్చుటచేతనూ, రాజకీయ స్వాతంత్ర్యం యేమాత్రమూ లేకపోవుటచే తనూ, తమ దుర్భరపరిస్థితులనుగురించి పెద్దగా, బిగ్గరగా అరవసాగారు. అనేక తావులలో తిరుగుబాట్లు జరిగాయి. చియాంగ్ - కై - షేక్, తాను భ్రష్టయిపోవుటయేగాక, ప్రజలనుండి వేరైపోవుటయేగాక, 1943 సంవత్సరంలో, "ఐక్యతను" కమ్యూనిస్టుపార్టీ విచ్ఛిన్నం జేసిందని నీలాపనిందలువేస్తూ, మరల కమ్యూనిస్టుల అధీనంలో నున్న షెన్సీ - కాన్సూ - నింగ్షియా సరిహద్దు ప్రాంతాన్ని ముట్టడించుటకై పెద్ద సైన్యాలను ఆ ప్రాంతం పైకి తరలించాడు. ఇది కొమింటాంగుయొక్క మూడవ కమ్యూనిస్టు వ్యతిరేక దండయాత్ర. ఏమైనప్పటికి చైనా కమ్యూనిస్టుపార్టీ చియాంగ్ కుట్రలను ముందుగాకే బట్ట బయలు చేయుటచే ముందుగానే బహిరంగంగా ఖండించుటచే దేశంలోని యావన్మంది ప్రజలూ వ్యతిరేకించుటచే చియాంగ్ తన దండయాత్రను ఆపివేయాల్సి వచ్చింది. యావత్తు యుద్ధం లోనూ, యుద్ధశ్రేణులకు వెనుక భాగంలో తానువుంచిన లక్షలాది సైన్యాలపై ఆధారపడవచ్చునని చియాంగ్ యింక నూ భావించసాగేను. తన అభివృద్ధి నిరోధకవిధానం యేనాడో తన సైన్యాలనే నైతికంగా దిగజార్చిందన్న విషయాన్ని

చియాంగ్ గుర్తించలేరు. ఈ విషయం 1944 సంవత్సరంలో జపాను సామ్రాజ్యవాదులు తమ నూతన విజృంభణను సాగించినప్పుడు పూర్తిగా బయటపడింది.

1944 సంవత్సరమంటే ఫాసిస్టు వ్యతిరేక ప్రపంచ యుద్ధంయొక్క విజయాభివృద్ధి సంవత్సరమది. వీర సోవియట్ సైన్యంయొక్క ఎదురుదాడుల క్రింద నలిగిపోయి హిట్లరు ముఠా పతనం తథ్యమవుతున్న సంవత్సరమది. అంతేగాక జపాను సామ్రాజ్యవాదుల నూతన విజృంభణను ఎదుర్కొనలేక కోమింటాంగు సైన్యాలు తీవ్రంగా దెబ్బతింటున్న సంవత్సర మది. పసిఫిక్ మహాసముద్ర ప్రదేశాలలో జపాను సామ్రాజ్యవాదుల స్థితి నానాటికి మరింత క్లిష్టదశలో పడింది. పెకింగ్ నుండి కాంటన్, నాన్ కింగులవరకుగల రవాణా మార్గాలను తెరువాల్సిన అవసరం జపాను సామ్రాజ్య వాదులకు యేర్పడింది. దీనికై, 1944 మార్చిలో ముందుభాగపు యుద్ధరంగాలపై జపాను సామ్రాజ్య వాదులు, నూతన విజృంభణ సాగించేరు. ఈ ప్రాంతాలలోనున్న కోమింటాంగ్ సైన్యాలు కాలికి బుద్ధిచెప్పుటచే ఎనిమిది మాసాలలోనే జపానుసామ్రాజ్యవాదులు, హోనాన్, హూనాన్, క్వాంగ్సి, క్వాంగ్ టంగ్, ఫుకైన్ రాష్ట్రాలలోని అధికభాగాన్ని క్వైచౌ రాష్ట్రంలో ఒక భాగాన్ని తేలికగా ఆక్రమించగలిగేరు; ప్రజలకు అపారమైన నష్టాలను కలుగజేసేరు.

ఫాసిస్టు - వ్యతిరేక - ప్రపంచయుద్ధంలో సాధించబడిన ఘనవిజయాలచే ప్రోత్సాహితులై అందులో ప్రత్యేకంగా సోవియట్ యూనియన్ సాధించిన అఖండవిజయాలను జూచి

ప్రోత్సాహితులై చైనా ప్రజల విముక్తప్రాంతాల యుద్ధరంగాలలో విజయవంతమైన అభివృద్ధినిజూచి ప్రోత్సాహితులై, యావజ్జాతికి జెందిన ప్రజలు, కొమింటాంగ్ యొక్క అభివృద్ధి నిరోధక పరిపాలనను జూచి సహించలేకపోయారు. కొమింటాంగ్ పాలితప్రాంతాలలో ప్రజలప్రజాతంత్రపోరాటాలు, ప్రజాతంత్ర పార్టీల గ్రూపుల కార్యకలాపాలు క్రమంగా హెచ్చుస్థాయికి పోసాగేయి. కొమింటాంగ్ ప్రభుత్వాన్ని ఒక ప్రజాతంత్ర మిశ్రమప్రభుత్వంగా పునర్నిర్మించాలని దేశభక్తి ప్రేరితులైన ప్రజలందరూ ఏకగ్రీవంగా ఆమోదించసాగేరు.

ప్రజాస్వామ్యానికై చైనా ప్రజలపోరాటం, యేమైనప్పటికినీ, విదేశసామ్రాజ్యవాదుల జోక్యంయొక్క ఒక నూతన రూపాన్ని ఎదుర్కొనవలసివచ్చింది. ప్రజల తీవ్రద్వేషాన్ని చూరగొన్న, పతనమవుతున్న కొమింటాంగ్ పరిపాలకులకు, ఆనాటికి పసిఫిక్ మహాసముద్ర యుద్ధంలో పైచేయిని సంపాదించిన అమెరికను సామ్రాజ్యవాదుల అండ లభించింది; 1944 సెప్టెంబరు మాసంలో, చుంకింగ్‌లో కొమింటాంగ్ పిలిచిన పీపుల్స్ పొలిటికల్ కౌన్సిల్ సమావేశంలో చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధియైన కామ్రేడ్ లిన్‌పోచూ, జాతీయ వ్యవహారాలను పరిష్కరించుటకూ, కొమింటాంగ్ నియంతృత్వాన్ని రద్దుజేసి, దానిస్థానంలో ప్రజాతంత్ర మిశ్రమ ప్రభుత్వాన్ని స్థాపించుటకు, సత్వర సమావేశాన్ని ఒకదానిని జరుపాలని, డిమాండు జేసాడు. అమెరికను సామ్రాజ్యవాదులచే రహస్యంగా పూతమివ్వబడిన కొమింటాంగ్ అభివృద్ధినిరోధకులు, చైనా కమ్యూనిస్టుపార్టీ మరియు, ఇతర ప్రజా

తంత్ర పార్టీల, గ్రూపుల యీ డిమాండ్లను నిరంకుశంగా విసర్జించారు.

1941 సంవత్సరంలో పసిఫిక్ యుద్ధం ప్రారంభం కాకపూర్వం, చైనాను బలిపెట్టి, జపాను దురాక్రమణదారులతో రాజీపడాలని అమెరికను సామ్రాజ్యవాదులు సర్వ విధాల యత్నించేరు.

యుద్ధానంతరం చైనా మార్కెట్లను తమ గుత్తాధికారం క్రిందికి తెచ్చుకొనుటలోనూ, చైనాను తమ వలస రాజ్యంగా చేసుకొనుటలోనూ, జపాను సామ్రాజ్యవాదుల స్థానాన్ని ఆక్రమించాలన్న ఆశతో అమెరికను సామ్రాజ్యవాదులు జపాను దురాక్రమణ వ్యతిరేక ప్రతిఘటనయుద్ధాన్ని అవకాశంగాతీసుకొని యీనాడు చైనాలో తమ పలుకుబడిని విస్తరించుకొన జూచారు. ఇందుకై కొమింటాంగు అభివృద్ధి నిరోధక పరిపాలనను అన్ని విధాలా నిలబెట్టాలని తాపత్రయపడసాగారు. ఒకవైపున చియాంగ్ సైన్యాలకు శిక్షణయిచ్చుటకు, సాయుధంచేయుటకు తమ ఆఫీసర్లను అసంఖ్యాకంగా అమెరికను సామ్రాజ్యవాదులు పంపేరు. చియాంగ్ ప్రభుత్వంలో దూరిపోవలసినదిగా అనేకమంది ఆరితేరిన ఘటాలను పంపారు, మరియొకవైపున కొమింటాంగు, కమ్యూనిస్టులకు మధ్య "రాయబారాలను" నడుపుటద్వారా "గౌరవనీయమైన దళారులుగా" పనిచేయసాగేరు. కాని చియాంగ్‌స్థితి యెలాంటిదో తమ స్థితి యుంతేయన్న సత్యాన్ని అమెరికను సామ్రాజ్యవాదులు ఎక్కువకాలం దాచలేక పోయారు; అమెరికను సామ్రాజ్యవాద ప్రతినిధులు చియాంగ్-కై-షేకు యీ

యిద్దరూకూడా తమ అభి అభివృద్ధి నిరోధక ప్రభుత్వంలో పాల్గొనవలసిందిగా కొంతమంది కమ్యూనిస్టులను సమైక్యతను సాధించుటకై దానిని ప్రజాతంత్రమైనదిగాచేయాలన్నతలంపుతో "ఆహ్వానించాలసి" యత్నించారు; అంతేగాక అలాంటి కుత్రిమమార్గంద్వారా ప్రభుత్వాన్ని ప్రజాతంత్రమైన మిశ్రమ ప్రభుత్వంగా పునర్నిర్మించాలన్న చైనాకమ్యూనిస్టుపార్టీ డిమాండును రద్దుచేయాలని చూసారు. అంతేగాక అష్టమ సైన్యాన్ని నూతన నాల్గవ సైన్యాన్ని విముక్తప్రాంతాలను నాశనంజేయుటకై యీజిత్తును ప్రయోగించారు చియాంగు అమెరికనుసామ్రాజ్యవాదుల జిత్తులమారి ప్రతిపాదనను, చైనాకమ్యూనిస్టుపార్టీ విసర్జించగానే చియాంగూ, అమెరికను సామ్రాజ్యవాదులు కలసి విముక్తప్రాంతాలలోని సైన్యాలను "పునర్నిర్మించుటకై" ముగ్గురు మెంబర్లతోకూడిన కమిటీని,— అందులో అమెరికను ఒకడు,—వేద్దామని మరియొక్క జిత్తుల మారి ప్రతిపాదనను జేసారు. అదేకాలంలో అమెరికన్ సామ్రాజ్యవాదుల ప్రతినిధియైన పాట్రిక్ జె. హర్లే, అమెరికన్ ప్రభుత్వం చియాంగ్‌ప్రభుత్వంతో సహకరిస్తుందిగానీ, చైనా కమ్యూనిస్టుపార్టీతో సహకరించదని బెదరిస్తూ ప్రకటించాడు. స్వాతంత్ర్యం ప్రజాతంత్రాలకొరకు డిమాండు చైనాప్రజల సుదీర్ఘమయమైన పట్టుదలను, అమెరికను సామ్రాజ్యవాదుల, చియాంగ్‌కైషేకుల బెదరింపులు, వంచన, కదలించలేక పోయాయ్. అంతేగాక. చైనాప్రజలవిముక్తియొక్క పురోగామిక ఆశయాన్ని ఆటంకపరచలేకపోయాయ్.

1945 ఏప్రియల్ 24వ తారీఖున, యేనాన్ నగరంలో,

చైనా కమ్యూనిస్టుపార్టీ తన ఏడవపార్టీ కాంగ్రెసును జరిపింది; 1,210,000 మంది పార్టీ మెంబర్లకు ప్రాతినిధ్యం వహిస్తున్న 208 మంది పలహాదారీ డెలిగేట్లు, 544 మంది డెలిగేట్లు యీ కాంగ్రెసుకు హాజరయ్యారు. "మిశ్రిమ ప్రభుత్వాపై" కామ్రేడ్ మావోసీటూంగ్ యిచ్చిన రిపోర్టునూ, "విముక్తి ప్రాంతాలలోని యుద్ధరంగాలపై" కామ్రేడ్ ఛూతే యిచ్చిన మిలిటరీ రిపోర్టును, "పార్టీ నిర్మాణంపై" కామ్రేడ్ లీషావ్‌చీ యిచ్చిన నిర్మాణ సంబంధమైన రిపోర్టునూ, పార్టీ కాంగ్రెసు విన్నది, ఏకగ్రీవంగా ఆమోదించింది. పార్టీకాంగ్రెసు, నూతన పార్టీ నియమావళిని ఆమోదించింది, కామ్రేడ్ మావోసీటూంగ్ నాయకుడుగా ఒక నూతన కేంద్రకమిటీని ఎన్నుకొంది.

తన ఏడవపార్టీ కాంగ్రెసులో చైనా కమ్యూనిస్టుపార్టీ అపూర్వ దృఢత్వాన్ని ఐక్యతను ప్రదర్శించింది. 1935 జనవరిలో జరిగిన తున్‌యీ కాన్ఫరెన్సు నాటినుండి పార్టీ కేంద్రకమిటీ సర్వనాయకత్వం క్రింద చైనా విప్లవం విజయవంతంగా అభివృద్ధి జెందుటయే పార్టీ అపూర్వ దృఢత్వానికి సమైక్యతకు ప్రధానకారణం. ఏడవపార్టీ కాంగ్రెసునకు పూర్వం పార్టీయొక్క చారిత్రక అనుభవాలపై ఆధారపడి కార్యకర్తలలో చర్చలు జరిపించుటవల్లనూ కార్యాచరణ విధానాల సవరింపుకై 1942 సంవత్సరంలో పార్టీ యావత్తులోనూ ఒక వుద్యమాన్ని నడిపించుటవల్లనూ, ఆరవపార్టీ కాంగ్రెసుచే ఎన్నుకోబడిన కేంద్రకమిటీయొక్క ఏడవ విస్తృత సమావేశం "అనేక చారిత్రక సమస్యలపై నిర్ణయాలను" ఆమోదించుట వల్లనూ, యివన్నీ పార్టీలో సమైక్యతను పటి

ష్టం చేయుటలో అత్యంత ప్రధానమైన చురుకైన పాత్రను వహించేయ్. ఏడవపార్టీ కాంగ్రెసు నూతన ప్రజాతంత్ర విప్లవ కాలానికి సంబంధించిన పార్టీ సాధారణమైన సుస్పష్టమైన కార్యక్రమాలను, పార్టీ సాధారణ కార్యక్రమాన్ని ఏకగ్రీవం గా ఆమోదించింది. ఏడవపార్టీ కాంగ్రెసు, ప్రస్తుత అంతర్జాతీ యపరిస్థితులను దేశీయ పరిస్థితులను సవ్యంగా వివరించింది. అంతేగాక ప్రతిఘటన యుద్ధంలో అంతిమవిజయాన్ని చేపట్టు టకై ప్రజాతంత్రమైన మిశ్రమ ప్రభుత్వాన్ని స్థాపించుటకై యావత్తు పార్టీయూ దేశంలోని ప్రజలందరూ పోరాడ వలసిందిగా పిలుపుయిచ్చింది. జాతీయవిజయాన్ని సాధించు టకు ఆయత్తమవుటకై మనపార్టీయావత్తూ పట్టణాలలో మన కార్యక్రమాన్ని సకాలంలో పటిష్టంచేయుటకై అందులో ముఖ్యంగా నగరాలలోని కార్మికవర్గంలో మన కార్యక్ర మాన్ని పటిష్టంచేయుటకై తనదృష్టిని కేంద్రీకరించవలసినదిగా ఏడవపార్టీ కాంగ్రెసు ఆదేశించింది. చైనాప్రజలు, చైనా కమ్యూనిస్టుపార్టీనాయకత్వంక్రింద యీనాటికే యుద్ధకాలంలో 19 విముక్తప్రాంతాలను - తొమ్మిదికోట్ల యాభైవిములక్షల ప్రజలుకలిగియున్న 19 విముక్తప్రాంతాలను - తొమ్మిదిలక్షల పదివేలమంది సైనికులుగలిగిన ప్రజావిముక్తిసైన్యాన్ని (అష్టమసైన్యం, నూతన నాల్గవసైన్యం, ఇతరమైన జపాను-వ్యతిరేక- ప్రజాసైనికదళాలతోసహా) యిరువైరెండులక్షల మందిగలిగిన యుద్ధంలోనూ, ఉత్పత్తిలోనూ వరుసగా పాల్గొనుచున్న ప్రజాసైన్యాన్ని సృష్టించుకొన్నారనీ, మన ఏడవ పార్టీకాంగ్రెసు యెత్తిచూపింది.

1944 తర్వాత ప్రజావిముక్తిసైన్యం, పాక్షికవిజృంభణ పోరాటాన్ని సాగించింది. 1937 సెప్టెంబరునుండి 1945 మార్చి వరకూ, శత్రువునకు వ్యతిరేకమైన ఒకలక్షా పదిహేనవేలకు పైబడిన చిన్న, పెద్ద పోరాటాలలో ప్రజావిముక్తిసైన్యం పాల్గొంది. 960,000 మంది శత్రుసైనికులను హతమార్చటం గానీ, లేక గాయపరచటంగానీ చేసింది; 2,80,000 మంది జపానుసామ్రాజ్యవాదుల సైనికులను, కీలుబొమ్మసైనికులను ఖైదీలుగా పట్టుకొంది; 1,00,000 మంది జపానుసైనికులను, కీలుబొమ్మసైనికులను లొంగిపోయేటట్లు చేయడంగాని లేక, పారిపోయేటట్లుగానీ చేసింది.

చైనాలోని అధికసంఖ్యాకమైన, ప్రధాన నగరాలను, రవాణామార్గాలను సముద్రతీర ప్రాంతాలను, ప్రజావిముక్తి సైన్యం తన ఆధీనంలోనికి తెచ్చుకొంది. ప్రతిఘటనయుద్ధంలో విజయాన్ని సాధించాలన్నా, ప్రజాతంత్రఆశయానికి విజయాన్ని సాధించాలన్నా అఖండశక్తి సమేతమైన ప్రజావిముక్తి సైన్యంపైననూ, యావజ్జాతీయ ప్రజాఐక్యతపైననూ ఆధారపడుటద్వారా సాధింపబడగలదని, రుజువయ్యింది. దేశంలోనూ, అంతర్జాతీయంగానూ, అభివృద్ధి నిరోధకు లింకనూ వుండుటచే, వారు జాతీయ అంతర్యుద్ధాన్ని రేపెట్టే ప్రమాదంగలదనీ, సామ్రాజ్యవాదులు జోక్యం కలుగజేసు కొనే ప్రమాదం గలదనీ, అందువలన ప్రజలందరూ, జాగరూకులై వుండాలనీ, మన ఏడవపార్టీ కాంగ్రెసు హెచ్చరించింది.

చైనా కమ్యూనిస్టుపార్టీయొక్క ఏడవపార్టీ కాంగ్రెసు

పూర్తిఅయిన తర్వాత, జపాను దురాక్రమణదారులకు వ్యతిరేకంగా, ప్రజావిముక్తిసైన్యం జరిపిన ఎదురుదాడులు సత్వరంగా పురోగమించ సాగేయ్. ఆగస్టు 8వ తారీఖున సోవియట్ యూనియన్ జపానుకు వ్యతిరేకంగా యుద్ధాన్ని ప్రకటించింది; ఆవిధంగా చైనాదేశపు ప్రతిఘటన యుద్ధంయొక్క అంతిమదశ ప్రారంభమయ్యింది. సోవియట్ సైన్యం, జపాను సామ్రాజ్యవాదుల క్వాంటింగ్ సైన్యాన్ని త్వరగా తుత్తునియలు జేసింది; ఈశాన్య చైనాను విముక్తి జెందించింది. సోవియట్ సైన్యాలతో సహకరించుతూ, ప్రజావిముక్తి సైన్యాలు, జపాను సామ్రాజ్యవాదుల సైన్యాలకు, కీలుబొమ్మ సైన్యాలకు వ్యతిరేకంగా పోరాడి, వాటిని మట్టుపెట్టినాయ్; ఇంతవరకూ జపాను దురాక్రమణదారులచే ఆక్రమించబడిన పెద్దరకపు, మధ్యరకపు నగరాలను విముక్తి జెందించాయ్.

ఆగస్టు 14 వ తారీఖున జపాను సామ్రాజ్య వాదులు బేషరతులుగా లొంగిపోతున్నామని ప్రకటించారు. జపాను సామ్రాజ్యవాదులు లొంగిపోయిన తర్వాత వారిని "స్థానిక భద్రతను కాపాడవలసినదిగానూ" తమ్ము చక్రబంధంలో బిగించియున్న ప్రజావిముక్తి సైన్యాలను ఎదిరించి పోరాడవలసినదిగానూ, కొమింటాంగు సైన్యాలు వచ్చునంతవరకు వేచియుండవలసినదిగానూ, జపాను దురాక్రమణ దారులకు అమెరికను సామ్రాజ్యవాదులు, చియాంగ్-కై-షేకు కలసి ఆజ్ఞలు జారీచేసారు. యదార్థానికి జపాను దురాక్రమణదారుల లొంగుబాటును అధికారికంగా స్వీకరించాలంటే చియాంగుని

సేనలు, ఆ సమయంలో జపానువారి సైన్యాల వెనక భాగానికి యెంతో దూరంలో వున్నాయ్. ఆ సైన్యాలు యిక్కడకు తరలి రావాలంటే ఎంతో కాలం పట్టుతుంది. జపాను దురాక్రమణదారులు ఆక్రమించుకొన్న పెద్దనగరాలను, ప్రధాన రవాణ మార్గాలను స్వాధీనం చేసుకొనుటకుగాను, చియాంగ్ సైన్యాలను ఆ ప్రాంతాలకు తరలించుటకై అమెరికను భూసైన్యాలు, విమానదళాలు, నౌకాదళాలు, అహోరాత్రులూ, శ్రమపడసాగేయ్. అమెరికను సైన్యం జపాను దురాక్రమణదారుల సైన్యం కీలుబొమ్మ సైన్యాల సహాయాలతో చియాంగ్ మరల ప్రతిఘటన యుద్ధానంతరం యావద్దేశంలోనూ "వున్నత" హోదాను పొందాడు;

చైనా ప్రజల ప్రతిఘటన యుద్ధంయొక్క అనుభవమంటే ఒక సామ్రాజ్య శక్తికి వ్యతిరేకంగా ఒక్క వెనుకబడియున్న పెద్దదేశంయొక్క పోరాటానుభవం. అంతేగాదు; దురాక్రమణకు వ్యతిరేకంగా ప్రతిఘటన సాగించుటకై చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంక్రింద శ్రామికవర్గం రైతాంగ ప్రజలు, పట్టణ పెట్టీ - బూర్జువా వర్గం, జాతీయ బూర్జువా వర్గం, భూస్వామిక వర్గంలోని ఒకభాగం దళారీ బూర్జువా వర్గంలోని కొంతమంది నిర్మించుకొన్న ఐక్యసంఘటనయొక్క అనుభవం. 1924 నుండి 1936 వరకూగల కాలంలో జరిగిన రెండు విప్లవాత్మక అంతర్యుద్ధాల కాలంలోనూ గడించుకొన్న రాజకీయ, సైనిక అనుభవాలను సరిగా వినియోగించుకొంది చైనా కమ్యూనిస్టుపార్టీ; చైనాదేశపు క్లిష్ట పరిస్థితిని చక్కగా వివరించింది. తన్మూలంగా పార్టీలోనున్న

పెడమార్గాలను సకాలంలో సరిదిద్దుకొనగలిగింది; సవ్యమైన రాజకీయ, సైనికపంథాను అనుసరించగలిగింది; దేశంలోని అభివృద్ధినిరోధకశక్తులను చావుదెబ్బ తీయగలిగింది; అఖండవిజయాన్ని సాధించగలిగింది; ఆవిధంగా రానున్న ప్రజల ప్రజాతంత్రవిప్లవంలో యావజ్జాతీయ విజయాన్ని సాధించుట కొరకు గట్టిపునాదులు వేయగలిగింది. శ్రామికవర్గంయొక్క సవ్యనాయకత్వంక్రింద అసంఖ్యాకప్రజానీకంయొక్క సంయుక్త పోరాటంపై ఆధారపడుతూ ప్రజల ఐక్యసంఘటనపై ఆధారపడుతూ ప్రజాయుద్ధంపై ఆధారపడుతూ వాటిద్వారా - సామ్రాజ్యవాదుల దురాక్రమణను వోడించవచ్చునని, జపాను దురాక్రమణకు వ్యతిరేకంగా జరిగిన చైనాప్రజల ప్రతిఘటన యుద్ధం రుజువుచేసింది. ఇది చైనాప్రజలకు ప్రపంచంలోని వలసదేశాలప్రజలకు అత్యంతప్రధానమైన సత్యం. అర్ధ-వలస, వలసదేశాలలోని ప్రజలపట్ల ఆంగ్లో-అమెరికను సామ్రాజ్యవాదులు, ఎల్లప్పుడూ శత్రుత్వవైఖరిని అవలంబిస్తారనీ, ప్రపంచ పీడితప్రజలను విశ్వసనీయంగా సపోర్టుచేయునది ఒక్క సోవియట్ యూనియన్ మాత్రమేననికూడా చైనాప్రజల ప్రతిఘటనయుద్ధం రుజువుచేసింది. సామ్రాజ్యవాదవ్యతిరేకమైన తమ పోరాటంలో ప్రపంచంలోని యేదేశపుప్రజల విజయానికైనా సోవియట్ యూనియన్ చేసిన సహాయం ప్రముఖమైనది. ఈ సత్యం చైనాప్రజలకు ప్రపంచంలోని వలసదేశాల ప్రజలకు అత్యంతప్రధానమైనది.

---

నాల్గవ అధ్యాయం

# మూడవ విప్లవాత్మక అంతర్యుద్ధం - చైనా ప్రజా రిపబ్లికు పునాది - ఆర్థిక పునర్నిర్మాణ కాలం

జపాను దురాక్రమణకు వ్యతిరేకంగా జరుపబడిన ప్రతిఘటన యుద్ధం ముగియగానే, చైనాలో వర్గ సంబంధాలలో క్రొత్త మార్పులు వచ్చాయి. ప్రతిఘటన యుద్ధకాలంలో, పెద్ద భూస్వాములకు, బడా బూర్జువావర్గానికి, ప్రాతినిధ్యం వహించిన కొమింటాంగ్ అభివృద్ధి నిరోధకులు, జపాను దురాక్రమణపట్ల, ఉపేక్షాపూరిత ప్రతిఘటన విధానాన్ని అవలంబించేరు. చైనా కమ్యూనిస్టుపార్టీ బలాన్ని క్షీణింప జేయగలమన్న దురాశతో, చైనా కమ్యూనిస్టుపార్టీపై చురుకుగా ప్రతిఘటన సాగించారు; జపాను సామ్రాజ్యవాదులను సోవియట్ యూనియన్, బ్రిటన్, అమెరికా, చైనా ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తున్న చైనా కమ్యూనిస్టు పార్టీలు కలసి వోడించిన తర్వాత, ఆ విజయఫలితాన్ని తాము పొందుతూ, కమ్యూనిస్టు పార్టిని నాశనం జేయుటకై దేశం మొత్తంమీద కమ్యూనిస్టు వ్యతిరేక యుద్ధాన్ని సాగించవచ్చునన్న దురాశతో, పూర్వ దేశంలోనూ తమ అంధయుగ రాక్షస పరిపాలనను స్థాపించవచ్చునుగదా యన్న దురాశతో, కొమింటాంగ్ అభివృద్ధి నిరోధకులు తమ బలాన్ని నిల్వ జేసుకొనసాగేరు. ఈ వుద్దేశంతోనే జపానును ప్రతిఘటించి, యుద్ధంజేయుటకై

విదేశాలు తమకు పంపిన ఆయుధాలన్నింటినీ, కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా వుపయోగించుటకై కొమింటాంగ్ అభివృద్ధి నిరోధకులు నిల్వజేసేరు. ఆవిధంగా ప్రతిఘటన యుద్ధం ముగియగానే అంతర్యుద్ధ సంక్షోభం రానున్నదని యావన్మంది చైనా ప్రజలు భయపడసాగేరు.

జపాను సామ్రాజ్యవాదులు లొంగిపోయిన తర్వాత చైనాలో యింతకుపూర్వం జపాను సామ్రాజ్యవాదులు ఆక్రమించుకున్న స్థానంలో దూరాలనీ విస్తారమైన చైనా మార్కెట్లపై అధికారాన్ని సంపాదించాలనీ చైనాదేశాన్ని అమెరికను వలసరాజ్యంగా మార్చుకోవాలనీ అమెరికను సామ్రాజ్యవాదులు యత్నించేరు. యత్నాన్ని కొనసాగించుకొనుటకై చైనా కమ్యూనిస్టుపార్టీ తన లక్ష్యాలకు అడ్డుపడుతూ వున్నది కాబట్టి అమెరికను సామ్రాజ్యవాదులు, చైనా కమ్యూనిస్టు పార్టీని నాశనం జేయుటకై యత్నించుచున్న కొమింటాంగ్ నకు సహాయం జేయాల్సి వచ్చింది. కమ్యూనిస్టు వ్యతిరేక అంతర్యుద్ధాన్ని సాగించుటకై కొమింటాంగ్ అమెరికా సహాయంపై ఆధార పడాల్సివచ్చింది. ఇది మూలంగా జేసుకొని అమెరికను సామ్రాజ్యవాదులకు కొమింటాంగునకు మధ్య సంబంధం మరింత చిక్కపడింది. ఈ దుష్టశక్తులు రెండూ కలసి విముక్త ప్రజా ప్రాంతాలపై పెద్దపెట్టున యుద్ధాన్ని సాగించుటకై యత్నాలు చేయసాగేయ్. వీరు భావించినదేమంటే ప్రజాముక్తి సైన్యంకన్న కొమింటాంగు సైన్యాలకు సంఖ్యారూపంలోనూ, ఆయుధ సంపత్తిలోనూ అధిక బలం వున్నదికదాయనీ, విముక్తప్రాంతాలకన్న కొమింటాంగు

పాలిత ప్రాంతాలలో ఎక్కువ జనాభా అధిక సంపత్తి మూలాలువున్నవిగదాయనీ, అంతేగాక అమెరికను ప్రభుత్వం తనసిగ్గుమాలినకార్యాన్ని సాధించుటకై కొమింటాంగ్ ప్రభుత్వానికి అంతులేకుండా ఆర్థికసహాయాన్ని, రాజకీయసహాయాన్ని, సైనికసహాయాన్ని అందజేస్తూవున్నదిగదా యనీ భ్రమపడ్డారు.

ప్రజలకు వ్యతిరేకంగా యుద్ధాన్ని సాగించటం, బడా బూర్జువావర్గానికి, లాభదాయకమైన వ్యాపారం - కొమింటాంగ్ యొక్క నిరంకుశ పెట్టుబడిదారులకు లాభదాయకమైన వ్యాపారం, జపానుసామ్రాజ్యవాదులు లొంగిపోయినతర్వాత, అంతకుపూర్వం చైనాప్రజలను కొల్లగొట్టి జపాను సామ్రాజ్యవాదులు విల్వజేసుకున్న సంపత్తిని "స్వాధీనంజేసుకోవటం" అన్న సాకుతో, చైనాదేశం · నాలుగు పెద్దకుటుంబాలైన చియాంగ్-కై-షేక్, టి. వి. సూంగ్, హెచ్. హెచ్. కూంగ్, చెన్-లీ-ఫూ దోపిడిగాళ్ళు, కనివిననంతిగా దోచ సాగేరు. పైనుదహరింపబడిన సంపత్తిని స్వంతం జేసుకోన సాగేరు. నూతన యుద్ధక్రమం · ద్రవ్యోల్బణం (యిన్ఫ్లేషన్) ద్వారా, పన్నులద్వారా, ఆహారధాన్యాల బలవంతిసేకరణద్వారా యితర ఆర్థికసంబంధమైన కంట్రోళ్ళ ద్వారా యీ నాలుగు పెద్దకుటుంబాలు ప్రజలరక్తాన్ని పిండేసినాయ్. పైనుదహరింపబడిన పెద్దకుటుంబాలలో ఒక్కొక్క కుటుంబం, వ్యక్తిగతంగా యీ కాలంలో రెండువేలకోట్ల అమెరికనుడాలర్లను సంపాదించింది.

ప్రతిఘటనయుద్ధకాలంలో కొమింటాంగ్ అనుసరించిన పాలసీ, ఒకవైపున కొమింటాంగునకు, మరియొకవైపున

కార్మికవర్గం. రైతాంగ ప్రజలు, పట్టణ పెటీ-బూర్జువావర్గం జాతీయబూర్జువావర్గముకు మధ్య విద్వేషాలను అధికతరం జేసింది. అనేక సంవత్సరాలుపాటు యుద్ధంవలన కలిగించిన యిబ్బందులు, కష్టాలకు. గురికావలసి వచ్చుటచే, దేశంలోని యావన్మంది ప్రజలు – అన్నివర్గాల ప్రజలు – యుద్ధమంటే విసిగిపోయేరు; తీవ్రంగా దెబ్బతిన్న తమ ఉత్పత్తి సామర్థ్యాన్ని పునరుద్ధరించుకొనుటకై, శాంతికావాలని, ఏకగ్రీవంగా కోర సాగేరు. ప్రతిఘటన యుద్ధం ముగియగానే, జాతీయ స్వాతంత్ర్యం, రాజకీయ ప్రజాతంత్రాలను సాధించాలని ప్రజలు డిమాండు చేసేరు. రైతాంగప్రజలు భూమిని కోరేరు. ప్రజల కోరిన యీ కోర్కెలన్నిటినీ కొమింటాంగ్ నిరాకరించుటయే గాక, అది ప్రజలను మరల అంతర్యుద్ధం దివాళాకోరుతనపు అగాధంలో పడద్రోయుటకు నిశ్చయించుకొంది. అమెరికనుసహాయాన్ని పొందాలన్న ఆశతో, కొమింటాంగ్, అమెరికను సామ్రాజ్యవాదులకు అన్నిరకాల వ్యాపార సంబంధమైన విశిష్టాధికారాలను యిచ్చింది; తత్ఫలితంగా, కొమింటాంగ్-పాలిత ప్రాంతాలలోని జాతీయ పరిశ్రమలు, వ్యాపారసంస్థలు, అమెరికను పెట్టుబడి, కొమింటాంగ్ నిరంకుశ పెట్టుబడిదారీ విధానాల రెండింటి వత్తిడిక్రింద నలిగి, నాశనమైపోయి, ఒక్కొక్క పరిశ్రమ, ఒకొక్క వ్యాపారసంస్థ ఒకదానితర్వాత మరియొకటిగా మూసివేసుకోవాల్సి వచ్చింది. వేలాది కార్మికులు నిరుద్యోగానికి గురిచేయబడ్డారు. చైనా దేశంలోనున్న సైనికాధికారులు, తదితర అమెరికను అధికారులు, చైనా ప్రజలను అగౌరవపరచ సాగేరు; అవమానపరచ సాగేరు,

అవిరామంగా, క్రూరదమననీతి పద్ధతులను అమలు జరుపుతూ కొమింటాంగ్ గూఢచారి సంస్థలు, ప్రజలను ప్రజాతంత్ర శక్తులను హింసించ సాగేయ్. కొమింటాంగ్ ప్రభుత్వం, తాను పాలించుచున్న ప్రాంతాలలోని రైతులను రాడీముఠాల ద్వారా వత్తిడి తీసుకొనివచ్చి బలవంతంగా సైన్యంలోనికి యీడ్చుకొనిపోయుంది. అంతేగాక రైతుల ధాన్యాన్నంతనూ బలవంతంగా దోయసాగింది. ఇక విముక్త ప్రాంతాలలో కొమింటాంగు జేసిన కుట్రలేమంటే విముక్త ప్రాంతాలలోని రైతాంగ ప్రజలనుండి వారు సంపాదించుకొన్న భూమిని గుంజుకోటానికై భూస్వాములను సంఘటిత పరచసాగింది.

కొమింటాంగు అభివృద్ధి నిరోధకులు, అంతర్యుద్ధానికై ప్లానులు వేసుకొని కూర్చున్నప్పటికినీ. అంతర్యుద్ధం అనివార్యంగా తయారైనప్పటికినీ; కొమింటాంగు అభివృద్ధి నిరోధకులు ప్రజలనుండి వేరైనప్పటికినీ, పరిపూర్ణ అంతర్యుద్ధం ప్రారంభ మవుటకుపూర్వం అన్నివిధాలా శాంతిని సాధించుటకు యత్నించాలని శాంతి కాముకులైన ప్రజలు కోరేరు. కొమింటాంగుతో విడిపోవాలని వారుకోరలేదు. కొమింటాంగు అమెరికాలనుగురించి భ్రమలు, కొమింటాంగులు, కమ్యూనిస్టులు అనుసరిస్తున్న మార్గాలుగాక మరియొక "మూడవ మార్గం" కలదనే భ్రమలు, యింకనూ జాతీయ బూర్జువా వర్గమూ దాని పార్టీలు, గ్రూపులలో వున్నాయ్. ఏమైనప్పటికినీ, చైనా కమ్యూనిస్టుపార్టీకి కొమింటాంగు, మరియు అమెరికను సామ్రాజ్యవాదులు అంతర్యుద్ధాన్ని గొనివచ్చుటకై చేస్తున్న కుట్రలనుగురించి చాలా కాలంనుండి బాగా పరిచ

యుంవుంది. అందువలన చైనా కమ్యూనిస్టుపార్టీ ఆ కుట్రల నెదుర్కొనుటకై, సైద్ధాంతికంగానూ, నిర్మాణాత్మకంగానూ, చక్కగా తయారయ్యింది. ఏమైనప్పటికినీ, కడపటి క్షణంలో కూడా శాంతిని రక్షించుటకై ప్రజలకు బోధపరచుటకై చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రతిఘటన యుద్ధం ముగియగానే, యుద్ధాన్ని నివారించుటకై, శాంతిని, ఐక్యతను సాధించుటకై ఒకమార్గాన్ని కనిపెట్టుటకుగాను ప్రజలను నడుపుటలో ఎంతో అమితంగా సహనాన్ని ప్రదర్శించింది; ఎంతోఘనంగా యత్నించింది.

ప్రతిఘటనయుద్ధం ముగియగానే 1945 ఆగస్టు 25 వ తారీఖున చైనాకమ్యూనిస్టుపార్టీయొక్క కేంద్రకమిటీ "ప్రస్తుత పరిస్థితిపై ప్రకటన" జేసింది; ఆ ప్రకటనలో చైనాకమ్యూనిస్టు పార్టీ, శాంతి,ప్రజాతంత్రం ఐక్యతలను కోరుతున్నామని స్పష్టీకరించింది. ఈ వాంఛితాన్ని నెరవేర్చుకొనుటకై, ఆగస్టు 28 వ తారీఖున కామ్రేడ్ మావ్‌సీటూంగ్, చుంకింగ్ నగరానికి వెళ్ళినాడు; ఒక నెలకు పైబడినకాలంపాటున కొమింటాంగ్ యొక్క చియాంగ్-కై-షేకుతో చర్చించాడు. అక్టోబరు 10 వ తారీఖున చివరకు యీ సమావేశఫలితాలు ప్రకటించబడ్డాయ్. ఆంతరంగికశాంతిని కాపాడుటకై తీసుకోవలసిన చర్యలపై, పైదానిలో అనేకవప్పందాలున్నాయ్; ఈ వప్పందాలు చేసుకొన్న కక్షిదారులలో తానొకటిగా చైనాకమ్యూనిస్టుపార్టీ యీ వప్పందాలను అమలుజరుపుటకు తయారుగా వుంది; అమలుజరుప సాగిందికూడాను. కాని రెండవకక్షిదారైన చియాంగ్-కై-షేకు యుద్ధాన్ని ప్రారంభించుటకు తాను

వేసుకొన్న ప్లానులను కప్పిపుచ్చుకొనుటకై యీ వప్పందాలను జిత్తులుగామాత్రమే చూచాడు. ఈ వప్పందాలైనతర్వాత చైనాకమ్యూనిస్టుపార్టీ, తన జాగృతిని సడలించగలదని భ్రమపడ్డాడు చియాంగ్. అంతేగాక, తాను హఠాత్తుగా కమ్యూనిస్టులపైన యుద్ధాన్ని సాగిస్తే ఒక అఖండవిజయాన్ని సాధించవచ్చునని చియాంగ్ భావించాడు. ఈ దుష్టవాంఛతో వప్పందాలను ప్రకటించగానే విముక్తప్రాంతాలపై దండయాత్ర సాగించాడు చియాంగ్. కాని చైనా కమ్యూనిస్టుపార్టీ మెలకువగానేవుంది. చియాంగ్ యొక్క సైనిక విజృంభణను చైనా కమ్యూనిస్టుపార్టి భిన్నాభిన్నం గావించింది.

చియాంగూ, అతని అమెరికను యజమానులూ తామింకా పూర్తిగా ఆయత్తమవలేదని తెలుసుకున్నారు. జపాను సామ్రాజ్యవాదులతో పోరాడకుండా తప్పించుకొనుటకుగాను ప్రతిఘటనయుద్ధకాలంలో చియాంగ్ తన సైన్యాలను ఎక్కడో మూలగా దూరంగా చైనాదేశపు వాయువ్య నైఋతి దిశలలో స్థాపరముంచాడు. జపాను సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా పోరాడిన ప్రజావిముక్తిసైన్యం జపాను వ్యతిరేక పోరాటరంగానికి దగ్గరలో చైనాదేశపు ఉత్తరభాగంలోనూ తూర్పుభాగంలోనూ ఈశాన్యభాగంలోనూ వుంది. అందువలన పరిపూర్ణ అంతర్యుద్ధాన్ని సాగించుటకై చియాంగ్ అతని అమెరికను యజమానులకు పరిస్థితి అనుకూలంగాలేదు. అంతేగాక ఆ సమయంలో వివిధ అంతర్యుద్ధరంగాలకు లక్షలాదిగా తనసైనికులను రవాణాచేయాలంటే చియాంగు శత్రువుచే ఆక్రమించబడియున్న నగరాలను రవాణామార్గాలను

సత్వరంగా తన అధీనంలోనికి తెచ్చుకోవలసివుంది. వీటన్నింటినీ చియాంగ్ తానొక్కడే చేయలేకపోయాడనుట యదార్థం. ఈ చర్యలన్నింటినీ నెరవేర్చుటలో చియాంగునకు సహాయపడుటకై జపానువారి లొంగుబాటును స్వీకరించుటకై అమెరికను సామ్రాజ్యవాదులు చైనాదేశపు అనేక సముద్రతీరప్రాంతాలలో తమ సైన్యాలనుదింపి ప్రజావిముక్తి సైన్యం జపాను ఆక్రమించుకొన్న చైనానగరాలను రవాణామార్గాలను స్వాధీనముచేసుకోకుండా చేసేరు అంతేగాక జపాను సైన్యాలనుండి పోగుజేసిన ఆయుధాలన్నింటినీ అమెరికను సామ్రాజ్యవాదులు చియాంగునకు అందజేసారు.

విముక్తప్రాంతాలను చుట్టుముట్టుటకై, అమెరికను సామ్రాజ్యవాదులు, పదిలక్షలనుండికి పైబడిన చియాంగ్ సైనికులను, విముక్తప్రాంతాలచుట్టూ, విమానాలద్వారాను, వోడలద్వారానూ, దింపేరు. ఈ విధంగా, విముక్తప్రాంతాలను చుట్టుముట్టుటకై వలసిన సన్నాహాలను చేసుకొనుటకై చియాంగు - కై - షేకు, చైనా కమ్యూనిస్టుపార్టీ వివిధ ప్రజాతంత్రపార్టీల గ్రూపుల చైనాప్రజలు పెట్టిన డిమాండును నామమాత్రంగా వప్పుకున్నాడు. 1946 జనవరి 10వ తారీఖున అతడు సంధిపత్రాన్ని ప్రకటించాడు. అన్నిపార్టీలు, గ్రూపులతోకూడిన రాజకీయ సమాలోచనసమావేశాన్ని (పొలిటికల్ కన్సల్టేటివ్ కాన్ఫరెన్సు) జరిపాడు. ఆసమయంలో, అమెరికను ప్రభుత్వం కూడా సంధిజేసుకొనవలసిందిగా చియాంగునకు సలహా యిచ్చింది. దీనికి కారణం లేకపోలేదు. దీనికి కారణమేమంటే, రాయబారాల ముసుగుక్రింద యుద్ధయత్నాలను

సాగించుకొనుటకై చియాంగ్ కై - షేకునకు తోడ్పడుటకై అంతర్యుద్ధాన్ని ఆపుటకై యత్నించుచున్నట్లు నాటకమాడుటకై, రాయబారాలు సాగించవలసినదిగా జార్జి. సి. మార్షల్‌ను, పాట్రిక్ - జె. హార్లే స్థానంలో అమెరికను సామ్రాజ్యవాదుల ప్రభుత్వం నియమించింది. సంధి ప్రకటింపబడినవెంటనే జపాను సామ్రాజ్యవాదుల లొంగుబాటుకాలంలో ఈశాన్య చైనాప్రాంతానికి వెళ్ళిన ప్రజావిముక్తిసైన్యంపై దాడులుజరుపవలసినదిగా చియాంగ్ తన సేనలను ఆజ్ఞాపించాడు. ఈశాన్య చైనా ప్రాంతంలోని విముక్త ప్రాంతాలకు జెందినచాంగ్ చున్-కిరిన్ లైనుకు దక్షిణంగానున్న విశాలమైన జిల్లాలను దక్షిణంలో ఆన్‌తుంగువరకు పశ్చిమాంలో చెంగ్‌తే వరకు విస్తరించిన విశాలమైన జిల్లాలను కొమింటాంగు సైన్యాలు, ఆక్రమించుకొనగలిగాయ్.

1946 జులైమాసంనుండి చియాంగ్ నియంత సంధి పత్రాన్ని పూర్తిగా చింపిపారేసాడు; రాజకీయ సమాలోచన సమావేశం (పొలిటికల్ కన్సల్‌టేటివ్ కాన్ఫరెన్సు) యొక్క తీర్మానాల నన్నింటిని భంగపరచాడు. విముక్త ప్రాంతాలకు వ్యతిరేకంగా సర్వనాశన యుద్ధాన్ని సాగించుటకై తన సైన్యాల నన్నింటినీ సమీకరించాడు. చియాంగ్ నియంత విముక్తప్రాంతాలకు జెందిన అనేకపట్టణాలను, నగరాలను, విశాలమైన గ్రామీణ జిల్లాలనూ, ఒకదాని తర్వాత మరి యొకటి ఆక్రమించాడు.

ఈ కాలంలో చైనా కమ్యూనిస్టుపార్టీ యేమిచేసింది? ప్రజలు శాంతిని, స్వాతంత్ర్యాన్ని సాధించాలంటే జీవించుటకు

తమహక్కును నిలబెట్టుకోవాలంటే వారు చియాంగ్-కై-షేకును కూలద్రోసి అమెరికను సామ్రాజ్యవాదులను పారద్రోలాల్సిన అగత్యాన్ని స్పష్టంగా అర్థం జేసుకొనుటకై శాంతి సాధనపట్లను చియాంగ్-కై-షేకు పట్లనూ, అమెరికను ప్రభుత్వంపట్లనూ ప్రజలకుగల భ్రమలను తొలగించి క్రమేణా వారు మేల్కొనునట్లు చేయుటకై చైనాకమ్యూనిస్టు పార్టీ యావద్దేశములోని ప్రజలలో ప్రబోధాత్మకమైన విశాలమైన ప్రచారాన్ని గావించింది. చైనా కమ్యూనిస్టుపార్టీ ఒకవైపున చియాంగ్-కై-షేకును, అమెరికనుసామ్రాజ్యవాదులను రాజకీయంగా ప్రజలనుండి దూరంజేసింది. మరియొకవైపున చియాంగ్-కై-షేకుయొక్క సైనిక విజృంభణలను తుత్తునియలు జేయుటకై తీవ్రయత్నాలు జేయుటకు ప్రజావిముక్తి సైన్యాన్ని నడిపింది చియాంగ్-కై-షేకుయొక్క దాడులను తప్పకుండా ఓడించుటేగాదు, ఓడించగలం అని చైనా కమ్యూనిస్టుపార్టీ గట్టిగా భావించింది. దీనికి కారణమేమంటే శత్రువువైన చియాంగునకుగల సైనిక బలాధిక్యతవలన కలిగే ఫలితాలు వానికి అమెరికను సామ్రాజ్యవాదులు చేస్తున్న సహాయంవలన కలిగే ఫలితాలు తాత్కాలికం మాత్రమే. ఇక యీ యుద్ధస్వభావంవలన కలిగే ఫలితాలు (యిదిన్యాయమైన యుద్ధమా? లేక అన్యాయయుద్ధమా? అన్న దానివలన కలిగే ఫలితాలు) ప్రజల వైఖరివలన కలిగే ఫలితాలు (యీ యుద్ధానికి ప్రజలు సానుభూతి చూపుతున్నారా? లేక వ్యతిరేకిస్తున్నారా? అన్నదానివలన కలిగే ఫలితాలు) స్థిరమైనవి. ఈ విషయాలను జాగ్రత్తగా పరిశీలిస్తే ఆంతరంగిక శాంతికై

చైనా కమ్యూనిస్టుపార్టీ గట్టి కృషిచేసిన ఫలితంగా పర్జా విముక్తి సైన్యానికే బలాధిక్యతవున్నదని స్పష్టమయ్యింది.

చియాంగ్ యొక్క ముట్టడులను వోడించుటకై కామ్రేడ్ మాసీయాంగ్ సరియైన సైనికవిధానాన్ని రూపొందించేడు. ఈ సైనిక విధానంయొక్క ప్రధానలక్ష్యమేమంటే శత్రువు యొక్క మానవశక్తిని (సైనిక సంఖ్యాబలాన్ని) హతమార్చటము, అంతేగాని నగరాలను, స్థావరాలను, స్థానాలను, దురాక్రమణనుండి రక్షించటంగాదు. ప్రతియుద్ధంలోనూ శత్రువును హతమార్చుటకై ప్రతియుద్ధానికి పూర్తిగా తయారుకావాలి. దానిఫలితం ముందుగానే నిశ్చయింపబడాలి, ప్రతి యుద్ధంలోనూ విజయాన్ని సాధించే విధంగా పూర్తి యత్నాలు చేయాలి. చక్రబంధ యుద్ధచర్యలను నడుపుటకు శత్రువును పూర్తిగా పరిమార్చుటకు, శత్రువుకన్న అనేకరెట్లు అమిత అధికంగా మనబలాన్ని కేంద్రీకరించాలి. తగినతయారు లేకుండాను ప్రమాదకరమైన యుద్ధాలను చేయరాదు.

కామ్రేడ్ మాసీయాంగ్ రూపొందించిన యీ సైనిక విధానాన్ని అనుసరించి యుద్ధముయొక్క ప్రథమదశలలో చైనా ప్రజా విముక్తి సైన్యం అనేకనగరాలను, స్థావరాలను, ఖాళీ జేసింది. కాని నెలకు ఎనిమిది బ్రిగేడ్లు చొప్పున అనేక కొమింటాంగు సైన్యాలను నాశనం జేసింది. కొమింటాంగు సైన్యాలనుండి పట్టుకొన్న ఆయుధాలతో ప్రజా విముక్తి సైన్యం తన సైనికులను సాయుధులుగా జేసింది. అంతేగాక తాను పట్టుకొన్న యుద్ధ ఖైదీలకు యదార్థ పరిస్థితులను బోధించి వారిని తన సైన్యంలో జేర్చుకొని ప్రజా విముక్తి సైన్యం

మరింత పటిష్టంగా తయారయ్యింది. ఆవిధంగా ప్రజా విముక్తి సైన్యం యుద్ధక్రమంలో నానాటికీ బలాధికంగా తయారయ్యింది. ఇక కొమింటాంగు సైన్యం విషయంజూస్తే అది నానాటికీ, బలహీన పడసాగింది. ఎనిమిది మాసాల కాలంలో తన సైనికుల సంఖ్యాబలం క్షీణించి పోగానే యిదిజూచి చియాంగ్-కై-షేకు, విముక్త ప్రాంతాలకు వ్యతిరేకంగా పరిపూర్ణ విజృంభణ దాడులకు స్వస్తిజెప్పి షాన్‌టుంగ్, ఉత్తరషెన్సీరాష్ట్రాలను లక్ష్యాలుగా పెట్టుకొని "కేంద్రీకృత విజృంభణదాడులను" సాగించేడు. షాన్‌టుంగ్, ఉత్తరషెన్సీ రాష్ట్రాలలో యుద్ధం తీవ్రంగా జరిగింది. దానిలో చియాంగ్ యొక్క "కేంద్రీకృత విజృంభణదాడులను", ప్రజావిముక్తి సైన్యాలు, పూర్తిగా భగ్నంగావించాయ్. అంతేగాదు, అదేకాలంలో ప్రజావిముక్తిసైన్యం ఈశాన్యచైనాలోనూ, షెన్సీ-చాహార్-హోపే ప్రాంతంలోనూ, షెన్సీ-హోపే-షాన్‌టుంగ్-హోనాన్ ప్రాంతంలోనూ ఎదురువిజృంభణ యుద్ధాలను సాగించింది. 1947 జులై మాసంనాటికి, చైనా ప్రజావిముక్తిసైన్యం మొట్టమొదటిసారిగా, షెన్సీ-హోపే-షాన్‌టుంగ్-హోనాన్ ప్రాంతంలో ఆత్మ-రక్షణయుద్ధస్థాయి నుండి విజృంభణయుద్ధస్థాయికి పోగలిగింది; ఎల్లోనదియొక్క దక్షిణతీరానికి దాటిపోయింది. యాంగ్సీనదియొక్క ఉత్తర తీరానికి పురోగమించింది. అంతట ఈశాన్యచైనాలోని ప్రజావిముక్తిసైన్యమూ, యితరరంగాలలోని ప్రజావిముక్తి సైన్యమూకూడా పెద్దయెత్తు విజృంభణయుద్ధాలను సాగించాయ్; ఆవిధంగా యుద్ధంయొక్క అన్నిరంగాలపరిస్థితిలోనూ,

ప్రధానమైనమార్పులు ప్రజావిముక్తిసైన్యంచే గొనిరాబడినాయ్; చియాంగ్-కై-షేకుయొక్క విజృంభణయుద్ధాలు, ఒక సంవత్సరానికిపైబడి కొద్దికాలంవరకు మాత్రమే సాగేయ్: కాని అవన్నీ పూర్తినాశనం గావించబడ్డాయ్.

యుద్ధంయొక్క ప్రథమదశలలో, తాముపొందిన విజయాలను జూచుకొని, అమెరికను సామ్రాజ్యవాదులు, చియాంగ్ కై - షేకు, మురియసాగారు. వారికివిజయాలతో అహంకారం పెరిగిపోయింది చైనా కమ్యూనిస్టుపార్టి, చైనా ప్రజలు కలసి, శాంతికై జేసిన ప్రతిపాదనలన్నీ, చియాంగ్ అమెరికను సామ్రాజ్యవాదులూ, విసర్జించారు. తత్ఫలితంగా, వారిబ్రతుకు యిరుకుగొందిలో బయటకుపోవుటకు వీలులేని గొందిలోపడినట్లుయింది. సైనికంగానూ, రాజకీయంగానూ, తల క్రిందులుగా, అంధప్రాయంగా గోతిలోదూకినట్లయ్యింది. ఆకాలములో ఉత్తరచైనాలోని, విముక్తప్రాంతంలోనున్న ప్రధాన నగరాలలో ఒకటైన కాలగాన్ నగరాన్ని, 1946 అక్టోబరు 11వ తారీఖున కొమింటాంగ్ సైన్యాలు ఆక్రమించాయి. అదేరోజు సాయంత్రాన చియాంగ్ - కై - షేకు, రాజకీయసమాలోచన సమావేశపు (పొలిటికల్ కన్సల్ టేటివ్ కాన్ఫరెన్సు) తీర్మానాలను, అతిక్రమించాడు. అమెరికను సామ్రాజ్యవాదుల ప్రత్యేక ప్రతినిధియైన, జార్జి - సి. మార్షల్, అమెరికను సామ్రాజ్యవాదుల రాయబారియైన, లైటన్ స్టూవార్టుల సలహాతో, చియాంగ్ - కై - షేకు, ఒక కృత్రిమ "జాతీయ ఎసెంబ్లీని" కాదు; జాతిని చీల్చిన, నియంతృత్వ "జాతీయ ఎసెంబ్లీని" ఏర్పాటు చేసాడు. పైవారిద్దరి ప్రోద్బలంతో,

చియాంగు నియంత, నవంబరు 15న తారీఖున, నియంతృత్వాన్ని స్థాపించుటయేగాక ఒక కృత్రిమ "రాజ్యాంగశాసనాన్ని" కూడా చేశాడు. కామ్రేడ్ మావోసీటుంగ్, ముందుగానే తన పుస్తకమైన "మిశ్రమప్రభుత్వం" అన్న దానిలో జోస్యం చెప్పినట్లుగానే విషయాలు రుజువు చేసాయి. చియాంగ్ - కై - షేకు, తీసుకున్న యీచర్య, "అతని కంఠానికి అతడే వురిత్రాడు తగిలించుకొన్నట్లయ్యింది".

ఈ "జాతీయ ఎసెంబ్లీకి" ప్రజాబలం లేకుండా పోయింది. 1947 మార్చి నెలలో కొమింటాంగు అభివృద్ధి నిరోధకులు నాన్‌కింగ్, షాంఘై, ఛుంగ్‌కింగ్ నగరాలలోనున్న తన ప్రతినిధివర్గాన్ని యేనానుకు పిలిపించివేసుకోవలసినదిగా చైనా కమ్యూనిస్టు పార్టీని వత్తిడిజేసేరు. ఇది జరిగినవెంటనే కొమింటాంగు సైన్యాలు ముట్టడిని ప్రారంభించి యేనానును ఆక్రమించాయ్. వీనితో శాంతియుత పరిష్కారంపట్ల ఆశలన్నీ భగ్నమయ్యాయి. జాతీయ బూర్జువా వర్గంతోసహా చైనా ప్రజలు తమ ఆశలన్నింటినీ, తమ సానుభూతిని, చైనా కమ్యూనిస్టుపార్టీపై కేంద్రీకరించుకున్నారు. జాతీయ బూర్జువావర్గంలోని మితవాద పక్షం "మూడవమార్గం" కొరకై చేసిన ప్రచారంకూడా దివాళాతీసింది. కొమింటాంగుయొక్క విప్లవాత్మక గ్రూపులు చైనా డెమాక్రాటిక్ లీగు, చైనాదేశపు డెమాక్రాటిక్ నేషనల్ కన్‌స్ట్రక్షన్ ఎసోసియేషను (చైనాదేశపు ప్రజాతంత్రి - జాతీయ నిర్మాణసంఘం) యితర డెమాక్రాటిక్ పార్టీలు, గ్రూపులు ప్రజలలో బాగా పేరుపడ్డ వ్యక్తులు, కొమింటాంగు అభివృద్ధి నిరోధకులతో సహకరించ

నిరాకరించారు. కృత్రిమ "నేషనల్ ఎసెంబ్లీ"లో గానీ, అభివృద్ధి నిరోధక ప్రభుత్వంలోగానీ, పాల్గొన నిరాకరించేరు. 1946 సంవత్సరాంతంలోనూ, 1947 సంవత్సరారంభంలోనూ చైనా దేశంలోని యావన్మంది విద్యార్థులు, అమెరికను సోల్జర్లు ఒక విద్యార్థినిని మానభంగం జేసినందుకు అసమ్మతి సూచకంగా ప్రదర్శనాలను జేసేరు. 1947 మే నెలలో తూమం అంతర్యుద్ధాలకు వ్యతిరేకంగా కొమింటాంగు ప్రభుత్వం జరుపుతున్న "దయ్యాలవేటకు" వ్యతిరేకంగా దేశంలోని విద్యార్థులందరూ, ప్రదర్శనాలు జేసారు. అనేక ప్రదేశాలలో, కార్మికులు, కర్షకులు, కొమింటాంగునకు వ్యతిరేకంగా అనేకపోరాటాలు నడిపారు. అమెరికను సామ్రాజ్యవాదులూ, కొమింటాంగ్ అభివృద్ధినిరోధకులూ, ప్రజలనుండి పరిపూర్ణంగా దూరమైపోయారనీ, చైనా కమ్యూనిస్టుపార్టీచే నడుపబడుచున్న నూతన ప్రజాతంత్ర విప్లవంయొక్క ఐక్యతాసంఘటన పూర్వంకన్న అతివిశాలంగానూ, అమితదృఢంగానూ, తయారైనదనీ, పై విషయాలు రూఢిజేస్తున్నాయి.

1947 అక్టోబరు 10వ తేదీన, చైనా ప్రజావిముక్తసైన్యం చైనా ప్రజలకు పిలుపిచ్చింది. దానిలో, అది చియాంగ్ - కై - షేకు ప్రభుత్వాన్ని కూలద్రోసి, నవచైనాను నిర్మించవలసిందిగా, చైనాప్రజలకు విజ్ఞప్తి జేసింది; చైనా ప్రజావిముక్తిసైన్యం, తరతరాలనుండి భూమి కావాలని కోరుతున్న రైతాంగప్రజల కోర్కెను తీర్చుటకుగాను, చైనా కమ్యూనిస్టుపార్టీ, ఆరోజుననే "చైనా వ్యవసాయక శాసనకార్యక్రమాన్ని" ప్రకటించింది. అందులో

జమీందారీ దోపిడీ విధానంపై ఆధారపడి యేర్పడిన పాత భూఖామందు తత్వాన్ని రద్దుచేయబడుననీ, దున్నేవారికే భూమినిచ్చు ఒక నూతనవిధానం స్థాపించబడుననీ, చైనా కమ్యూనిస్టుపార్టి ప్రకటించింది. విముక్తప్రాంతాలలో, చైనా కమ్యూనిస్టుపార్టి ప్రవేశపెట్టిన భూసంస్కరణవిధానం మూలంగా, విముక్త ప్రాంతాలలోని రైతాంగ ప్రజలు, పరిపూర్ణంగా ప్రోత్సాహితులయ్యారు తన్మూలంగా, విముక్త ప్రాంతాలలోని భూస్వామికవర్గం రద్దుచేయబడింది. ఆవిధంగా విముక్తప్రాంతాలు, మరింత దృఢతరంగా తయారయ్యాయి. ప్రజావిముక్తి యుద్ధానికి, ఘనంగా, సౌలభ్యాన్ని చేకూర్చి నాయి.

ఈ లోపల భూసంస్కరణవిధానాన్ని పరిపూర్ణంగా కొనసాగించుటకు ప్రజావిముక్తిసైన్యంయొక్క పోరాటశక్తిని పెంపొందించుటకు గ్రామీణప్రాంతాలలో ప్రజాతంత్రాన్ని పెంపొందించుటకు చైనా కమ్యూనిస్టుపార్టీ అన్నిస్థాయిలకు జెందిన పార్టీసంఘాలను దృఢతరంజేయుటకై ఒకవుద్యమాన్ని ప్రారంభించింది. అంటే పై వుద్యమఫలితంగా ప్రజావిముక్తి సైన్యంలోని సైనికుల వర్గచైతన్యస్థాయి పెరిగింది. గ్రామీణ ప్రాంతాలలోని పార్టి సంఘాలలో అపరిశుద్ధ మిశ్రమాన్ని (పార్టిసంఘాలలో జేరిన చెత్తరకపు మనుషులను తొలగించి వేయుటకు) సరిదిద్దబడింది. పని విధానాల అవలంబించే తప్పుడుపద్ధతులను సరిదిద్దబడింది.

నూతన విజయానికి ఆయత్తమవుటకై 1947 డిసెంబరులో ఉత్తర షెన్సీరాష్ట్రంలో చైనా కమ్యూనిస్టుపార్టి ఒక

సమావేశాన్ని ఏర్పాటుజేసింది. ఈ సమావేశంలో కామేడ్ మావోసీటుంగ్ "ప్రస్తుత పరిస్థితి మన కర్తవ్యాలపై" ఒక రిపోర్టునిచ్చేడు. కామేడ్ మావోసీటుంగ్ యీ రిపోర్టులో చైనా ప్రజావిప్లవయుద్ధం ఒక నిర్ణాయక స్థితికి జేరుకొందనీ, "చైనాలో నంద సంవత్సరాలనుండి పరిపాలన సాగిస్తున్న సామ్రాజ్యవాదాన్ని దాని పెరుగుదలనుండి మృత్యు కౌగిలి లోనికి తీసుకొనిపోతున్న నిర్ణాయక స్థితి"యనీ స్పష్టీకరించేడు. కామేడ్ మావోసీటుంగ్ చైనావిప్లవాత్మకయుద్ధం విజృంభణ దశను చేరుకొనగానే ఆకాలంలో పార్టీ ఎదుర్కొనునట్టి సైనిక, ఆర్థిక, రాజకీయ, వ్యవసాయకసమస్యలను గురించి, ఐక్య సంఘటన సమస్యలనుగురించి యెంతో విపులంగా వివరించేడు. భూసంస్కరణ వుద్యమకాలంలో సంభవించిన పెడమార్గాలవలన పరిశ్రమలకు, వ్యాపారానికి జరిగిన హానిని దృష్టిలో నుంచుకొని కామేడ్ మావోసీటుంగ్ తన రిపోర్టులో జమీందారీ వర్గాల భూమిని గుంజుకోవటం, దానిని రైతాంగానికి పంచి పెట్టటం, నిరంకుశ పెట్టుబడిదారుల పెట్టుబడుల నన్నింటినీ, గుంజుకోవటం, వాటిని నూతన ప్రజాతంత్ర ప్రభుత్వ పెట్టుబడిగానే చేసుకోవటం, జాతీయ పరిశ్రమలనన్నింటినీ, వ్యాపారాన్నంతటినీ రక్షించటం అనేదే పార్టీయొక్క ఆర్థిక కార్యక్రమమని నొక్కివక్కాణించేడు. మధ్యమతరగతికి జెందిన పెటీ-బూర్జువావర్గానికి జెందిన ఆర్థికవిధానానికి సంబంధించినశక్తుల పట్ల అమిత అతివాదవిధానాన్ని అమలుజరిపినట్టి పార్టీలో నున్న కొందరి కార్యకర్తలను కామేడ్ మావోసీటుంగ్ తీవ్రంగా విమర్శించేడు. నిరంకుశ పెట్టుబడిదారులనుండి గుంజు

కొన్న పెట్టుబడినుండి సృష్టింపబడునట్టి సోషలిస్టుస్వభావాన్ని కలిగియున్న బ్రహ్మాండమైన ప్రభుత్వ ఆర్థికవిధానం, యావత్ జాతియొక్క ఆర్థికనాళాలను కంట్రోలుచేయునట్టి బ్రహ్మాండమైన ప్రభుత్వ ఆర్థికవిధానం అత్యంతనిశ్చయాత్మకమైన ప్రాధాన్యతను కలిగియుంటుందనీ, ప్రజాప్రభుత్వంయొక్క ఆర్థికజీవితంలో అద్భుతమైనపాత్ర వహించగలదనీ, కామ్రేడ్ మావేసీయాంగ్ స్పష్టీకరించేడు. అందువలన మధ్యమతరగతికి జెందిన పెట్టీ - బూర్జువావర్గానికి చాలా అవసరమనీ, అంతేగాక, వారిని జూచి భయపడాల్సిన అవసరం లేదనీ కామ్రేడ్ మావేసీయాంగ్ స్పష్టీకరించాడు. ఈ సమావేశ ఫలితంగా యీ కాలంలో పార్టీ సర్వతోముఖంగా పనిజేసిన ఫలితంగా యావజ్జాతీయ విజయాన్ని సాధించుటకు జరుపునట్టి పోరాటంలో ప్రజలను నడుపుటకై మనపార్టీ అన్నివిధాలా ఆయత్తమయ్యింది.

1943 1949 సంవత్సరాలలో యుద్ధం త్వరితంగా అభివృద్ధి చెందింది. 1948 వ సంవత్సరం నాటికి ప్రజా విముక్తి సైన్యం నగరాలను ముట్టడించే యుద్ధ నైపుణ్యాన్ని అపారంగా సంపాదించింది. కొమింటాంగునకు "రక్షణ కీలకా లైన" అనేక నగరాలను, చకాచకా విముక్తి గావించింది. ప్రజా విముక్తిసైన్యం 1948 సెప్టెంబరు 1 వ తారీఖునుండి నవంబరు 2 వ తారీఖువరకూగల కాలంలో లియో-షెంగ్ దండయాత్ర (లియో-షెంగ్ దండయాత్ర, లియోనింగ్ రాష్ట్రంలో జరిగింది; ప్రధానంగా ముక్డెన్, ఛిన్‌చౌ, ఇంగ్‌కౌ ప్రాంతాలలో జరిగింది) విజయవంతంగా ముగిసిన తర్వాత

ఈశాన్య చైనా యావత్తూ పూర్తిగా విముక్తి జేయుబడింది. ఈ దండయాత్రలో నాలుగు లక్షల డెబ్బయిరెండు వేల మంది గల కొమింటాంగు సైన్యాలు, నిరాయుధం గావించబడ్డాయ్. దాని ఫలితంగా ప్రజావిముక్తి సైన్యానికి కొమింటాంగు సైన్యాలకన్న సైనిక సంఖ్యాబలం అధిక తరమయ్యింది. ఇది జరిగిన కొద్దికాలానికే, దక్షిణరంగంలో 1948 నవంబరు 7 వ తారీఖునుండి 1949 జనవరి 10 తారీఖువరకు హినూచౌవద్ద (కియాంగ్సీ రాష్ట్రం) జరిగిన హువైహాయ్ దండయాత్రలో అయిదు లక్షల యాభై అయిదు వేల మంది సైనికులుగల కొమింటాంగు సైన్యాలు నిరాయుధం గావించబడ్డాయ్. తత్ఫలితంగా కొమింటాంగు అభివృద్ధి నిరోధకులయొక్క ప్రధాన సాయుధ సైన్యాలు నాశనమయ్యాయి. కొమింటాంగు అభివృద్ధి నిరోధకులకు వెన్నెముక విరిగింది. నాన్‌కింగు మహానగరం ప్రజా విముక్తి సైన్యాలదాడికి గురిఅయ్యే మార్గ మేర్పడింది. అదేకాలంలో (1948 డిసెంబరు 5 వ తారీఖునుండి 1949 జనవరి 31 వ తారీఖువరకుగల కాలంలో) ఉత్తర రంగంలో ప్రజావిముక్తి సైన్యం టీన్‌స్టిన్, పెకింగ్ నగరాలను విముక్తి జెందించుటకు దండయాత్రను సాగించింది.

కాలగాన్, టీన్‌స్టిన్-నగరాలు యుద్ధంద్వారా విముక్తి జెందించబడ్డాయ్; పెకింగ్‌నగరం శాంతియుతంగా విముక్తి జెందించబడింది. ఈ దండయాత్రలో కొమింటాంగ్ అభివృద్ధి నిరోధకులు, మరియొక అయిదులక్షలయిరువైనొక్క వేలమంది సైనికులుగల సైన్యాన్ని పోగొట్టుకున్నారు. ఆవిధంగా యిప్పటికి ప్రధానంగా యాంగ్సీనదిప్రాంతానికి మధ్యము, క్రింది

చేరువలయొక్క ఉత్తరదిశలోనున్న ప్రదేశాలన్నీ విముక్తి జేయబడ్డాయ్.

1949 మార్చి నెలలో ఏడవపార్టీ కాంగ్రెసుచే ఎన్నుకోబడిన కేంద్రకమిటీయొక్క రెండవ విస్తృత సమావేశాన్ని చైనాకమ్యూనిస్టుపార్టీ జరిపింది. యావజ్జాతీయ విజయాన్ని సాధించుటకై అనుసరించివలసిన ప్రధానపాలసీలను గురించి విజయానంతరం అమలుజరుపవలసిన విధానాలను గురించి యీ సమావేశం ఒక నిర్ణయానికి వచ్చింది.

యావజ్జాతీయ విజయకాలంలో పార్టీకార్యక్రమాన్ని గ్రామీణప్రాంతాలనుండి నగరాలకు మార్చాలని యీ సమావేశం ప్రధానంగా నొక్కివక్కాణించింది. 1927 సంవత్సరం నాటినుండి పార్టీ గ్రామీణప్రాంతాలలో బలాన్ని చేకూర్చు కొనుటకై నగరాలను చుట్టుముట్టుటకు గ్రామీణప్రాంతాలను వినియోగించుటకై అంతిమంగా నగరాలను పట్టుకొనుటకై ప్రధానంగా పనిజేస్తూ వచ్చింది. ఈ సమావేశప్రారంభ కాలానికి గ్రామీణప్రాంతాలలో, పార్టీతలపెట్టిన కార్యక్రమం పూర్తిఅయ్యింది. అందువలన గ్రామీణప్రాంతాలను నకుపుటకు నగరాలను వినియోగించుటకుగాను, పార్టీపనిని నగరాలలో ప్రారంభించాలనీ, నగరాలలో కేంద్రీకరించి పనిచేయాలని, ప్రధానంగా నొక్కివక్కాణించటమైనది.

పార్టీపని నగరాలలో పరిపూర్ణంగా, కార్మికవర్గంపై ఆధారపడియుండాలనీ, పారిశ్రామికవుత్పత్తిని పునరుద్ధరించటం అభివృద్ధిచేయటం అనేది పార్టీప్రధాన కర్తవ్యమనీ, యీ సమావేశం, తీర్మానించింది. చైనాదేశపు ఆర్థికవిధానం

యొక్క వివిధశక్తుల హోదాను వివరంగా, యీ సమావేశం చర్చించింది. పార్టీ అమలు జరుపవలసిన సర్వవిధానాలను గురించి, యీ సమావేశం, వివరంగా చర్చించింది. ఈచర్చల ఫలితంగా, అటుతర్వాత కాలంలో, దీనిసారాంశమే, "చైనా ప్రజా రాజకీయసమాలోచన సంఘపు (చైనీస్ పీపుల్స్ పొలిటికల్ కన్సల్టేటివ్ కాన్ఫరెన్సు) సమిష్టకార్యక్రమంయొక్క విధానానికి పునాదిగా ఏర్పడింది.

ఇక, కోమింటాంగ్ అభివృద్ధినిరోధకుల విషయం చూద్దాం. అమెరికన్ సామ్రాజ్యవాదుల ప్రోద్బలంవలన చియాంగు కై-షేకు, రంగంనుండి విరమించినట్లుగా నటించ సాగాడు. చియాంగు - కై-షేకు తరవున, లీసుంగుజెన్ "శాంతి"కై విజ్ఞప్తి చేయసాగాడు. చైనా కమ్యూనిస్టుపార్టీ, యీ విజ్ఞప్తి నిరాకరించలేదు. కోమింటాంగు డెలిగేట్లతో చర్చలుసాగించినపిదప శాంతిఒడంబడిక ముసాయిదాను రూపొందించినది. ఏమైనప్పటికినీ, యీ ఒడంబడికపై కోమింటాంగు అభివృద్ధి నిరోధక ప్రభుత్వం సంతకంచేయ నిరాకరించింది; ఆ విధంగా మరొకమారు కోమింటాంగు అభివృద్ధి నిరోధకుల జిత్తులమారితనం పరిపూర్ణంగా బట్టబయలు చేయబడింది.

1949 ఏప్రియల్ 21 వ తారీఖున మిగిలిన చైనా నంతనూ విముక్తిజెందించుటకై దక్షిణ చైనాలోనికి నైఋతి చైనాలోనికిపురోగమించవలసినదిగా కామేడ్ మాసీయాంగ్, కామేడ్ ఛూటేలు ప్రజావిముక్తి సైన్యాలను ఆజ్ఞాపించేరు. 1949 ఏప్రియల్ 23 వ తారీఖున ప్రజావిముక్తిసైన్యం నాన్

కింగ్ నగరాన్ని విముక్తిజెందించింది. 1949 సంవత్సరంలో ఒకదానితర్వాత మరియొకటిగా అనేక పట్టణాలను, నగరాలను తైయువాన్, హాంగ్‌చౌ, హాంకోవ్, సియాన్, షాంఘై, లాన్‌చౌ, కాంటన్, కైవ్యాంగ్, ఛుంకింగ్, ఛెంగ్‌తూలతో సహా విస్తారప్రాంతాలను ప్రజావిముక్తిసైన్యం విముక్తిజెందించింది. హునాన్, సూయువాన్, సిన్‌కియాంగ్, సికాంగ్, యున్నాన్‌రాష్ట్రాలు శాంతియుత మార్గాలద్వారా విముక్తి జెందించబడ్డాయ్. 1950 ఏప్రియల్, మే మాసాలలో ప్రజా విముక్తిసైన్యం సముద్రాన్నిదాటి హైనాన్ దీవులను, చౌవ్ షాన్‌దీవులను విముక్తిజెందించింది. 1950 సంవత్సరంలో దక్షిణ రాష్ట్రాలలోనూ వాయువ్య రాష్ట్రాలలోనూ కొమింటాంగ్ అభివృద్ధినిరోధకులు వదిలివెళ్ళిన పదహారులక్షల బందిపోటు దొంగలను ప్రజావిముక్తిసైన్యం హతమార్చింది. 1950 నవంబరులో టిబెట్ ప్రాంతంలోనికి ప్రజావిముక్తి సైన్యం పురోగమించసాగింది. 195: మే మాసంలో టిబెట్‌ను శాంతియుత మార్గాలద్వారా విముక్తిజెందించుటకు తీసుకొనవలసిన చర్యలనుగురించి కేంద్ర ప్రజాప్రభుత్వం టిబెట్ స్థానిక ప్రభుత్వాలమధ్య ఒక ఒడంబడిక జేసుకొనబడింది. తైవాన్ (ఫార్మోజా)ను కొమింటాంగు అభివృద్ధి నిరోధకులు అమెరికను సామ్రాజ్యవాదులు ఆక్రమించుకొని కూర్చున్నారు. ఈ తైవాన్ (ఫార్మోజా)ను మినహాయిస్తే చైనాదేశం యావత్తూ కొమింటాంగు అభివృద్ధినిరోధకుల హస్తాలనుండి చైనా ప్రజా విముక్తిసైన్యం విముక్తిజెందించింది.

1946 జులైనుండి 1950 జూన్‌వరకూ గల కాలంలో

చైనా ప్రజావిముక్తి సైన్యం ఎనభై లక్షలమంది సైనికులగల కోమింగ్‌టాంగ్ అభివృద్ధినిరోధకుల సైన్యాలను తుడిచివేసింది; యాభైనాలుగువేల నాలుగువందల తుపాకులను, మూడులక్షల పందొమ్మిదివేల తొమ్మిదివందల మెషీన్‌గన్‌లనూ, ఒకవేయి టాంకులను, సాయుధశకటాలను, యిరువైవేల మోటారు కార్లను, అనేకఆయుధాలను, సామగ్రిని వశపరచుకొంది.

1949 అక్టోబరు 1 వ తారీఖున చైనాప్రజారిపబ్లికు యొక్క కేంద్రప్రజాప్రభుత్వం స్థాపించబడింది. చైనా ప్రజా రాజకీయసమాలోచన సమావేశంచే (చైనీస్‌పీపుల్స్‌పొలిటికల్ కన్సల్టేటివ్ కాన్ఫరెన్సు) కేంద్రప్రజాప్రభుత్వం ఎన్నుకోబడింది. వివిధజాతులకు, ప్రజాతంత్రపార్టీలకు గ్రూపులకు, ప్రజాసంఘా లకు, ప్రాంతాలకు, సైన్యాలకు జెందినటువంటివిన్ని, ప్రత్యే కంగా ఆహ్వానించబడిన ప్రజాతంత్రవ్యక్తులతోసహా యీచైనా ప్రజారాజకీయసమాలోచన సమావేశానికి 662 డెలిగేట్లు హాజరయ్యేరు. చైనాప్రజారాజకీయసమాలోచన సమావేశం తన ప్రథమ విస్తృతసమావేశాన్ని 1949 సెప్టెంబరు 21 తారీఖునుండి సెప్టెంబరు 30 వ తారీఖువరకు జరుపుకున్నది.

ఈ కాన్ఫరెన్సు, చైనాప్రజా రాజకీయ సమాలోచన సమావేశంయొక్క సమిష్టి కార్యక్రమాన్ని, చైనా ప్రజా రిపబ్లికుయొక్క కేంద్ర ప్రజాప్రభుత్వపు నిర్మాణ రూపానికి సంబంధించిన శాసనాన్ని, చైనా ప్రజా రాజకీయ సమాలో చన సమావేశ నిర్మాణరూపానికి సంబంధించిన శాసనాన్ని ఆమోదించింది. కేంద్ర ప్రజాప్రభుత్వానికి అధ్యక్షుడుగా కామ్రేడ్ మావోసీటుంగ్‌ను ఎన్నుకొంది. ఛూతే, లీషావ్‌చీ,

సూంగ్‌చింగ్‌లింగ్ (సన్‌యిత్‌సేన్ సతీమణి), లీచీషెన్, ఛాంగ్‌లాన్, కావ్ కాంగ్‌లను వుపాధ్యక్షులుగానూ, కేంద్ర ప్రజాప్రభుత్వ కౌన్సిల్‌నకు సభ్యులుగా యాభైయారుమందిని యీ సమావేశం ఎన్నుకొంది; చైనా ప్రజారిపబ్లికు ప్రభుత్వ రాజధానిగా పెకింగ్ నగరాన్ని ఎన్నుకొంది. గత వొక వంద సంవత్సరాలనుండి చైనా ప్రజలు, సామ్రాజ్యవాదం, జమీాందారీ విధానాలకు వ్యతిరేకంగా, నడిపిన పోరాటాల ఫలితంగా; అందులో ప్రత్యేకంగా చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన, అసంఖ్యాక చైనా ప్రజానీకం గత యిరువై ఎనిమిది సంవత్సరాలలోనూ, చేసిన పోరాటాల ఫలితంగా, చైనా ప్రజా రిపబ్లికు స్థాపించబడింది.

చైనాప్రజా రిపబ్లికు స్థాపించబడింది. ఆనాటినుండి, చైనా విప్లవం, నూతనదశలో ప్రవేశించింది. "నూతన ప్రజాతంత్రం", మరియు "మిశ్రమ ప్రభుత్వం" అన్న పుస్తకాలు ప్రకటింపబడిన కాలానికి, దేశమంతటా, యీనాటి పరిస్థితికి, ఎంతో భేదముంది. అంటే ఆ పుస్తకాలు ప్రచురించబడిన కాలంలో దేశంలోని పరిస్థితు లొకరకంగా వున్నాయి, ఈనాడు మరొకరకంగా వున్నాయ్. అందువలన, ప్రజల ప్రజాతంత్ర విప్లవం, విజయమందిన తర్వాత యేర్పడిన పరిస్థితులనుండి జనిస్తున్న సమస్యలను వివరించాల్సిన అవసరముంది. చైనా ప్రజారిపబ్లికు యెలాంటి రాజ్యాంగ యంత్రం ? జాతీయ ఆర్థిక విధానంలోని వివిధసర్గాల వివిధ సెక్షన్ల హోదాలు, వర్గసంబాధాలు ఎలావున్నాయ్ ? అలాంటి రాజ్యాంగ యంత్రంయొక్క భవిష్యత్తు యేమిటి ? ఈ సమస్యలకు కామ్రేడ్

మాసీయాంగ్ 1949 జులై 1వ తారీఖున ప్రకటింపబడిన "ప్రజల ప్రజాతంత్ర నియంతృత్వం" అన్న తన వ్యాసంలోను చైనా ప్రజా రాజకీయ సమాలోచన సమావేశంయొక్క ప్రథమ విస్తృత సమావేశంలో ఆమోదింపబడిన సమిష్టి కార్యక్రమంలోనూ పరిపూర్ణంగానూ, చాలాసంతృప్తికరంగా జవాబిచ్చేడు.

"ప్రజల ప్రజాతంత్ర నియంతృత్వం" అన్న తన వ్యాసంలో కామ్రేడ్ మాసీయాంగ్ చైనా ప్రజా రిపబ్లికును గురించి యీ క్రిందివిధంగా వర్ణించేడు. చైనా ప్రజా రిపబ్లికు యంటే "కార్మికుల కర్షకుల మిత్రత్వాన్ని పునాదిగా జేసుకొని ఆ మిత్రత్వ పునాదితో కార్మికవర్గంచే (కమ్యూనిస్టు పార్టీద్వారా) నడుపబడే ప్రజల ప్రజాతంత్ర నియంతృత్వమది" ఈ సూత్రంయొక్క గురుతర ప్రాధాన్యతను వివరిస్తూ కామ్రేడ్ మాసీయాంగు యీ క్రిందివిధంగా వ్రాసేరు.

"ప్రజలంటే ఎవరు? చైనాలో ప్రస్తుత దశలో ప్రజలంటే కార్మికవర్గం, కర్షకవర్గం, పెట్టి బూర్జువా వర్గం జాతీయ బూర్జువావర్గం అన్నమాట. సామ్రాజ్యవాదుల తొత్తులైన భూస్వామికవర్గం నిరంకుశ పెట్టుబడిదారీవర్గాలపై అంతేగాక యీ వర్గాలకు ప్రాతినిధ్యంవహించునట్టి కోమింటాంగ్ అభివృద్ధినిరోధకులు వారి తోడు దొంగలపై తమ నియంతృత్వాన్ని అమలుజరుపుటకై యీ వర్గాలు (అంటే కార్మికవర్గం, కర్షకవర్గం, పెట్టీబూర్జువావర్గం, జాతీయ బూర్జువావర్గాలు) కార్మికవర్గం చైనా కమ్యూనిస్టు పార్టీల నాయకత్వాన తమ స్వంత రాజ్యాంగయంత్రాన్ని

రూపొందించుకొనుటకు తమ స్వంతప్రభుత్వాన్ని ఎన్నుకొను టకు సమైక్యమవుతాయ్. ప్రజాప్రభుత్వం అలాంటి వ్యక్తులను (పై నుదహరింపబడిన అభివృద్ధినిరోధక వర్గాలకు జెందిన అభివృద్ధి నిరోధకులను) అణచివేస్తుంది. వారు తాము సత్ప్రవర్తన గలిగి వ్యవహరించుటకు మాత్రమే అనుమతిస్తుంది. వారు పాశవికంగా మాట్లాడటంగానీ, సంచరించటంగానీ సహించదు. ఆ విధంగా వారు పశువులులాగున వ్యవహరించినా, మాట్లాడినా వారిహక్కులు వెంటనే లాగివేయబడుతాయ్. వారు శిక్షింపబడుతారు. ప్రజలలో ప్రజాతంత్రవిధానము అమలు జరుపబడుతుంది. వాక్, సభా, సంఘ, స్వాతంత్ర్యాలు ప్రజలకు యివ్వబడుతాయ్. వోటుచేసే హక్కు ప్రజలకు మాత్రమే యివ్వబడుతుంది; అభివృద్ధినిరోధకులకు యివ్వబడదు. ఈ రెండువిషయాలు ప్రజలకు ప్రజాతంత్రం, అభివృద్ధినిరోధకులపై నియంతృత్వం- అన్న రెండువిషయాలు మేళవించగా ప్రజలప్రజాతంత్ర నియంతృత్వం ఏర్పడుతుంది."

చైనాప్రజారిపబ్లికు, సోషలిజం, మరియు కమ్యూనిజం వైపునకు పురోగమించుటకై సోవియట్ యూనియన్‌ను వుదాహరణకు అనుసరించాలనీ, అందువలన సోవియట్ యూనియన్ పక్షాన గట్టిగా నిలబడాలనీ, సోషలిజంపక్షాన నిలబడాలనీ కామ్రేడ్ మావోసీటుంగ్ అనేకసార్లు నొక్కివక్కాణించాడు. కాని ప్రస్తుత చారిత్రకదశలో చైనాప్రజారిపబ్లికు, జాతీయ బూర్జువావర్గాన్ని యింకనూ అస్థిత్వంలో వుండ అనుమతిస్తూ వుంది. చైనాప్రజల ప్రజాతంత్రానికీ, ఆగ్నేయయూరపు ఖండంలోని దేశాలలో అమలుజరుపబడుతున్న ప్రజల ప్రజా

స్వామ్యానికీ మధ్య భేదం యిక్కడే వుంది. విభిన్న చారిత్రక పరిస్థితులఫలితంగా యీ భేదం యేర్పడుతూవుంది.
కామ్రేడ్ మాసీయాంగు యిలా వ్రాస్తున్నాడు:—

"ప్రస్తుతదశలో జాతీయ బూర్జువావర్గం అత్యంత ప్రధానమైనది. మన ప్రక్కగా సామ్రాజ్యవాద మింకా అస్థిత్వంలో వుంది. సామ్రాజ్యవాదమనే యీ శత్రువు చాలా క్రూరమైనది. భయంకర మైనదై వున్నది. వాస్తవిక ఆర్థిక స్వాతంత్ర్యాన్ని పొందుటకై చైనా దేశానికి చాలాకాలం పట్టుతుంది. చైనాదేశపు పరిశ్రమలు అభివృద్ధి జెందినప్పుడే విదేశాలపై చైనాదేశం ఆర్థికంగా ఆధారపడనినాడే పరిపూర్ణమైన యదార్థమైన స్వాతంత్ర్యం సాధింపబడగలదు. జాతీ యొక్క పరిపూర్ణ ఆర్థికవిధానంతో పోల్చిజూస్తే చైనాదేశం యొక్క ఆధునిక పరిశ్రమలు చాలా అల్పంగా వున్నాయ్. సామ్రాజ్యవాదుల వత్తిడిని త్రోసివేయుటకు వెనుకబడియున్న ఆర్థికతను ఒక అడుగు ముందుకు గొనిపోవుటకు చైనాదేశం జాతీయ ఆర్థిక విధానానికి ప్రజల జీవిత విధానానికి లాభదాయకంగా నున్నట్టి హానికరము గానట్టి పట్టణ గ్రామీణ పెట్టుబడిదారీ శక్తులన్నింటినీ, తప్పక వినియోగించాలి. సమిష్టి పోరాటానికి చైనాదేశం జాతీయ బూర్జువా వర్గాన్ని ఐక్యపరచాలి. పెట్టుబడి దారీ విధానాన్ని కంట్రోలు చేయుటమే, మనప్రస్తుతపాలసీ; అంతేగాని పెట్టుబడిదారీ విధానాన్ని రద్దు చేయుట యనేది మన ప్రస్తుత పాలసీ గాదు."

—(మాసీయాంగ్: ప్రజల ప్రజాతంత్ర నియంతృత్వం)

పెట్టుబడిదారీ విధానాన్ని పరిమితింపు (కంట్రోలు జేయటం) విధానమేమిటి? ఈ పరిమితింపు విధానమేమంటే, జాతీయ బూర్జువావర్గంతో ఐక్యతను సాధించుట. అంతేగాక, దానితో పోరాడుట యనేది; అంతేగాదు; జాతీయ బూర్జువా వర్గాన్ని సంస్కరించుటకూడా, యీ పరిమితింపు విధానం క్రిందకు వస్తుంది. దీనినిగురించి కామ్రేడ్ మాసీయూంగ్, యిలా వ్రాస్తున్నాడు:—

"ఇతర దోపిడీవర్గాలు కూలదోయబడ్డాయ్; జాతీయ బూర్జువావర్గ మొక్కటే మిగిలిపోయింది. ప్రస్తుతదశలో, తదనుగుణ్యమైన ప్రబోధాత్మక కార్యక్రమాన్ని, జాతీయ బూర్జువావర్గంలో సాగించాలి. సోషలిజాన్ని ప్రవేశపెట్టే కాలంరాగానే, అంటే, వ్యక్తిగత పరిశ్రమలను, జాతీయం జేసే కాలంరాగానే, బూర్జువావర్గానికి ప్రబోధించే కార్యక్రమంలో, వారిని సంస్కరించే కార్యక్రమంలో ఒక అడుగు ముందుకు వేస్తాం. ప్రజలు, తమ చేతుల్లో బలోపేతమైన రాజ్యాంగ యంత్రముండుటచే, జాతీయ బూర్జువావర్గం తిరుగుబాటు చేయగలదేమోయని భయపడరు."

—(మాసీయూంగు; ప్రజల ప్రజాతంత్ర నియంతృత్వం)

చైనా ప్రజారిపబ్లికును గురించి కామ్రేడ్ మాసీయూంగ్ వివరించినదంతా చైనా ప్రజారాజకీయ సమాలోచన సమావేశంచే ఆమోదించబడిన "సమిష్ట కార్యక్రమం" రూపంలో శాసనబద్ధంచేయబడింది.

"సమిష్టికార్యక్రమం"యొక్క సాధారణసూత్రాలు యీ క్రిందివిధంగా వివరించబడ్డాయ్:—

"చైనాప్రజారిపబ్లికు ఒక నూతన ప్రజాతంత్రమైన లేక ప్రజల ప్రజాతంత్ర రాజ్యాంగయంత్రం. కార్మిక, కర్షకుల మైత్రిపై ఆధారపడి చైనాలోని ప్రజాతంత్రవర్గాలన్నిటినీ సమైక్యమొనరించుచూ జాతులనన్నింటినీ ఐక్యపరచుచూ, కార్మికవర్గంచే నడుపబడిన ప్రజల ప్రజాతంత్రనియంతృత్వాన్ని అది కొనసాగించుతుంది. అది సామ్రాజ్యవాదాన్ని, ఫ్యూడలిజాన్ని (జమీందారీవిధానాన్ని) నిరంకుశ పెట్టుబడిదారీ విధానాన్ని వ్యతిరేకిస్తుంది. అది చైనాదేశంయొక్క స్వతంత్రానికై, ప్రజాతంత్రానికై, శాంతికై, ఐక్యతకై, అభ్యున్నతికై, సంపత్తికై, పటిష్ఠానికై పాటుపడుతుంది."

రాజకీయ, సైనిక, ఆర్థిక, సాంస్కృతిక. జాతీయ లౌకికరంగాలలో చైనాప్రజల ప్రజాతంత్ర ఐక్యసంఘటన, చైనాప్రజారిపబ్లికుల వర్తమానదశకు సంబంధించిన ప్రధానవిధానాలను "సమిష్టికార్యక్రమం" క్రమబద్ధంగా వివరించుతూ వుంది; ప్రస్తుతకాలానికి యీపాలసీలే చైనాకమ్యూనిస్టుపార్టీయొక్క ప్రధానపాలసీలు. ఆర్థికవిధానాలనుగురించి, "సమిష్టికార్యక్రమం" ప్రత్యేకంగా వివరిస్తూవుంది.

అది యీ క్రిందివిధంగా చెప్తూవుంది;—

"చైనా ప్రజా రిపబ్లికుయొక్క ఆర్థిక నిర్మాణానికి ప్రధానసూత్ర మేమంటే ఉత్పత్తిని అభివృద్ధిజెందించటం. పబ్లికు, ప్రైవేటు ప్రయోజనాలను రెండింటినీ పరిగణనలోనికి తీసుకొనునట్టి కార్మికులకు, పెట్టుబడిదారులకు లాభం కలిగిం

చునట్టి నగరాలు, గ్రామీణప్రాంతాలు ఒకదానికి మరియొకటి సహాయపడునట్టి చైనాదేశానికి విదేశాలకుమధ్య వస్తువులరవాణా కలుగజేయునట్టి విధానాలద్వారా సౌభాగ్యకరమైన ఆర్థికవిధానాన్ని చేకూర్చుటయునేది ప్రభుత్వంయొక్క స్వంత ఆర్థికవిధానాన్ని, సహకారసంఘాల ఆర్థికవిధానాన్ని రైతాంగప్రజల, చేతి పరిశ్రమదారుల ఆర్థిక విధానాన్ని ప్రైవేటు (వ్యక్తిగత) పెట్టుబడిదారీ ఆర్థికవిధానాన్ని ప్రభుత్వ పెట్టుబడిదారీ ఆర్థికవిధానాన్ని (స్టేట్ కాపిటలిస్టు ఎకానమీ), వాటి సంచాలక రంగాలలోనూ ముడిపదార్థాల సప్లయి మార్కెటు సౌకర్యాలలోనూ, శ్రమపరిస్థితుల విషయంలోనూ సాంకేతికసహాయం విషయంలోనూ పబ్లికు జనరల్ ఫైనాన్సు విధానాలలోనూ ప్రభుత్వం పరస్పర సహకారవిధానాన్ని అవలంబించుతుంది; క్రమబద్ధంచేస్తుంది. ఈ విధంగా ప్రభుత్వంయొక్క స్వంత ఆర్థికవిధాన నాయకత్వంక్రింద సామాజిక ఆర్థిక విధానంలోని అన్నిభాగాలు శ్రమ విభజననూ, సహకారాన్ని సాగించగలవు. యావత్తు సామాజిక ఆర్థికవిధానాభివృద్ధిని పెంపొందించుటలో తమ వుచితపాత్రను వహించగలవు."

కార్మికవర్గంయొక్క రాజకీయ నాయకత్వమూ, మరియు, కార్మికవర్గంయొక్క కంట్రోలుక్రింద సోషలిస్టు రకపు ప్రభుత్వ ఆర్థికవిధానమూ, అవిధంగా శాసనబద్ధంగా "సమిష్టి కార్యక్రమం"లో గుర్తింపబడ్డాయి; చైనా ప్రజారిపబ్లికుయొక్క అభివృద్ధి, సోషలిజంవైపునకు పురోగమించుటకు ప్రధానమైన హామీగా ఏర్పడుతున్నాయ్.

చైనా ప్రజా రిపబ్లికు స్థాపన, యావత్ ప్రపంచ ప్రజలకు గర్వకారణమైనది. 1949 అక్టోబరు 2వ తారీఖున, చైనాప్రజా రిపబ్లికుతో, తాను రాజనైతిక సంబంధాలను స్థాపించుకున్నానని చైనాప్రజల ఉత్తమ అంతర్జాతీయమిత్రుడైన సోవియట్ ప్రభుత్వం ప్రకటించింది. బల్గేరియా ప్రజా రిపబ్లికు, హంగరీ ప్రజారిపబ్లికు, కొరియన్ ప్రజాతంత్ర ప్రజా రిపబ్లికు, జెకోస్లోవికియన్ రిపబ్లికు, పోలెండు రిపబ్లికు, రుమేనియా ప్రజా రిపబ్లికు, మంగోలియా ప్రజారిపబ్లికు, జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లికు, ఆల్బేనియా ప్రజారిపబ్లికు, వియత్‌నాం ప్రజాతంత్ర రిపబ్లికు, ఇండియా రిపబ్లికు, స్వీడన్ రాజ్యం, డెన్మార్కు రాజ్యం, బర్మాయూనియన్, ఇండోనేషియా రిపబ్లికు, స్విస్ సమాఖ్య (కాన్ఫెడరేషన్) ఫిన్లాండు రిపబ్లికు పాకిస్తాను ప్రభుత్వాలు, చైనా ప్రజా రిపబ్లికుతో రాజనైతిక సంబంధాలను (డిప్లొమాటిక్ రిలేషన్సు) స్థాపించుకున్నాయ్. బ్రిటన్, సిలోన్, నార్వే, ఇజ్రాయిల్, ఆఫ్ఘనిస్థాను, నెదర్లాండ్సు—దేశాలు, చైనా ప్రజా రిపబ్లికును గుర్తించాయ్.

సోవియట్ యూనియన్ నాయకత్వానవున్న ప్రపంచ ప్రజాశాంతి శిబిరం పక్షానసే చైనా ప్రజారిపబ్లికు గట్టిగా నిలబడుతుంది; చైనా, సోవియట్ యూనియన్‌లమధ్య స్నేహ సంబంధాలను పటిష్టం చేయుటకై తీవ్రంగా కృషిజేస్తుంది. చైనా, సోవియట్ రష్యా దేశాలమధ్య చారిత్రక వొడంబడికలు 1950 ఫిబ్రవరి 14 వ తారిఖున చేసుకోబడ్డాయి. ఈ వడంబడిక పత్రాలపై చైనాదేశం తరఫున చైనా ప్రజా రిపబ్లికు అధ్యక్షుడు కామ్రేడ్ మాసీయాంగ్, ప్రధాని, విదే

శాంగమంత్రియైన కా|మేడ్ చౌ-ఎన్లైలూ, సోవియట్ ప్రభుత్వం తరఫున జనరలిస్మో స్టాలిన్ విదేశాంగమంత్రియైన విషిన్ స్కీలు సంతకంజేసారు. ఆరోజున అంటే 1950 ఫిబ్రవరి 14వ తారీఖున చైనా రష్యాదేశాల మధ్యజరిగిన చారిత్రక వొడం బడికల జాబితా యీ క్రిందిది;—

1. చైనా - సోవియట్ దేశాల మైత్రి వొడంబడిక, 2. చైనా - సోవియట్ దేశాల మైత్రి పరస్పర సహాయానికి సంబంధించిన వొడంబడిక 3. చైనీస్ చాంగ్‌చున్ రైల్వే పోర్ట్ఆర్థర్, డైరెన్ రేవులకు సంబంధించిన విషయాలపై చైనా సోవియట్ యూనియన్లమధ్య వొడంబడిక చైనా ప్రజారిపబ్లికునకు అప్పుయిచ్చుటకై చైనా, సోవియట్ దేశాలమధ్య చేసుకున్న వొడంబడిక.

ఈ వొడంబడికలవలన ప్రపంచశాంతి ప్రజాతంత్రాల శిబిరం అమోఘంగా పటిష్టమయ్యింది. నవచైనాయొక్క అంతర్జాతీయహోదా మహోన్నతంగా పెంపొందింది; అంతేగాక నవచైనాదేశపు ఆర్థికపునర్నిర్మాణకార్యక్రమాని కెంతో దోహదమిచ్చింది.

కేంద్రప్రజాప్రభుత్వం స్థాపింపబడినవెంటనే సామ్రాజ్యవాదం, జమీందారీవిధానం, నిరంకుశ పెట్టుబడిదారీవిధానాల చేతనూ యుద్ధం ప్రాకృతిక సంక్షోభాలచేతనూ తీవ్రంగా నాశనంగావింపబడిన జాతీయ ఆర్థికవిధానాన్ని పునరుద్ధరించుటకై, సంస్కరించుటకై అపారంగా కృషిజేసింది. కొమింటాంగ్ యొక్క నిరంకుశ పెట్టుబడులను (నిరంకుశ పెట్టుబడిదారుల ఆస్థులను) గుంజుకొని, కేంద్రప్రజాప్రభుత్వం సోషలిస్టు

స్వభావంగలిగిన ప్రభుత్వ ఆర్థికవిధానాన్ని నిర్మించింది. ఈ ఆర్థికవిధానం వేగంగా యావద్దేశంయొక్క ఆర్థిక జీవితంపై అమోఘమైన ప్రభావాన్ని కలుగజేసింది. ప్రభుత్వ ఆర్థికవిధానంచే సపోర్టుచేయబడిన కేంద్ర ప్రజా ప్రభుత్వం వేగంగానూ, ప్రతిభావంతంగానూ, జాతీయ ఆర్థిక వ్యవస్థలను సమైక్యం జేసింది. జాతీయ ఆర్థికవ్యవస్థలకు స్థాయిని కల్పించింది. గత పన్నెండు సంవత్సరాలనుండి దేశాన్ని పీడిస్తున్న తీవ్రద్రవ్యోల్బణాన్ని (యిన్ ఫ్లేషనును) అరికట్టింది; పారిశ్రామిక వుత్పత్తిని, వ్యవసాయిక వుత్పత్తిని రవాణా రహదారులను, వ్యాపారాన్ని పునరుద్ధరించుటకై క్రమబద్ధంగా అద్భుతమైన స్కీములను అమలు జరిపింది. మార్కెట్లను తెరచుటకు దేశాన్ని పారిశ్రామికంగా తయారు జేయుటకు కావలసిన పెట్టుబడులను ప్రోగుజేయుటకు కేంద్ర ప్రజా ప్రభుత్వం తన ఆర్థిక కార్యక్రమంలో వ్యవసాయాభి వృద్ధిపైననూ తేలిక పరిశ్రమలపైననూ, స్థానిక దేశీయ వ్యాపారంపైననూ తన దృష్టిని కేంద్రీకరించు కొనుటకు నిర్ణ యించుకొంది. అదేకాలంలో సత్వర జాతీయరక్షణ పరిశ్ర మలపైననూ విద్యుచ్ఛక్తి పరిశ్రమలపైననూ తన దృష్టిని కేంద్రీకరించి పనులను ప్రారంభించింది. యావత్ దేశంయొక్క ఆర్థిక జీవితాన్ని ప్రభుత్వ ఆర్థిక విధానం యదార్థంగా కం ట్రోలు చేస్తూవున్నది. కాబట్టి మహోన్నతంగా కేంద్రీకరింప బడివున్నది. కాబట్టి, ప్రైవేటు పెట్టుబడిదారి పరిశ్రమలు, వ్యాపారం ప్రభుత్వ ఆర్థిక విధానంయొక్క నాయకత్వాన ఆమోదించే మార్గానికి గొని రాబడుతున్నాయ్. అదే

సమయంలో ప్రభుత్వ ఆర్థిక విధానానికి సేవజేస్తున్న ప్రభుత్వ పెట్టుబడిదారీ ఆర్థికవిధానం, క్రమంగా అభివృద్ధి జెందుతూ వుంది. క్రమబద్ధమైన పారిశ్రామిక నిర్మాణానికి, చేయబడే ఆయత్తాలలో, దేశంయొక్క అవసరాలను తీర్చుటకై పరిశ్రములు, వ్యాపారాల పునర్నిర్మాణం, లేక, పునఃవ్యవస్థీకరణ యనేది ఒక అవసరమైన భాగం.

యావత్ ఆర్థిక పరిస్థితిని అభివృద్ధిజేయుటకు పారిశ్రామిక నిర్మాణానికి తయారగుటకు, యావత్ దేశంలోనూ వ్యవసాయక సంస్కరణను కొనసాగించుట యనేది ప్రధానమైన విషయాలలో నొకటిగా, కేంద్ర ప్రజాప్రభుత్వం భావించింది. 1950 జూన్‌లో, కేంద్ర ప్రజాప్రభుత్వం, "చైనా ప్రజా రిపబ్లికుయొక్క వ్యవసాయ సంస్కరణ శాసనాన్ని" ఆమోదించింది; 1950 సంవత్సరం, వర్షాకాలంనుండి, 1951 సంవత్సరం వసంతిరుతువువరకూ, నూతనంగా విముక్తిజెందించబడిన ప్రాంతాలలో, అంటే పదమూడుకోట్లమంది గ్రామీణ ప్రజానీకం నివసిస్తున్న ప్రాంతాలలో పూర్తి వ్యవసాయ సంస్కరణలను అములుజరిపింది చైనా ప్రజా ప్రభుత్వం. ప్రధానంగా, యుద్ధం ముగిసింది కాబట్టి, 1947 సంవత్సరంలో ప్రచురించబడిన, "చైనా వ్యవసాయక శాసనం యొక్క ప్రధాన కార్యక్రమం" లోని, ధనికరైతుల భూముల సమస్యకు సంబంధించిన నిబంధనలు "చైనా ప్రజా రిపబ్లికుయొక్క వ్యవసాయసంస్కరణ శాసనం"లో సంస్కరించబడ్డాయి. వ్యవసాయ సంస్కరణశాసనం ధనికరైతుల అదనపుభూమిని బలాత్కారంగా గుంజుకొనే పాలసీని ధనికరైతు ఆర్థికతను నిల

బెట్టేవిధానానికి మార్చింది. దీని అర్థమేమంటే ప్రత్యేక పరిస్థితుల క్రిందమాత్రమే ధ. కరైతులు కౌలుకుఇచ్చినభూములను స్వాధీనంచేసుకొనే పద్ధతిని ప్రభుత్వం అమలుజరుపుతుంది. వారు స్వంతంగా సాగుచేసుకొంటున్న భూములను వారికే వుంచివేస్తుంది. ఈ నూతనవిధానం ఉత్పత్తిపట్ల మధ్యమ తరగతికి జెందిన రైతులు వుత్సాహవంతంగా శ్రద్ధజూపుటకు ప్రోత్సహిస్తూవుంది. ప్రస్తుతం పాతవిముక్త ప్రాంతాలసహా మొత్తంమీద యిరువైతొమ్మిది కోట్లమంది గ్రామీణప్రజలు నివసిస్తున్న ప్రాంతాలలో వ్యవసాయ సంస్కరణలు అమలు జరుపబడ్డాయ్. దేశంలోని మిగతాప్రాంతాలలో ఒకటి రెండు సంవత్సరాలలో వ్యవసాయ సంస్కరణలను అమలుజరపటం పూర్తి అవుతుంది దేశమంతటిలోనూ సాగించబడుతున్న వ్యవసాయ సంస్కరణలు ప్రజా ప్రాతినిధ్యసభల (పీపుల్స్ రిప్రెజంటేటివ్ కాన్ఫరెన్సులు) రూపంలో నిర్మింపబడుతున్న రాజ్యాంగాధికారం మరియు విప్లవ ప్రతిఘాతుకశక్తుల రహస్య విచ్ఛిన్న కార్యకలాపాలను అణచివేయుటకై అసంఖ్యాకంగా ప్రజలు పాల్గొనుచున్న మహోద్యమాలు కలసి ప్రజల ప్రజాతంత్ర నియంతృత్వ పునాదులను మహోఘనంగా దృఢతరం జేసేయ్. అలాంటి పునాదులు లేనిదే క్రమబద్ధ ఆర్థిక పునర్నిర్మాణం అసాధ్యమవుతుంది.

ప్రస్తుతదశలోనూ, భవిష్యత్తులోనూ విప్లవకార్యక్రమాలన్నింటిలోనూ, పార్టీని దృఢతరంజేయుటనేది నిశ్చయాత్మకమైన ప్రాధాన్యతగల విషయంగా, చైనాకమ్యూనిస్టు పార్టీ గుర్తిస్తుంది. ప్రజావిముక్తియుద్ధంయొక్క విజయవంత

సంవత్సరాలలో పార్టీ వేగంగా అభివృద్ధిజెందింది. చైనా కమ్యూనిస్టుపార్టీయొక్క సభ్యులసంఖ్య యీనాడు యాభై ఎనిమిదిలక్షలు. పాత గ్రామీణజిల్లాలలో నూతనంగా మెంబర్లను జేర్చుకొనుటను ఆపుజేయాలనీ పార్ శ్రామిక కార్మికులను పార్టీలోనికి జేర్చుకోవాలని, పార్టీ నిర్ణయించింది. ప్రతిపార్టీ సభ్యుడు కార్మికవర్గంపై ఆధారపడుట, కమ్యూనిజాన్ని స్థాపించుటలయొక్క ఆవశ్యకతను పరిపూర్ణంగా అవగతం జేసుకొనుటకై కఠిన నియమాల ననుసరించి పార్టీసంఘాలను తీవ్రంగా పరిశుద్ధం జేయుటకై పార్టీ సభ్యులలో మార్క్సిస్టు - లెనినిస్టు అధ్యయన తరగతులను తీవ్రంగానూ, క్రమబద్ధంగానూ నడుపుటకు పార్టీ నిశ్చయించింది.

చైనా ప్రజానీకం తమదేశ పునర్నిర్మాణ కార్యక్రమాన్ని ప్రారంభించినప్పుడు వారు సామ్రాజ్యవాదుల నూతన దురాక్రమణ ప్రమాదాన్ని మరచిపోలేదు. చైనా దేశంలో తాము పొందిన అపజయంతో తమ దురాక్రమణ వాంఛను పరిత్యజించని అమెరికను సామ్రాజ్యవాదులు కొరియాలో సాయుధ జోక్యాన్ని సాగించుతున్న కాలంలోనే 1950 జూన్‌లో చైనాదేశానికి జెందిన తైవాన్ రాష్ట్రాన్ని బహిరంగంగా ఆక్రమించుకొన్నారు. అమెరికను సామ్రాజ్యవాదులు, తైవాన్ (ఫార్మోజా)రాష్ట్రాన్ని ఆక్రమించారంటే యదార్థానికిది చైనా ప్రజా విముక్తి యుద్ధంలో అమెరికనుసామ్రాజ్యవాద ప్రభుత్వం దీర్ఘకాలికంగా సాగిస్తున్న సాయుధ జోక్యానికిది పొడిగింపు; చైనా ప్రజా రిపబ్లికునకు వ్యతిరేకంగా అమెరికను సామ్రాజ్యవాదుల సాయుధ జోక్యానికిది నాంది.

తైవాన్ రాష్ట్రాన్ని అమెరికను సామ్రాజ్యవాదులు ఆక్రమించుకొన్నారంటే అదియేమని రుజువుజేస్తూవుంది? మన పొరుగునవున్న మిత్రదేశమైన కొరియన్ ప్రజాతంత్ర ప్రజా రిపబ్లికుపై అమెరికను సామ్రాజ్యవాదులు సాయుధ దురాక్రమణ దండయాత్రను సాగించారంటే అది యేమని రుజువుజేస్తూవుంది? పైవన్నీ మనదేశానికి వ్యతిరేకంగా అమెరికను సామ్రాజ్యవాదులు వేసుకొన్న దురాక్రమణ ప్లానులలో ఒక భాగమని రుజువవుతూ వుంది. "కొరియా దేశం పాలిట అపర చియాంగ్-కై-షేకైన" సింగ్మన్ రీ కీలుబొమ్మ ముఠాను, కొరియా ప్రజాతంత్ర ప్రజా రిపబ్లికుపై దాడిచేయుటలో అమెరికను దురాక్రమణ దారులు సపోర్టుజేసేరు. దీనికి కారణమేమంటే జపాను సామ్రాజ్యవాద దురాక్రమణ దారులు అనుసరించిన పాతమార్గాన్నే అమెరికను సామ్రాజ్యవాదులు కూడా అనుసరించ దలచారని వ్యక్తమవుతూవుంది. అంటే మొట్టమొదట కొరియాను ఆక్రమించి తైవాన్ (ఫార్మోజాను) మ్రింగివేయుటం అటుతర్వాత ఈశాన్య చైనాను ఆక్రమించటం యివే అమెరికను సామ్రాజ్యవాదుల ప్లానులు. 1950 అక్టోబరులో అమెరికను దురాక్రమణదారులు పియాంగ్‌యాంగ్‌ను ఆక్రమించారు; అటుతర్వాత ఈశాన్యచైనా భద్రతకు తీవ్రంగా ప్రమాదం తెచ్చిపెట్టూ యాలు, తుమేన్ నదులకు సమీపంలోనున్న చైనా కొరియా సరిహద్దు ప్రాంతానికి వుత్తరదిశగా అమెరికను సామ్రాజ్యవాదులు పిచ్చెత్తినట్లు తమ సైన్యాలను అమితంగా చొప్పించారు. ఈశాన్య ప్రాంత సరిహద్దులోనున్న చైనాదేశపు గ్రామీణప్రాంతా

లపై, నగరాలపై అమెరికను సామ్రాజ్యవాదుల విమాన దళాలు అవిరామంగా బాంబులువేసి నాశనంచేశాయ్. మన దేశప్రజల జీవితాలనుబలిగొన్నాయ్, ఆస్తులను నష్టంజేసాయ్. అమెరికను సామ్రాజ్యవాదులయొక్క యీ దుష్టచర్యలను మన దేశప్రజలు సహించ లేకపోయారు. అమెరికను సామ్రాజ్యవాదులను ప్రతిఘటించ వలసిందిగానూ, కొరియాకు సహాయం చేయవలసిందిగానూ, వారి యిండ్లను కాపాడవలసిందిగానూ, స్వేచ్ఛాపూరిత చర్యద్వారా వారిదేశాన్ని రక్షించవలసిందిగానూ, మన దేశంలోని యావన్మంది ప్రజలూ ఎలుగెత్తి చాటేరు. ప్రజలయొక్క దేశభక్తియుతమైన యీ డిమాండును బలపరచుతూ, చైనా కమ్యూనిస్టుపార్టీ యితర ప్రజాతంత్ర పార్టీలు, ఒక ప్రకటనజేసాయ్. ఆవిధంగా చైనా ప్రజలు అపూర్వ వుత్సాహంతో అమెరికను సామ్రాజ్యవాదులను ప్రతిఘటించుటకు, కొరియాకు సహాయపడుటకు న్యాయమైన, బ్రహ్మాండమైన, ఒక పోరాటాన్ని తీవ్రంగా సాగించారు.

చైనా ప్రజా వాలంటీర్లు కొరియన్‌రంగంలో 1950 అక్టోబరుమాసం ద్వితీయభాగంలో కొరియన్ ప్రజాసైన్యంతో భుజాలుకలిపి అమెరికను దురాక్రమణదారులకు వ్యతిరేకంగా పోరాడసాగేరు. కొరియన్ ప్రజలు దురాక్రమణకు వ్యతిరేకముగా తాము సాగిస్తున్నయుద్ధంలో ప్రమాద పరిస్థితిలో పడ్డారు. చైనాప్రజా వాలంటీర్లు యీ ప్రమాద పరిస్థితిని కొరియను ప్రజలకు అనుకూలంగా మార్చివేసారు. అమెరికను దురాక్రమణదారులు ఉన్మాదంగా సాగిస్తున్న దాడులను

చైనాప్రజా వాలంటీర్లు కొరియన్ ప్రజాసైన్యము కలిసి ఉత్తర కొరియానుండి త్రిప్పికొట్టసాగేయ్. అమెరికను సామ్రాజ్యవాదులకు వారి కీలుబొమ్మయైన సింగ్మన్‌రీసైన్యా నికి తీవ్రనష్టాలు వాటిల్లినాయ్. ఆ కాలంనుండి 1951 జూన్ నెల రెండవభాగంవరకూ చైనాప్రజా వాలంటీర్ల దళాలు, కొరియను ప్రజాసైన్యమూ కలసి యుద్ధరంగంలో పోరాడు తున్న రెండులక్షల యాభై వేలమంది శత్రుసైనికులను హత మార్చారు. ఐదుదండయాత్రలను త్రిప్పికొట్టేరు. చావుదెబ్బలు తిన్న శత్రుసైన్యం కొరియాకు నడిబొడ్డులోనున్న 38 పారలల్ లైనుకు (38 సమానాంతర రేఖవరకు) తరిమివేయబడ్డారు. యుద్ధంలో అనేక అపజయాలను పొందుటచే దురాక్రమణ సైన్యంయొక్క సర్వసేనానియైన అమెరికను యుద్ధోన్మాదిగా ఘనతజెందిన మెకార్థరు 1951 ఏప్రియల్లో బర్తరఫ్ చేయబడ్డాడు. దురాక్రమణదారులు విపరీతముగా బాంబులువేసి నాశనము జేసినందువలన అనేక కష్టాలు కలిగినప్పటికీ కొరియాలోని చైనా వాలంటీర్ల దళాలు, అమెరికను సామ్రాజ్యవాదుల దురాక్రమణను ప్రతిఘటించుటలో, కొరియన్ ప్రజలకు సహాయపడ్డారు. ఈ కార్యాచరణను, చైనాప్రజలు, కొరియా ప్రజలు, యావత్ ప్రపంచంలోని ప్రజలు అభినందించారు. అంతేగాక, చైనా ప్రజలలో అపూర్వమైన దేశభక్తి ఉత్తే జాన్ని జనింపజేసింది. కొరియాకు సహాయం చేయటం, తైవాన్‌ను (ఫార్మోజాను) విముక్తి జెందించటం, జాతీయ రక్షణను దృఢతరం జేయటం యనేవి, చైనా ఆర్థికవిధానాన్ని పునరుద్ధరింపజేయుట, ఆర్థిక నిర్మాణాన్ని సాగించుట, అత్యంత

ప్రధానమైన గ్యారంటీయేగాక, ప్రపంచశాంతి ఆశయంలో ఒక అంతర్భాగమునికూడా దేశభక్తులైన చైనా ప్రజలు గాఢంగా విశ్వసిస్తున్నారు. చియాంగ్-కై షేక్ ఘాతుకునకు వ్యతిరేకంగా జరుపబడిన ప్రజావిముక్తి యుద్ధంమాదిరిగానే, అమెరికను దురాక్రమణదారులకు వ్యతిరేకంగా చైనా ప్రజలు జరుపు పవిత్ర పోరాటం, చైనా ప్రజలకు అనుకూలంగా విజయాన్ని సాధిస్తుంది.

---

## ఐదో అధ్యాయం

# సింహావలోకనం

పై అధ్యాయాలలో నుడివినట్లుగా, చైనా కమ్యూనిస్టు పార్టీ గడపిన యీ ముప్ఫయి సంవత్సరాలు, ఉజ్వలమైన ముప్ఫయి సంవత్సరాలు; సామ్రాజ్యవాద దురాక్రమణ దారులు, వారి తాబేదార్లకు వ్యతిరేకంగా అనేక కష్టాలు పడుతూ, నష్టాలకు గురియవుతూ, వివిధ అవకాశవాద ధోరణులను అధిగమించుతూ తమ అనుయాలలోనున్న లోట్లను పొరపాట్లను అధిగమించుతూ, కామ్రేడ్ మావోసీయాంగ్ నాయకత్వాన చైనా కమ్యూనిస్టుపార్టీ, చైనా కార్మికవర్గం, మరియు చైనాప్రజలు, వీరోచితంగా పోరాడిన ముప్ఫయి సంవత్సరాలవి; అంతిమంగా తమ శత్రువులను వోడించి, చైనా ప్రజలు, చైనా కమ్యూనిస్టుపార్టీ చైనాకార్మికవర్గం, కామ్రేడ్ మావోసీయాంగ్ నాయకత్వాన విజయాన్ని చేపట్టిన ముప్ఫయి సంవత్సరాలవి.

అలాంటి ఒకపార్టీయొక్క నాయకత్వంలేనిదే- కామ్రేడ్ మావోసీయాంగ్ వర్ణించినట్లుగా "మార్క్సు, ఏంగిల్స్, లెనిన్, స్టాలిన్ల సిద్ధాంతాలతో సాయుధమైన సుశిక్షితమైన, ఆత్మ-విమర్శనపద్ధతులను అమలుజరుపునట్టి అసంఖ్యాక ప్రజలతో అత్యంత సన్నిహిత సంబంధాల్ని కలిగియుండునట్టి" బోల్షివిక్ రకానికి జెందిన ఒకపార్టీయొక్క నాయకత్వం లేందే- శక్తిమంతులైన సామ్రాజ్యవాదులు, వారి తొత్తులను కూలద్రోయటానికి, స్వతంత్రమైన ప్రజల ప్రజాతంత్ర రాజ్యాంగ

యంత్రాన్నొకదానిని స్థాపించుటానికి చైనా కార్మికవర్గం చైనా ప్రజలకు సాధ్యమయ్యేదిగాదు.

చైనా కమ్యూనిస్టుపార్టీ స్థాపించబడుటకు పూర్వం చైనా విప్లవాన్ని నడుపుటకు కృషిజేసిన బూర్జువా వర్గానికి జెందిన లేక పెటీ - బూర్జువా వర్గానికి జెందిన చైనా రాజకీయపార్టీ లుండేవి. ఈ పార్టీలు కొంత అభ్యుదయకర పాత్రను వహించాయి; కాని శత్రువుయొక్క బహుముఖ దండయాత్రలను యీ పార్టీలు తట్టుకోలేక భగ్నమయ్యాయి. ఇంతకు పూర్వం చైనా ప్రజలెన్నడూ కని విని ఎరుగనంతగా చైనా కమ్యూనిస్టు పార్టీపై సామ్రాజ్యవాదులు, వారితొత్తులు, అమిత నిర్దాక్షిణ్యంగా దారుణ హత్యాకాండను సాగించినప్పటికి చైనా కమ్యూనిస్టుపార్టీ చైనా ప్రజలను విజయం వైపునకు నడుపుటలో విజయవంత మయ్యింది. చైనా కమ్యూనిస్టు పార్టీ ఒక నూతన రకానికి జెందిన విప్లవాత్మక శ్రామికవర్గ పార్టీ అగుటయే సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ (బోల్షివిక్కులు) మూసలో తయారైన పార్టీ యగుటయే దీనికి కారణం.

సిద్ధాంతం ఆచరణల మేళవింపు ప్రజలతో అత్యంత సన్నిహిత సంబంధాన్ని కలిగియుండటం ఆత్మ - విమర్శనను అమలు జరపుటం అనేవి చైనా కమ్యూనిస్టు పార్టీయొక్క విశిష్టస్వభావాలని కామ్రేడ్ మాసీయూంగ్ ఏడవపార్టీ కాంగ్రెసులో వివరించాడు. సిద్ధాంతాన్ని ఆచరణతో మేళవించుటద్వారానే మన పార్టీకి సైద్ధాంతికతత్వ పెడమార్గాలను (doctrinaire diviations), అనుభవవాద పెడమార్గాలను

(empricist deviations) అధిగమించుటకు శత్రువును ఓడించుటకు సరియైనమార్గాన్ని కనిపెట్టి దానిని వివరించుటకు ఒక నూతనజాతిని నిర్మించుటకు మార్క్సిజం, లెనినిజం యొక్క సార్వజనికసత్యాన్ని ఫలసాధకంగానూ సృజనాత్మకంగానూ వినియోగించుటకు సాధ్యమయ్యింది. అసంఖ్యాక ప్రజలతో అత్యంత సన్నిహితమైన సంబంధం మనపార్టీకి వున్నది కాబట్టే అది ప్రజల విప్లవాత్మకపోరాటాన్ని నడుపగలిగింది. ప్రజల విప్లవయుద్ధాన్ని నడుపగలిగింది. ఒక ప్రజాసైన్యాన్ని సృష్టించగలిగింది. ప్రజల రాజ్యాంగ యంత్రాధికారాన్ని సృష్టించగలిగింది. తనకన్న అమితంగా బలాధికంగానున్న శత్రువును ప్రజానీకంయొక్క అంతులేనిబలంపై ఆధారపడుట వల్లనే ఓడించగలిగింది. ఆత్మవిమర్శను అమలుజరుపుటద్వారానే మనపార్టీకి గతంలోని తన పొరపాట్లు, లోట్లనుండి గుణపాఠాలు నేర్చుకొనుటకు తన్నుదాను అభివృద్ధిపరచుకొనుటకు ప్రజలతో అవిరామంగా నిరంతరం సన్నిహిత సంబంధాలను నిలబెట్టుకొనుటకు అభివృద్ధిజేసుకొనుటకు సాధ్యమయ్యింది. చైనావిప్లవాన్ని అంతిమ విజయంవైపునకు గొనిపోవుటలో అలాంటి స్వభావాలను గలిగియున్న ఒకపార్టీ, విజయానికి అవసరమైన ఒక హామీ.

పార్టీయొక్క సమ్యనాయకత్వమనేది చైనా విప్లవానికి సంబంధించిన, దాని సవ్యసిద్ధాంతంచే ప్రధానంగా నిర్ణయింపబడుతుందని చైనా కమ్యూనిస్టుపార్టీచరిత్ర రుజువుజేస్తూవుంది. మార్క్సిజం - లెనినిజం, మావోసేటుంగ్ ప్రబోధాల దిక్సూ

చన లేసిఁదే చైనా కార్మికవర్గాన్ని, చైనా ప్రజలను విజయం వైపునకు నడపటం సాధ్యమయ్యేదికాదు;

ప్రథమ, ద్వితీయ విప్లవాత్మక అంతర్యుద్ధాల కాలంలోని, జపాను దురాక్రమణకు వ్యతిరేకంగా జరుపబడినట్టి ప్రతిఘటన యుద్ధకాలంలోని, పార్టీ చరిత్రను సమీక్షించుతూ, 1939 అక్టోబరులో కామ్రేడ్ మాసీయాంగ్ యీక్రింది విధంగా వ్రాసాడు:—

"ప్రథమదశలో, మనపార్టీ బాల్యావస్థలో వుంది. ఈ దశలోని మొదటికాలంలోనూ, మధ్యకాలంలోనూ, పార్టీ పంథా సవ్యంగావుంది; పార్టీసభ్యుల కార్యకర్తల విప్లవ ఉత్సాహం, కార్యకలాపాలు, చురుకుదనం, చాలా అద్భుతస్థాయిలో వుండేవి. అందువలనే ప్రథమ మహావిప్లవంలో (ప్రథమ విప్లవాత్మక అంతర్యుద్ధాన్ని ప్రథమ మహావిప్లవంగా పిలుస్తూ వుంటారు) మనం విజయాన్ని సాధించాం; కాని, మన పార్టీ యింకనూ బాల్యదశలో మాత్రమేవుంది; ఐక్య సంఘటన, సాయుధపోరాటం, పార్టీ నిర్మాణం, అన్న మూడు ప్రధాన సమస్యలలో పార్టీకి అనుభవం తక్కువ.

చైనా విప్లవంయొక్క న్యాయాలు, స్వభావాలను గురించిగానీ, లేక చైనాచరిత్ర సమాజాల న్యాయాలు స్వభావాలను గురించిగానీ మన పార్టీకి చాలా తక్కువ తెలుసును. చైనా విప్లవంయొక్క ఆచరణతో మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని పరిపూర్ణంగా ఎలా సమైక్య మొనరించాలన్న విషయంపట్లను మనపార్టీకి అనుభవం తక్కువ. అంతేగాక యీ విషయంపై మన పార్టీకి పరిపూర్ణ అవగాహనలేదు

అందువలన యీ దశకు చివరికాలంలో అంటే యీ దశకు ఉత్కృష్ట సమయమైన చివరికాలంలో పార్టీ నాయకత్వ సంఘాల ప్రధానభాగం విప్లవంయొక్క విజయాలను దృఢతరం చేసుకొనుటకు యావత్ పార్టీకి నాయకత్వాన్ని ప్రసాదించలేకపోయింది. అంతేగాక బూర్జువావర్గంయొక్క మోసాలకు ఎరఅయ్యింది. తత్ఫలితంగా విప్లవం పరాజితమయ్యింది."

"ఈ దశలో పార్టీ నిర్మాణం దృఢమొనరింపబడకుండానే, అభివృద్ధి కాజొచ్చింది. పార్టీ మెంబర్లను, కార్యకర్తలను, సంఘాలను, సైద్ధాంతికంగాగానీ, లేక రాజకీయంగాగానీ, దృఢమొనరింపబడుట యనేది జరుగలేదు. నూతన సభ్యులు అనేకమంది వున్నారు. వారికి అవసరమైన మార్క్సిస్టు-లెనినిస్టు శిక్షణ యివ్వబడలేదు. వీరు తమ కార్యక్రమాన్ని అమలు జరుపుటలో చక్కని అనుభవాన్ని గడించారు. కాని, యీ అనుభవాన్ని సమీక్షించుటగానీ, ప్రోగుజేయుటగానీ, జరుగలేదు. పేరుకోసం ప్రాకులాడేవారు అనేకమంది పార్టీలోదూరేరు. వీరిని పార్టీనుండి బయటకు పంపటం జరుగలేదు.

మన శత్రువులు, మన మిత్రులు యీ యిద్దరూకూడా మన పార్టీకి వ్యతిరేకంగా కుటజేస్తున్నారు. కాని మనం యీ విషయంలో జాగ్రుతి వహించలేదు. పార్టీలోపల, చురుకుగా పనిజేసేవారు అనేకమంది ముందుకు వచ్చేరు; కాని వీరిని పార్టీయొక్క ప్రధానాశ్రయంగా మార్పు జెందించుటకు యత్నాలు చేయబడలేదు. పార్టీకి అనేక విప్లవాత్మక సాయుధ సైన్యాలున్నాయ్; కాని వీటిపై పూర్తి కంట్రోలును

ఏర్పరచుకొనుటకుయత్నాలుజరుగలేదు. అనుభవంలేకపోవుట వల్లనూ, సుదృఢ విప్లవాత్మక దూరదృష్టి లేకపోవుటవల్లనూ చైనా విప్లవంయొక్క ఆచరణతో మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని ఐక్యపరచుటలో అనుభవం లేకపోవటంవల్లనూ, వీటి ఫలితంగా యీ పరిస్థితులన్నీ ఏర్పడ్డాయ్. పార్టీ నిర్మాణంయొక్క ప్రథమదశ అలాంటిది.

"రెండవదశ పదిసంవత్సరాల అంతర్యుద్ధానికి సంబంధించినది. ప్రథమదశ అనుభవంతోనూ, చైనా విప్లవంయొక్క న్యాయాలు, స్వభావాలను అవగాహన జేసుకొనుటలో పురోగమించుటవల్లనూ, చైనాచరిత్ర సమాజాలను గురించి చక్కగా జ్ఞానం సంపాదించుటవల్లనూ చైనా విప్లవంయొక్క ఆచరణతో మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని చక్కగా మేళవించుటద్వారాను, మన పార్టీ ఎర్రసైన్యాన్ని దాని పది సంవత్సరాల యుద్ధంద్వారా విజయం వైపునకు గొనిపోవ గలిగింది.

బూర్జువావర్గం మనలను విడిచిపెట్టి శత్రువులలో జేరిపోయినప్పటికీ మనపార్టీ రైతాంగంపై గట్టిగా ఆధారపడ గలిగింది. మనపార్టీ నిర్మాణం నూతనంగా అభివృద్ధి జెందింపబడుటయేగాక దృఢతర మొనరించబడిందికూడా. శత్రువులు మన పార్టీపై అవిరామంగా కుట్రలు చేసినప్పటికి మనము కుట్రదారులను తరిమివేశాం, పార్టీలో అనేకమంది కార్యకర్తలు మరల ముందుకు వచ్చుటయేగాక వారు మన పార్టీకి ప్రధానాశ్రయంగా తయారయ్యారు. పార్టీ ప్రజలయొక్క రాజకీయాధికారానికి మార్గాన్ని తెరచింది. తత్ఫలితముగా

రాజ్యాంగయంత్రాన్ని పరిపాలన కళను, శాంతి, భద్రత లను కాపాడుటకు సంబంధించిన కళను నేర్చుకొంది. అది సాయుధసైన్యాలను సృష్టించింది. తత్ఫలితంగా యుద్ధకళను నేర్చుకొంది. ఇవన్నీ మన పార్టీయొక్క మహత్తర పురోగమ నాలు, సాధితఫలితాలు."

"కాని యీ మహత్తర పోరాటంలో కొంతమంది సభ్యులు దిగజారుటయో, లేకపోతే ఒకసమయంలో అవకాశ వాద రొంపిలో దిగబడుటయో జరిగింది. దీనికంతకూ కారణ మేమంటే యీ కామ్రేడ్సునకు గత అనుభవాలను పరిశీలించి చుటపట్ల నమ్రతలేకపోవటం, చైనావిప్లవంయొక్క న్యాయాలు స్వభావాలపట్ల సరియైనజ్ఞానం లేకపోవటం, చైనాదేశపుచరిత్ర సమాజాలకు సంబంధించిన విషయాలనుగురించి చాలా అల్ప మైనజ్ఞానాన్ని కలిగియుండటం చైనావిప్లవంయొక్క ఆచరణతో మార్క్సిస్టు, లెనినిస్టు సిద్ధాంతాన్ని ఐక్యపరచాలన్న విష యంపై సరియైన జ్ఞానం లేకపోవటం, అనేవే దీనికి కారణం. అందువలన పార్టీనాయకత్వ సంఘాలలోని ఒకభాగం, పరి పూర్ణంగానూ, అన్ని సమయాలలోనూ, యీదశకు సంబం ధించిన కాలమంతటిలోనూ సరియైన రాజకీయ పంథాలను నిర్మాణాత్మక పంథాలను అర్థం జేసుకొనలేకపోయింది. ఒక సమయంలో లీలీసాన్‌యొక్క "అతివాద" అవకాశవాదంచే మనపార్టీయూ, యీవిప్లవమూ, ప్రమాదకర పరిస్థితులకు నెట్ట బడ్డాయ్; మరియొక సమయంలో విప్లవ యుద్ధంలోనూ, కోమింటాంగ్ రాక్షసులచే పాలింపబడుతున్న ప్రాంతాలలో, "అది

వాద" అవకాశవాదంచే మనపార్టీ ప్రమాదంలోనికి త్రోయబడింది."

"కాని యివన్నీ, త్సున్యీ కాన్ఫరెన్సులో అధిగమించబడ్డాయ్. (ఈ కాన్ఫరెన్సు క్వైచౌ రాష్ట్రంలోని త్సున్యీలో 1935 జనవరిలో జరుపబడింది) ఈ కాన్ఫరెన్సు జరిగినతర్వాత, మనపార్టీ శాశ్వతంగా బోల్షివిక్కు పంథాపై నడువసాగింది. ఛాంగ్-కువో-తావో యొక్క మితవాద-అవకాశవాదాన్ని జయించుటకు కావలసిన పునాదులు వేయబడ్డాయ్; జపాను-వ్యతిరేక- జాతీయ ఐక్యసంఘటనను స్థాపించుటకు కావలసిన పునాదులు వేయబడ్డాయ్, పార్టీ అభివృద్ధిక్రమంలోని రెండవ దశ అలాంటిది."

"పార్టీ అభివృద్ధిక్రమంలోని మూడవదశ, జపాను-వ్యతిరేక-జాతీయ- ఐక్యసంఘటనయనేది, ఈదశ ప్రారంభమై అప్పుడే మూడేళ్ళు అయ్యింది; యీ సంవత్సరాలలో జరిగిన పోరాటం, అత్యంత ప్రముఖమైనది. మనపార్టీ తాను గత రెండు విప్లవదశలలోనూ గడించిన అనుభవాలకు, దాని నిర్మాణాత్మక బలానికి, ఆయుధబలానికి; యావత్ దేశ ప్రజలలోనూ దానికిగల వున్నత గౌరవానికి, మార్క్సిస్టు- లెనినిస్టు సిద్ధాంతానికి, చైనా విప్లవంయొక్క ఆచరణకు మధ్యగల సంబంధాలనుగురించి మనపార్టీకిగల సుస్పష్టమైన సమైక్యమైన అవగాహనకు ధన్యవాదాలు; అలాంటి విశిష్టలక్షణాలను గలిగియుండుటచే, మనపార్టీ, జపాను-వ్యతిరేక-జాతీయ ఐక్యసంఘటనను స్థాపించగలుగుటయేగాక, జపాను దురాక్రమణకు వ్యతిరేకంగా మహత్తరమైన ప్రతిఘటన యుద్ధాన్ని సాగించింది. పార్టీ నిర్మాణరంగంలో మనం

సంకుచిత పరిమితులను దాటాం; ఘనమైన జాతీయ పార్టీగా తయారయ్యాం. మనపార్టీయొక్క సాయుధసైన్యాలు మరల ప్రవర్ధమానమవుతున్నాయ్; జపాను వ్యతిరేక పోరాటాలలో మరింతగా బలపడుతున్నాయ్ యావత్ దేశంలోని ప్రజలలో, మనపార్టీ తన పలుకుబడిని విస్తరింపజేసుకొంది."
(మాసీయాంగ్: "ది కమ్యూనిస్టు" పత్రికకు వ్రాసిన ప్రవేశిక)

పార్టీ చరిత్రనుగురించి కామ్రేడ్ మాసీయాంగ్ యిచ్చిన విపుల వర్ణన, విప్లవాత్మక సిద్ధాంతంయొక్క మహత్తర ప్రాధాన్యతనుగురించి పరిపూర్ణంగా వివరిస్తావుంది. తప్పుడు సిద్ధాంతమైతే అది నూతన శకాన్ని గొనివచ్చే విప్లవాన్ని వేగంగా మృత్యుముఖానికి పంపుతుంది. సత్యమైన సిద్ధాంతమైతే అది అపారమైన కష్టాలలోనున్న సమయంలో మన పార్టీని రక్షించగలదు. ఒకమెట్టుతర్వాత మరియొకమెట్టునకు విప్లవాన్ని ఉత్తేజానికి పురోగమింపజేయగలదు.

చైనా కమ్యూనిస్టుపార్టీ స్థాపింపబడిననాటినుండి మార్క్సిజం - లెనినిజంయొక్క సాధారణసూత్రాలచే అది దిక్సూచితం గావించబడింది. ఇది మన పార్టీ అనుభవించిన సౌలభ్యం. ఏమైనప్పటికేనీ చైనా విప్లవాన్ని విజయవంతం గావించుటకు ముందుగానే తయారుచేయబడివున్న సాధారణ సూత్రాల దిక్సూచనపై మాత్రమే ఆధారపడినంతమాత్రాన సరిపోదు. చైనావిప్లవంయొక్క యదార్థ ఆచరణతో చైనా విప్లవసూత్రాలకు సంబంధించిన మార్క్సిజం–లెనినిజంయొక్క సార్వజనికసత్యాన్ని, లెనిన్, స్టాలిన్ల దిక్సూచనను మేళవించాడు కామ్రేడ్ మాసీయాంగ్. ఇదే కామ్రేడ్ మాసీ

యాంగ్ చైనావిప్లవానికి చేసిన మహత్తరసేవ. అంతేగాక కామ్రేడ్ మావోసీటుంగ్ మార్క్సిజం - లెనినిజాన్ని, మరింతగా అభివృద్ధిజేయాల్సిన అవసర మేర్పడింది. 1919 నవంబరు మాసంలో తూర్పుదేశాల కమ్యూనిస్టుసంఘాల రెండవ అఖిల రష్యన్ కాంగ్రెసునకు తానిచ్చిన రిపోర్టులో కామ్రేడ్ లెనిన్ తూర్పుదేశాలలోని కమ్యూనిస్టులకు యీక్రింది పిలుపిచ్చేడు:

"ఈనాడు మీపై వొక గురుతర కర్తవ్యముంది. యిలాంటి కర్తవ్యాన్ని ప్రపంచంలోని కమ్యూనిస్టు లెన్నడూ యింతకుపూర్వం ఎదుర్కొని యుండలేదు. యూరోపియన్ దేశాలలో అస్తిత్వంలోలేని ప్రత్యేక పరిస్థితులు మీ దేశాలలో వున్నాయ్; కమ్యూనిజంయొక్క సాధారణ సిద్ధాంతం ఆచరణలపై ఆధారపడుతూ మీరు, మీ దేశాల ప్రత్యేక పరిస్థితులను అవగాహన జేసుకోవాలి; ఆ ప్రత్యేక పరిస్థితులకు అనుగుణ్యంగా మీరు యీ సిద్ధాంతాన్ని, ఆచరణను అనువర్తించ గలిగియుండాలి. మీ దేశాలలోని ప్రజానీకంలో రైతాంగం, ప్రధాన భాగం. అందువలన మీ పోరాట సమస్య పెట్టుబడికి వ్యతిరేకమైన పోరాటం గాదు. మధ్యయుగాలనాటి అవశేషాలకు వ్యతిరేకంగా మీ పోరాటాన్ని నడుపవలసిన అవసరముంది"

కామ్రేడ్ లెనిన్ సూచించిన యీ చారిత్రక కర్తవ్యాన్ని కామ్రేడ్ మావోసీటుంగు తదితర చైనా కామ్రేడ్సు పరిష్కరించారని చెప్పవచ్చును. ఆవిధంగా వారు, మార్క్సిజం - లెనినిజాన్ని మరింతగా అభివృద్ధి జెందించారు.

చైనా కమ్యూనిస్టు పార్టీయొక్క అనుభవాలను సం

గ్రహాపరచి చెపుచూ పార్టీ నాయకత్వాన చైనావిప్లవంయొక్క ప్రధానపోరాట రూపంగా ప్రజల ప్రజాతంత్ర ఐక్యసంఘటన సాయుధప్రజాపోరాటంయను యీరెండూ చైనాప్రజల ప్రజాతంత్రవిప్లవక్రమంలో చైనా కమ్యూనిస్టుపార్టీ గడించుకొన్న రెండుప్రధానఅనుభవాలని కామ్రేడ్ మాసీ యూంగ్ అనేకసార్లు చెప్పేడు. మార్క్సిజం-లెనినిజంయొక్క సార్వజనికసత్యాన్ని చైనా విప్లవంయొక్క ఆచరణతో సమ్మేళనకు పైవి రెండూ (ప్ర)జల ప్రజాతంత్ర ఐక్యసంఘటన, సాయుధ ప్రజాపోరాటం యనేవి రెండూ ప్రముఖ తార్కాణాలు.

పార్టీ అభివృద్ధి చైనా విప్లవాభివృద్ధియనేవి చైనాప్రజల ప్రజాతంత్రి ఐక్య సంఘటనాభివృద్ధినుండి విడదీయరాని విష యాలని చైనా కమ్యూనిస్టుపార్టీయొక్క ముప్ఫయి సంవత్స రాలచరిత్రి ఋజువుజేస్తూవుంది. ప్రజల ప్రజాతంత్రవిప్లవంలో కార్మికవర్గ నాయకత్వసమస్యను, కార్మికులు, కర్షకులమధ్య మిత్రత్వసమస్యను అందులో ప్రత్యేకంగా వివిధ బూర్జువావర్గ ముఠాలతో సమైక్యత, లేక ఆ ముఠాలకు వ్యతిరేకంగా పోరా టానికి సంబంధించిన సమస్యనూ పార్టీ సరిగా పరిష్కరించి నప్పుడు పార్టీ మరియు విప్లవము వేగంగా అభివృద్ధిజెందేయ్. ఈ సమస్యలను పార్టీ సరిగా పరిష్కరించకపోయినప్పుడు పార్టీ మరియు విప్లవమూ దెబ్బతింటూవచ్చాయ్.

మార్క్సిజం లెనినిజంయొక్క సార్వజనిక సత్యంపై ననూ చైనా విప్లవంయొక్క నిర్దుష్ట ఆచరణపైననూ ఆధార పడి అలాంటి తీవ్రమైన క్లిష్టపూరితమైన సమస్యలను చైనా కమ్యూనిస్టుపార్టీ స్వతంత్రింగా అధ్యయనము జేయాల్సి

వచ్చింది. యే విదేశానుభూతిపైననూ ఆధారపడజాలక పోయింది. ఉదాహరణకు ఒకటి చెప్తాను. రెండవ విప్లవాత్మక అంతర్యుద్ధకాలంలో పార్టీలోని "అతివాద" అవకాశవాదులు "మధ్యస్థ శిబిరాన్ని" (మధ్యమ తరగతివారిని) "అత్యంత ప్రమాదకరమైన శత్రువుగా" భావించారు; ఎందువలనంటే, కార్మికవర్గ నాయకత్వాన్ని ఆమోదించుటకు యిష్టపడుతున్న "మధ్యస్థ శిబిరాన్ని" (మధ్యమ తరగతివారిని) గురించి యీ "అతివాద" అవకాశవాదులకు యింతకుపూర్వం తెలియదు. మరియొక వుదాహరణ యిస్తాను. ప్రతిఘటన యుద్ధంలో, పార్టీలోని మితవాదులు, చైనాకమ్యూనిస్టులు, తమ కార్య కలాపాలన్నింటినీ, చియాంగ్-కై-షేకుతో ఏర్పరచుకొన్న ఐక్యసంఘటన "ద్వారానే" సాగించాలని డిమాండుజేసారు; అభివృద్ధినిరోధకమైన ఒక కేంద్ర రాజ్యాంగయంత్రం క్రింద, ఒక విప్లవాత్మక రాజ్యాంగయంత్రం అస్తిత్వంలో నుండవచ్చు ననిగానీ, అభివృద్ధినిరోధకమైన ఆ కేంద్ర రాజ్యాంగ యంత్రం తో తెగతెంపులు జేసుకోకుండానూ, తన స్వాతంత్ర్యాన్ని నిల బెట్టుకొంటూ, తన స్వాతంత్ర్యాధికారాన్ని నిలబెట్టుకొంటూ; విప్లవాత్మక రాజ్యాంగ యంత్రం వుండవచ్చుననన్న విషయం, యీ మితవాదులకు యింతకుపూర్వం తెలియదు.

కామ్రేడ్ మావోసీటుంగ్ యీ తప్పుడు దృక్పథా లను విసర్జించాడు. వివిధ కాలాలలో వివిధ మిత్రులకు అనువర్తించుటకు వివిధ పాలసీలను రూపొందించాడు. 1927 తరువాత చైనా బూర్జువావర్గం, రెండు గ్రూపు లుగా విభాజితమైయున్నదని ఆయన సూచించాడు. అంటే,

అధికారంలో ఉన్న బడా బూర్జువావర్గము, లేక నిరంకుశ పెట్టుబడిదారుల నిరంతరకష్టాలకు గురిచేయబడిన మధ్యమ తరగతి బూర్జువావర్గము లేక జాతీయ బూర్జువావర్గమని — ఈ రెండురకాలైన గ్రూపులు ఉన్నాయని ఆయన సూచించారు. ఇందులో మొదటిగ్రూపు (బడా బూర్జువావర్గం, లేక నిరంకుశ బూర్జువావర్గం). చైనావిప్లవానికి గురికావలసిన అంటే ఈ మొదటిగ్రూపుతో చైనావిప్లవం పోరాడవలసి ఉన్నదని కామ్రేడ్ మావోసేటుంగ్ సూచించారు. ఈ బడా బూర్జువావర్గంలో కొంతమంది జపాను వ్యతిరేక ప్రతిఘటన యుద్ధకాలంలో జపాను వ్యతిరేక శిబిరంలోకి వచ్చినప్పటికీ నిర్మాణరంగంలోగాని లేక కార్యక్రమ రంగంలోకాని చైనా కమ్యూనిస్టుపార్టీతో ఐక్యసంఘటనలోనికి ఎన్నడూ రాలేదు. అంతేకాదు, చైనా కమ్యూనిస్టులను, చైనాప్రజలను తమ పచ్చి శత్రువులుగా బడా బూర్జువావర్గం భావించింది. అందువలన వీరిద్వారా "చైనాకమ్యూనిస్టులు తమ కార్య కలాపాలన్నింటిని సాగించజాలకపోయారు. అంతేగాక చైనా కమ్యూనిస్టులు తమ స్వాతంత్ర్యాన్ని, చొరవను తమ ఐక్యసంఘటనలో ఉత్తమస్థాయిలో నిలబెట్టుకోవాల్సివచ్చింది."

రెండవగ్రూపు అంటే మధ్యమతరగతికి చెందిన లేక జాతీయ బూర్జువావర్గము చాలా బలహీనమైన ఊగిసలాడుతున్న శక్తి. కార్మికవర్గంతో దానికి భేదాభిప్రాయాలున్నై. అయితే సామ్రాజ్యవాదము,ఫ్యూడలిజము (జమీందారి విధానము) బడా బూర్జువావర్గాలతో దానికి అభిప్రాయభేదాలు ఉన్నాయికూడ. ఈ కారణంవల్ల కొన్ని నిర్ణీతపరిస్థితులలో

ఈ గ్రూపును విప్లవంవైపునకు మరలించుకోవచ్చును. దానిని కొంతవరకు కార్మికవర్గంతో ముడిపెట్టవచ్చును.

ఆ విధంగా అది పూర్తిచేయువలసిన చారిత్రకపాత్రను దానిచే పూర్తి చేయించవచ్చును. కార్మికవర్గం పటిష్టమైన విప్లవాత్మక విధానాన్ని సవ్య నిర్మాణ క్రమాన్ని అనుసరించి నట్లయితే కొన్ని సమయాలలో జాతీయ బూర్జువా వర్గంతో సమైక్యమాతూ కొన్నిసమయాలలో జాతీయబూర్జువా వర్గం తో పోరాడుతూ ఉంటే ఈ జాతీయ బూర్జువావర్గం "అత్యంత ప్రమాదకర శత్రువుగా తయారు కాజాలదు." కామ్రేడ్ మాసీయాంగ్ యొక్క విధానం విజయవంతంగా బడాబూర్జువావర్గంయొక్క పరిపాలనను కూలద్రోసిందని విషయాలు ఋజువు చేశాయి. అంటే నిరంకుశ దళారీ పెట్టుబడిదారులను కూలద్రోసిందనీ ప్రజలప్రజాతంత్ర ఐక్యసంఘటనలో జాతీయ బూర్జువావర్గాన్ని ఒకభాగంగా చేయగలిగిందనీ విషయాలు ఋజువుచేశాయి. యీ విషయంలో కామ్రేడ్ మాసీయాంగ్ అనుసరించిన విధానం సవ్యమైనదని అతివాద లేక మితవాద అవకాశవాదులు తప్పుడుమార్గాన పడ్డారనుట సుస్పష్టమైనది.

పార్టీయొక్క అభివృద్ధి చైనా విప్లవాభివృద్ధి చైనా ప్రజల విప్లవాత్మక యుద్ధాభివృద్ధి అనేవి ఒకదానినుండి మరి యొకటి విడదీయరానిదని చైనా కమ్యూనిస్టు పార్టీయొక్క 30 సంవత్సరాల చరిత్ర ఋజువుచేసింది.

కామ్రేడ్ స్టాలిన్ ఈ క్రిందివిధంగా అన్నారు:—

"ఇంతకు పూర్వం 18, 19 వ శతాబ్దాలలోని విప్ల

వాలు ప్రజల తిరుగుబాట్లతో ప్రారంభమయ్యేవి. అందులో ఎక్కువ భాగం నిరాయుధమైన లేక ఆయుధసంపత్తి ఎక్కువ గా లేని ప్రజలచే చేయబడిన విప్లవాలుగా ఉండేవి. పాతప్రభుత్వపరిపాలకుల సైన్యంతో పై నుదహరింపబడిన నిరాయుధులైన ప్రజలు సంఘర్షించేవారు. సైన్యాన్ని విచ్ఛిన్నం చేయుటకుగానీ, లేక కనీసం ఈ సైన్యంలోని ఒక భాగాన్ని తమవైపునకు త్రిప్పుకొనుటకుగాని యత్నించేవారు. గత కాలంలోని విప్లవాత్మక తిరుగుబాట్లకు నమూనా యిది. 1905 వ సంవత్సరములో రష్యాలో మనకు ఈ విధంగానే సంభవించింది. చైనాలో విషయాలు మరొకవిధంగా సంభవించాయి. పాతప్రభుత్వపు సాయుధసైన్యాలకు వ్యతిరేకంగా పోరాడినది నిరాయుధులైన ప్రజలుకాదు. తమ విప్లవాత్మక సైన్యంగా రూపొందిన సాయుధ ప్రజలు పోరాడారు. చైనాలో సాయుధమైన విప్లవ ప్రతీఘాతుకత్వానికి వ్యతిరేకంగా సాయుధవిప్లవం పోరాడుతూఉంది. చైనా విప్లవం యొక్క స్వభావాలలో యిదిఒకటి; సౌలభ్యాలలో యిదిఒకటి; చైనావిప్లవ సైన్యంయొక్క విశిష్ట ప్రాధాన్యతకూడా యిందులోనేఉంది." (స్టాలిన్ చైనావిప్లవ వైఖరులు.)

కామ్రేడ్ స్టాలిన్ యొక్క ఈ దృక్పధాన్ని సిద్ధాంతం, మరియు ఆచరణలలోను ఈరెండింటిలోను కామ్రేడ్ మావోసీ యాంగ్ పరిపూర్ణంగా అభివృద్ధిజేసాడు. 1927 ఆగస్టునుండి అంటే చైనా కమ్యూనిస్టుపార్టీ విప్లవయుద్ధ నాయకత్వాన్ని విప్లవసైన్యాన్ని స్వతంత్రంగా చేపట్టినప్పటినుండీ చైనా కమ్యూనిస్టుపార్టీ విప్లవయుద్ధాన్ని కొనసాగించుటలో ఎన్నడూ

వెనుకబడలేదు. చైనా విప్లవానికి విప్లవాత్మక యుద్ధమనేది ప్రధాన పోరాటరూపంగా అయింది. చైనావిప్లవానికి సాయుధ విప్లవనిర్మాణం ప్రధాన నిర్మాణరూపంగా అయ్యింది. విప్లవాత్మక యుద్ధంయొక్క ఆటుపోటులను విప్లవ సైన్యంయొక్క పురోగమన తిరోగమనాలు చైనా విప్లవంయొక్క ఆటుపోటులకు ప్రతిబింబం. అనేక సంవత్సరాల విప్లవాత్మక యుద్ధకాలములో పార్టియొక్క ప్రధాన కార్యకర్తలందరు సైనికకమ్యూనిజం జీవితాన్ని గడిపారు. వీరివిప్లవాత్మక క్రమశిక్షణ, స్వార్థత్యాగతత్వాలు, శాంతియుతపరిస్థితులలో తమ జీవితాన్ని గడుపుచున్న ప్రజల ఊహకు అందరానంత ఉన్నత స్థాయిలో ఉన్నై.

చైనావిప్లవయుద్ధాలకు సంబంధించిన వ్యూహరచనా విధానసమస్యలపై ఒక వుద్గ్రంథాన్ని ప్రకటించుటద్వారా కామ్రేడ్ మావోసీటూంగ్, మార్క్సిస్టు - లెనినిస్టు సైనిక సిద్ధాంతభాండారానికి అమూల్యమైన కానుకను సమర్పించేడు. కామ్రేడ్ మావోసీటూంగ్ యితరరంగాల విషయంలో రచించిన పుస్తకాల కానుకులలాగునసే యివి సైద్ధాంతికతత్వానికి వ్యతిరేకంగా యదార్థమార్క్సిజం - లెనినిజం సాగించిన నిశ్చయాత్మక పోరాటఫలితంగా యేర్పడ్డాయ్. ఉదాహరణకు సైద్ధాంతికతత్వం, కామ్రేడ్ స్టాలిన్ ప్రబోధాలను స్వీకరించక 1927 సంవత్సరం తర్వాత నాలుగు, అయిదు సంవత్సరాలలో నగరాలలో తిరుగుబాట్లు గొనివచ్చుటకై పార్టి తన దృష్టిని కేంద్రీకరించాలని నొక్కివక్కాణించింది. అటుతర్వాత నగరాలలో తిరుగుబాట్లను సంఘటితపరచాలన్న భావాలవలన

పార్టీ సంఘాలకు తీవ్రనష్టంవాటిల్లినతర్వాత సైద్ధాంతికతత్వ వాదులు 1934 సంవత్సరంలో చైనాకార్మిక - కర్షక - ఎర్రసైన్యం స్థాయీ-యుద్ధాన్ని (పొజిషనల్ వార్ ఫేర్ ను) సాగించాలని పట్టుబట్టేరు. తత్ఫలితంగా ఎర్రసైన్యం, తన స్థావరాలను తప్పనిసరిగా వదలిపోవాల్సి వచ్చింది. సైద్ధాంతిక తత్వవాదులను వ్యతిరేకించుతూ 1927 సంవత్సరం తర్వాత కాలంలో కామ్రేడ్ మావోసీయాంగ్ గ్రామీణ ప్రాంతాలను నగరాల అధ్వర్యాన వుంచాలన్న విధానానికి బదులుగా (సాధారణ పరిస్థితులలో మాత్రమే గ్రామీణ ప్రాంతాలను నగరాల అధ్వర్యాన వుంచ వీలవుతుంది) నగరాలను గ్రామీణ ప్రాంతాలచే చుట్టు ముట్టించాలన్న విధానాన్ని మొట్టమొదట రూపొందించాడు. (దైదాని భావమేమంటే సైద్ధాంతిక తత్వవాదులు నగరాలలో విప్లవ స్థావరాలను ఏర్పరచి వాటి నాయకత్వంక్రింద గ్రామీణ ప్రాంతాలలో విప్లవం గొసిరావాలని వాదించారు. యదార్థానికి నగరాలలో శత్రువు తన బలాన్నంతటనూ కేంద్రీకరించుకొనియుండుటచే గ్రామీణ ప్రాంతాలలో శత్రువు బలహీనంగా వుండుటచే కామ్రేడ్ మావోసీయాంగ్ గ్రామీణ ప్రాంతాలలో విప్లవ స్థావరాలను యేర్పరచి . అంటే నగరాలచుట్టూ వున్న గ్రామీణ ప్రాంతాలలో విప్లవస్థావరాలను నిర్మించాలని ఆవిధంగా నగరాలను, ముందుముందు వశం చేసుకోవచ్చునని చెప్పేడు.) కామ్రేడ్ మావోసీయాంగ్ ఒకరకపు గెరిల్లా యుద్ధ తంత్రాన్ని ఎర్రసైన్యం శత్రుసైన్యాలకన్న సంఖ్యారూపేణా ఆయుధ సంపత్తిరూపేణా తక్కువగా నున్నప్పుడు

దానిని నడుపుటకు గెరిల్లా యుద్ధతంత్ర రకానికిజెందిన చంచల మాన యుద్ధాన్ని (మొబైల్ వార్ ఫేర్) రూపొందించేరు. గ్రామీణ ప్రాంతాలద్వారా నగరాలను చుట్టు ముట్టాలన్న కామ్రేడ్ మావోసీయాంగ్ విధానం పరిపూర్ణంగా విజయవంత మైనదని విషయాలు రుజువుజేసేయ్.

విజయవంతమైన గెరిల్లా యుద్ధతంత్ర క్రమంలో అభి వృద్ధిజెందుతూ, ఎర్రసైన్యం, చిట్టచివరకు యీనాటి శక్తి మంతమైన ప్రజావిముక్తి సైన్యంగా తయారయ్యింది; స్థాయీ యుద్ధ తంత్రాన్ని (పొజిషనల్ వార్ ఫేర్‌ను) నడుపగలిగిన స్థితిలోనికి వచ్చింది. దీనిబట్టికూడా, కామ్రేడ్ మావోసీయాంగ్ యొక్క విధానం సవ్యమైనదనీ, సైద్ధాంతిక తత్వవాదుల విధానం అపసవ్యమైనదనీ సుస్పష్టమవుతూవుంది.

పార్టీయొక్క చారిత్రికానుభూతిని సంగ్రహపరచి చెపుతూ, కామ్రేడ్ మావోసీయాంగ్, చైనావిప్లవానికి అంత ర్జాతీయ సహాయంయొక్క ప్రాధాన్యతనుగురించి, అందులో ముఖ్యంగా సోవియట్ యూనియన్ సహాయంయొక్క ప్రా ధాన్యతనుగురించి అనేకసార్లు నొక్కి వక్కాణించారు. 1919 సంవత్సరం నాటినుండి చైనావిప్లవం, ప్రపంచ శ్రామికవర్గ సోషలిస్టు విప్లవంలో విడదీయరాని అంతర్భాగమనీ, యీ ప్రపంచ శ్రామికవర్గ సోషలిస్టువిప్లవం, రష్యాలో సంభవిం చిన అక్టోబరు సోషలిస్టు మహావిప్లవంతో ప్రారంభమయ్యిం దనీ, యీఅక్టోబరు సోషలిస్టు మహావిప్లవంయొక్క ప్రభావం చైనావిప్లవంపై తప్పకపడిందనీ, అనేది కామ్రేడ్ మావోసీయాంగ్ యొక్క నూతనప్రజాతంత్రవిప్లవ సిద్ధాంతానికి అతిముఖ్యమైన

ప్రారంభబిందువు. ఏకాకిగాగానీ లేక సహాయం లేకుండా గానీ చైనావిప్లవ మెన్నడూ నడువలేదు. సోవియట్ యూనియను అంతర్జాతీయ శ్రామికవర్గాల దిక్సూచన, ప్రోత్సాహం, సపోర్టులవలన చైనావిప్లవం నిరంతరం ముందుకుసాగింది. సోవియట్ యూనియన్‌యొక్క నిరంతర సహాయంలేనిదే అంతర్జాతీయ శ్రామికవర్గ సహాయంలేనిదే అందులో ప్రత్యేకంగా ప్రథమ విప్లవాత్మక అంతర్యుద్ధంలో చైనా కమ్యూనిస్టుపార్టికి, చైనాప్రజలకు కామ్రేడ్స్ లెనిన్, స్టాలిన్ల నాయకత్వాన నడచుచున్న అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థయొక్క సహాయం లేకపోయినట్లయితే పాశ్చాత్యదేశాలలో హిట్లరును నాశనంచేయుటలోనూ, ఈశాన్యచైనాలో జపాను సామ్రాజ్యవాదుల క్వాంటుంగ్ సైన్యాలను నాశనంచేయుటలో సోవియట్ సైన్యంయొక్క సహాయం లేకపోయినట్లయితే చైనా ప్రజారిపబ్లికు స్థాపింపబడగానే దానికి రాజనైతిక, ఆర్థికరంగాలలోనూ, తదితరరంగాలలోనూ సోవియట్ యూనియన్ తన సహాయాన్ని విస్తరించపోయినట్లయితే చైనా విప్లవంయొక్క ప్రస్తుతవిజయం అసాధ్యమయ్యేదని చైనా కమ్యూనిస్టుపార్టి యొక్క ముప్ఫయి సంవత్సరాల చరిత్ర ఋజువుజేస్తూవుంది.

అక్టోబరు సోషలిస్టు మహావిప్లవం బహిర్గత మొనరించిన ఆశయం—ప్రపంచ కార్మికవర్గం, వలస, అర్థ-వలస దేశాల ప్రజల విముక్తి ఆశయం—విజయవంతంగా సాగగలదని ప్రపంచ కార్మికవర్గానికి వలస, అర్థ-వలస దేశాల ప్రజలకు చైనా విప్లవ విజయం గట్టిగా విశ్వాసాన్ని చేకూర్చింది.

"అక్టోబరు విప్లవం; జాతీయ సమస్య" అన్న తన వ్యాసంలో 1918 లో కామ్రేడ్ స్టాలిన్ అక్టోబరు విప్లవం యొక్క ప్రపంచ ప్రాధాన్యతనుగురించి యిలా వ్రాసాడు:-

అక్టోబరు విప్లవంయొక్క ప్రపంచ ప్రాధాన్యత ప్రధానంగా యీ క్రిందివాటిలో వుంది.

1. అది యూరపు ఖండంలో జాతీయపీడనకు వ్యతిరేకంగా జరుపబడే పోరాటంయొక్క ప్రత్యేక సమస్యనుండి జాతీయ సమస్యను సామ్రాజ్యవాదులనుండి విముక్తి చెందుటకై పీడితప్రజలు, వలస, అర్ధ-వలస దేశాల ప్రజలు జరుపునట్టి పోరాట సమస్యగా మార్చివేసింది. ఆవిధంగా జాతీయ సమస్య వైశాల్యాన్ని విస్తరింపజేసింది.

2. ఈ విముక్తి పోరాటాలకు యిది యదార్థ మార్గాలను ఏర్పరచింది. విశాలంగా సౌలభ్యాలను చేకూర్చింది. ఆవిధంగా పాశ్చాత్య దేశాలలోని ప్రజానీకమూ, తూర్పు దేశాలలోని ప్రజానీకమూ, సామ్రాజ్య వ్యతిరేకపోరాట మహాప్రవాహంగా ఏకమై పోరాడుటకు సౌలభ్యాన్ని చేకూర్చింది.

3. పాశ్చాత్యశ్రామికులనుండి రష్యను విప్లవంద్వారా తూర్పుదేశాలలోని పీడితప్రజానీకంవరకు విస్తరించుచూ, ప్రపంచసామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఒక నూతన విప్లవాత్మకరంగాన్ని స్థాపించుతూ అది పాశ్చాత్యసోషలిస్టు దేశాలకు పీడిత తూర్పుదేశాలకు ఒక వంతెనను నిర్మించింది.

ముప్పయిమూడు సంవత్సరాలక్రితం కామ్రేడ్ స్టాలిన్ చెప్పిన మహాజోస్యం, ఒకమహావాస్తవంగా రూపొందిం

దీనాడు. అంతేగాక, చైనావిప్లవంయొక్క విజయఫలితంగా తూర్పుదేశాలలో పటిష్టమైన విప్లవనౌక ఏర్పడింది. ఈవిప్లవ నౌక సోవియట్‌యూనియన్, మరియు ఆగ్నేయయూరపు ఖండంలోని ప్రజలప్రజాస్వామికరాజ్యాలతో జేరి ఒక విప్లవ మహానౌకాదళంగా తయారయ్యింది. తమవిముక్తికై ప్రపంచ శ్రామికప్రజానీకం జరుపు పోరాటవిజయానికి యిది అమితోత్సాహాన్ని, విశ్వాసాన్ని కలుగజేయగలదనుటలో సందేహం లేదు. వేగంగా, సామ్రాజ్యవాదం, తనసర్వనాశనాన్ని జేరుకొంటూవుంది.

మహోఘనమైన, కీర్తివంతమైన నిరంతరం సవ్యపథాన పయనించే చైనా కమ్యూనిస్టుపార్టి, దాని మహానాయకుడైన కామ్రేడ్ మాసీయాంగ్ వర్ధిల్లాలి!

ప్రపంచ శ్రామిక ప్రజలకు బోధకుడైన కామ్రేడ్ స్టాలిన్ జిందాబాద్!



|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 108 B171 |
| పుస్తకం పేరు | కమ్యూనిస్టు పార్టీ చరిత్ర |
| తారీఖు | 25/10/84 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 188 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Pratyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |